# రాధ

పొన్నలూరు పద్మావతి

నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ-2

# RAADHA

(Serialised in Vanitha Fortnightly)

By

Smt. Ponnaluru Padmavathi

*First Edition :*
July '78

894 : 8133

*Printers :*
"SRI SOBHANACHALA"
Vijayawada - 1

*Cover Design :*
B A P U

*Publishers :*
Navajyothi Publications
Eluru Road
VIJAYAWADA - 2.

*Price :*
Rs. 10-00

అత్తగారైన
శ్రీమతి పొన్నలూడు సుందరమ్మగారికి భక్తితో
—రచయిత్రి.

"నవజ్యోతి" ప్రచురణలు !

పుస్తకాల షాపుల్లో ప్రత్యేక ఆకర్షణలు

గ్రంథాలయాలకు అమూల్యమైన ఆకర్షణలు

ఆధునిక సాహిత్యంలో

నిరంతరం చిత్తశుద్ధితో శ్రమిస్తూ

ఎన్నో వినూత్న రచనలను

పాఠకలోకానికి అందిస్తూ,

వారికి నూతనోత్సాహాన్ని, ఆహ్లాదాన్ని పంచే

ఉత్తమ రచనలు ప్రచురిస్తున్నాము.

ఆ పరంపరలోనిదే ఈ నవల

"రా ధ"

# రాధ

అప్పుడే వెంకటేశ్వర సుప్రభాతం చదవడం ప్రారంభించిన రాఘవయ్యను చూసి మనసులోనే విసుక్కుంది రాధ. "నాన్నెప్పుడూ యింతే? ప్రపంచం మునిగిపోతున్నా పూజ చెయ్యందే కదలడు ... హీనపక్షం అరగంటైనా పడుతుంది, పూజ ముగిసేసరికి - అప్పటికి ఆ శుభఘడియలు గడిచిపోవు గదా!" ఆత్రుతగా దేవుని గదిలోకి చూడసాగింది. అప్పుడే పూర్తయ్యేట్టు లేదు.

చెల్లెలి కోసం చూసింది - సౌదామిని బాత్‌రూమ్ వైపు దారితీస్తోంది. ఆలస్యాన్ని భరించలేక రాధ వాకిట్లోకి నడిచింది. అక్కడి పూలమొక్కలు, జాజిపందిళ్ళు ఆహ్వానించాయి. తిన్నగా వెళ్ళి సిమెంటుబెంచీ మీద కూర్చుంది.

కాలక్షేపానికి నింగికేసి చూపు సారించింది. నీలాకాశంలో అక్కడక్కడా నల్లమబ్బులు, బండరాళ్ళలా నిలిచి

వున్నాయి. మధ్య తెల్లమబ్బులు—వాటి మధ్య నన్న సన్న మేఘ శకలాలు పిచ్చి ముక్కల్లా కదలాడుతున్నాయ్. రాధ చటుక్కున 'వాచీ' కేసి చూచుకుని ఉలిక్కిపడింది.

"అక్కయ్యా! నువ్వీరోజు స్కూలు కెళ్ళవా?" పలకరించింది సౌదామిని.

"సౌదా! లోపలికిరా! నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి!" అంటూ హాల్లోకి నడిచింది రాధ.

అనుసరించింది సౌదామిని.

సౌద నడగబోయే విషయాన్ని తలచుకుంటూనే రాధ మనసు అనిర్వచనీయమైన ఆనందానుభూతిని పొందసాగింది. తనకు లోపించిన సుఖాలేవో ఇతరులకు ప్రాప్తించ బోతుంటే సంతోషాతిరేకంతో పొంగిపోతుంది రాధ. అందులో తను అభిమానించే మాధవ్‌తో సౌదామినికి వివాహం జరగ బోవడం తన కెంతో ఆనందదాయకం. తన ఆత్మీయుల కష్ట సుఖాలే తనవి - తనకంటూ ప్రత్యేకమైన సుఖాలేవీ లేక పోయినా అందరి సంగతులూ తనవే...

"మాట్లాడాలన్నావ్! త్వరగా చెప్పు. కాలేజీకెళ్లాలి." తొందరచేసింది సౌద.

తనేం చిన్నపిల్లకాదు. తన పెండ్లిని గురించి అను కోవడం వినే వుంటుంది. తను చెప్పబోయే మాటను ఊహించు కుని సిగ్గుల పెండ్లికూతురౌతుందనుకున్న చెల్లెలు, సర్వ సాధారణంగా మాట్లాడేసరికి చకితురాలైంది రాధ.

చెల్లెలి సమ్మతి తీసుకోకుండా మాటివ్వకూడదని నిర్ధారించుకుంది.

"చూడు సౌదా! మాధవ్‌తో నీ పెళ్ళి నిశ్చయం చేసుకుని రావడానికని నాన్నగారు వెళుతున్నారన్న సంగతి నీకు తెలుసనుకుంటాను...సమ్మతమేనా?" చెల్లెలి ముఖంలోకి మురిపెంగా చూచింది.

"అక్కయ్యా! నా జవాబు నీకు బాధాకరంగా వుంటుంది. కాని తప్పదు. ఇది నా వ్యక్తిగత విషయం. కనుక చెప్పక తప్పదు. సంబంధం స్థిరపరచుకు రావడానికి నాన్నగారిని వెళ్ళొద్దని చెప్పవే! ప్లీజ్" ప్రాధేయపూర్వకంగా అక్క చేతులు పట్టుకుంది సౌద.

"ఏమిటే నీవనేది? పెళ్ళంటే వేళాకోళంగా వుందంటే నీకూ! నీ కిష్టంలేకపోతే ముందుగా చెప్పలేక పోయావా? తీరా నిశ్చయం చేసుకోబోతున్నప్పుడా కాదనడం!-అసలు నీ ఉద్దేశమేమిటో బయటపెట్టుముందు..." ఆందోళన ద్యోతకమైంది రాధ మాటల్లో. ఆమె ముఖం చిరుకోపంతో జేవురించింది. సౌదామిని కొంచెం కంగారు పడినా వెంటనే ధైర్యం పుంజుకుంది.

"మాధవరావు ప్రస్తుతం తల్లిదండ్రుల సంపాదన మీదనే జీవిస్తున్నాడు కదా! బి. ఎ. పూర్తయి ఉద్యోగం చేసేదెప్పుడూ? చేసినా-ఏం, సంపాదించగలడూ? అసలతని పురాతన మనస్తత్వమే నాకు నచ్చదు..." సౌద ముఖంలో

అతడిపట్ల నిరసన ప్రస్ఫుటమైంది. ఏదో భారం దించుకున్న ట్లుగా నిట్టూర్చి రూము కెళ్ళి పుస్తకాలు సర్దుకోవడంలో నిమగ్నమైంది.

రాధ చెల్లెలి వెంట గదిలోకి వెళ్ళింది.

ప్రతి విషయంలో తన సలహా పాటించే చెల్లెలు, ఈ నాడు తన మాట నిరాకరించేసరికి అవమానభారంతో కుంగి పోయింది రాధ. కాని చివరి ప్రయత్నం కూడా చేయా లనుకుంది.

"సా...దా...! బాగా ఆలోచించుకునే వద్దంటు న్నావా? అంత అందగాడు, నెమ్మదస్తుడు నంద సంవత్స రాలు తపస్సు జేసినా దొరుకుతాడా?—మనమేమన్నా పెద్ద కట్నాలిచ్చి ధనవంతుల్ని తేగల స్తోమతున్న వాళ్ళమా చెప్పు! మర్యాదలు జరిపి, చదువుకేదో సహాయం చేస్తే చేసుకుంటామన్నారని, నిశ్చయపరచుకోవాలనుకున్నాం. బంగారం లాంటి సంబంధం వద్దంటున్నావ్! నీకు మంచి రాత లేకనే దుర్బుద్ధి పుట్టింది. మన పరిస్థితి, నా మాటలు అర్థం చేసుకుంటే నీ విలా ప్రవర్తించవు—జవాబు చెప్ప వేమే!" అంటూ సాద చేతుల్లోని పుస్తకాలు వడిసి లాక్కుని, టేబుల్ మీద గిరవాటేసి చెల్లెలి కళ్ళలోకి సూటిగా చూడసాగింది.

ఆ చూపుల్లో సవాలక్ష సందేశాలు, వెయ్యి ప్రశ్నలు

కదులుతున్నాయ్. ఆ తీవ్ర దృష్టికి తట్టుకోలేని సౌద నేత్రాలు నేలకు వాలేయి.

"నీ చివరి సమాధానం ఏమిటి?" కఠినంగా ధ్వనించింది రాధ కంఠస్వరం.

అక్కకా పట్టుదలేమిటో అర్థంకాలేదు సౌదామినికి. అయినా నిష్కర్షగా చెప్పదలచుకుంది.

"పెళ్ళి విషయంలో చేసుకునే వారికి స్వాతంత్రం వుండాలనీ అదే ఉత్తమమైందనీ, ఎన్నోసార్లు నీవే అనే దానివే...అలాంటిది నా విషయంలో ఎందుకక్కా నీకీ పట్టుదల! కట్నం తక్కువైనా నా అందం చూచి ఎవరైనా చేసుకుంటారనే నమ్మకం నాకుంది." గర్వంగా తల ఎగరేసింది సౌద.

సడలింపులేని చెల్లెలి దృఢ నిశ్చయం చూచి అక్క ఆగ్రహం మితిమీరింది

"ఎంత లావణ్యవతివైనా అంత గర్వం పనికిరాదే! వేయి జన్మలెత్తినా, మాధవ్ లాంటి ఉత్తముడికి భార్యవు కాలేవు - చేతికి చిక్కిన రత్నాన్ని చేతులారా జార విడుచుకుంటున్నావ్!"

మాధవ్ పేరు ఉచ్చరిస్తున్నప్పుడు రాధ నయనాలు వెన్నెల రేఖలు వెదజల్లడం సౌదామిని గమనించి చిన్నగా నవ్వుకుంది.

"అక్కయ్యా! మాధవ్ పట్ల నీకంత గౌరవ భావ

మున్నప్పుడు—నువ్వే ఎందుకు చేసుకోగూ...డ...దూ ?? ”
అప్రయత్నంగా ఆ మాట అన్నందుకు నాలిక్కరచుకుంది.

“సౌ...దా...! నీ కేమైనా మతి పోయిందా ?”
బిగ్గరగా వెలువడ్డాయి మాటలు.

“నేను మతుండే మాట్లాడుతున్నాను. నీ విషయంలో జోక్యం పెట్టుకునే హక్కు నాకు లేదంటావా ?” చిరునవ్వు నాట్యం చేసింది సౌదామిని పెదాలపైన.

“నేను.... ఏమిటే... అవునంటూ రెట్టిస్తున్నావు. నీ కేమైనా బుద్ధుందా... !” చెయ్యి పైకెత్తింది రాధ.

చెల్లెలు చెయ్యకూడనిదేదో చెయ్యమని ఆదేశిస్తున్న దనే ఆవేదన–చెయ్యలేక పోతున్నందుకు పరితాపం—తను పరాభవింపబడుతున్నాననే రోషం- అన్నీ కలిసి విచక్షణా జ్ఞానం కోల్పోయింది రాధ.

ఒక్క క్షణంలో సౌద చెంప ఛెళ్ళుమనేదే కాని ఇంతలో జానకమ్మ వచ్చి కూతురి చెయ్యి పట్టుకుంది.

“దానిమీదేంటమ్మా నీ దౌర్జన్యం ?” అంటూ మందలించింది. తన తొందరపాటుకు పశ్చాత్తాపం కలిగింది రాధకు. ముని పంటితో క్రింది పెదవి కొరుక్కుంటూ – చేతులు నలుపుకుంటూ చెల్లెలివైపు క్షమించమన్నట్లు చూచి – బరువుగా అడుగులేసుకుంటూ అక్కడి నుంచి కదలింది రాధ.

పూజ గదిలో వున్న రాఘవయ్యకు ఇక్కడి ఘర్షణ

స్పష్టంగా వినిపించడంతో.. ధ్యానంలో నిమగ్నం కాలేక కర్పూర హారతిచ్చి లేచి వచ్చాడు.

సర్వం కోల్పోయినట్లు బాధపడుతూ దీనంగా నిలబడిన కూతుర్ని చూచి ఆర్ద్రత చెందాడు తండ్రి. లాలనగా రాధ వీపు నిమిరి గదిలోకి నడిచాడు.

"పోనీలే తల్లీ! నీ కిష్టం లేదు. వద్దని చెప్పావు. మే మెందుకు నిర్బంధిస్తాం.... అక్క మాటల్తో నీ కెందుకు? మాధవుడంటే మమతలో పడిచస్తుంది... అందుకే దానికంత పట్టుదల. ఆస్తా-పాస్తా! ఉద్యోగమా! హాడా! ఏదో పెద్ద ధనాగారం మునిగిపోయినట్లు గింజుకుంటుంది! నీ వేమీ నిశ్చింతగా ఉండు" అంటూ కూతురు తలను ఎదకు హత్తు కునే భార్యను, గువ్వపిట్టలా వొదిగి వున్న కూతుర్ని చూచి విస్మయం చెందాడు రాఘవయ్య. రాధ వారిపట్ల ఏదో అపరాధం చేసినట్లు భావించుకునే వారి అపోహకు వేదన కలిగింది.

"రాధ ఎందుకంత ఆదిగా ఆ మనువు కోసం ప్రాకు లాడుతున్నదో మీరు గ్రహించుకోలేక పోతున్నారు. గుణం లేనివాడితో పడిన అగచాట్లు అందరికీ అనుభవైక వేద్యమే అయినా ఆ శాస్త్రి చాలదన్నట్టు - ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు... 'బుద్ధిః కర్మానుసారిణీ' అన్నారు" గతాన్ని గుర్తు చెయ్యబోయి వ్యథలో పడ్డాడు రాఘవయ్య.

వేదాంత ధోరణి నచ్చని జానకమ్మకు కోపం ముంచు కొచ్చింది.

"ఏమయ్యోయ్! నీ శ్రీరంగనీతులు నా దగ్గర పనికి రావు! చేసేదంతా చేసి, అంతా విధి మీద నెడుతుంటావు- మాటలేమో సనాతనం, ఆచరణకు వస్తే ఆదర్శం-నీ బడాయిలు నా దగ్గర చెప్పకు" చేతులు వ్యంగ్యంగా తిప్పుతూ రుసరుసగా భర్తవైపు చూచి విసవిస గదిలోనుంచి దూసుకు వచ్చింది జానకమ్మ.

"...హ్హూ..." భారంగా నిట్టూర్చి క్రింది పెదవి విరక్తిగా విరిచి నుదుటి మీద బాధగా బొటన వేలితో రుద్దు కున్నాడు రాఘవయ్య.

"నా...న్నా!" చేతులు నలుపుకుంటూ దీనంగా పిలిచింది సౌదామిని. ఆ చూపులో మన్నించమనే ధోరణి వ్యక్తమైంది.

తన ఆదేశాన్ని తిరస్కరించిందని రోషం కలిగినా, జాలిగొలిపే గొంతుక విని పితృవాత్సల్యం పెల్లుబికింది.

"నువ్వు విరమించుకుంటున్నాను సరా !" అక్కడి నుండి కదలబోయాడు.

"నాన్నా ! నీ మనసెంత మంచిది నాన్నా ! మీమాట తృణీకరించానని ఆగ్రహిస్తారని భయపడ్డాను...కాని అనుగ్ర హిస్తారనుకోలేదు...."

"పిచ్చితల్లీ! మిమ్మల్ని బాధపెట్టి మేమేం బావుకుంటా వమ్మా!" కూతురి తలను ఆప్యాయంగా నిమిరాడు.

అదే అభయహస్తంగా భావించి భయాన్ని వదిలింది సౌదామిని.

వాకిలిగేటు వేసిన శబ్దం కాగా, గుమ్మం దగ్గరకెళ్ళాడు రాఘవయ్య. తండ్రిని అనుసరించింది రాధ.

ఆదుర్దాగా ఒక అడుగువేసి కంగారుగా ద్వారంలో నుంచి తొంగిచూచింది. తన అనుమానం స్పష్టంగా రుజువు కాలేదు. దూరంగా ఆ సందుమలుపు తిరిగిన యువకుడు.... మాధవ్ కాదుకదా! అతడయితే!....గుండె దడదడలాడింది. మనసెంతో నీరసించి పోయింది. కాళ్ళు తడబడగా ఇంట్లోకి నడిచింది రాధ.

పుస్తకాలు చేతబట్టుకుని గడపలోనే ఎదురైంది సౌదామిని.

చెల్లెలి వదనంలోకి తదేకంగా చూచింది రాధ.

కొద్దిగా జంకుతో ఒదిగి నడిచింది కాని ఆమె ముఖం కమలంలా భాసిస్తోంది. నిమ్మకు నీరెత్తినట్లున్న చెల్లెల్ని చూచి చకితురాలైంది అక్క.

ఆరోజు స్కూలుకు రానని సెలవు చీటీ రాసి చిన్న చెల్లెలు నివేదిత చేతికిచ్చి పంపింది.

ఈజీచైరులో మేనువాల్చిన రాధకు గతం గాయంగా,

భవిష్యత్తు భయంగా — వర్తమానం అయోమయంగా తోచ సాగింది. కలత నిండిన మనస్సుతో ఏదో ఆలోచిస్తూ కళ్ళు మూసుకున్నది.

రాఘవయ్య కుమార్తె వంక దీనదృక్కులు ప్రసరిస్తూ మూగ వేదనతో మౌనం వహించాడు.

జానకమ్మ వాళ్ళను విచిత్రంగాచూస్తూ మూతిమూడు వంకలు త్రిప్పుకుంటూ వెళ్ళింది.

వాళ్ళ ధోరణులు గమనించని రాధ తన మనసులో చెలరేగే ఆలోచనలతో సతమతం కాసాగింది.

# 2

వికల మనస్కురాలైన రాధ నిలకడగా ఒక్కచోట కూడా గడపలేకపోతూంది. పుస్తకాల బీరువా, అన్నయ్య టేబుల్, తనపెట్టె-ఎన్నో సర్దింది. ఒక్క పనైనా స్థిమితంగా చెయ్యలేక పోతోంది. యాంత్రికంగా మరబొమ్మలా తిరుగుతున్న రాధను ఎవ్వరూ పలకరించలేక పోతున్నారు. తల్లి మాటలు ఈసడింపుగా వుంటాయని, ఆమె నేమీ మాట్లాడవద్దని బ్రతిమాలుకున్నాడు తండ్రి. తన లాలింపు మాటలు మేఘావృతమైన కూతురి మనస్సుపై, చల్లగాలిలా పనిచేసి, వర్షింపజేస్తాయనే జంకుతో ...పిలవడం విరమించుకున్నాడు. చెల్లెళ్ళిద్దరూ అక్క చాయలకు రావడానికి సంశయిస్తున్నారు.

తన ఎదుటికి రావడానికి సాహసించని వాళ్ళను చూచి, తనను వెలివేసినంతగా బాధ కలిగింది రాధకు. తనేదో పరాభవించబడినట్టు, ఓడిపోయినట్లు వ్యధ కలుగుతోంది ఆమెకు.

తను వారిపట్ల చేసిన అపరాధమేమిటో ఆమెకు అర్థం కాలేదు. ప్రతివారి విషయాల్లో తలదూర్చడమే తన నేరమా? అందరి భవిష్యత్తు గురించి తలపోయడం తప్పేనేమో!

ఎదిగిన ఏ ఆడపిల్లా, తనలా కన్నవారింటిపై యింత మమకారం చూపదేమో! తన ఆత్మీయులే తనకు పంచ ప్రాణాలు. తనకు వేరే లోకం లేదు. తన ప్రపంచం తన వాళ్ళు మాత్రమే. అలా కాకుండా తనకూ ఒక జీవితమంటూ వుంటే....? ఆ పైన ఆలోచించలేక వంటింట్లోకి వెళ్ళి-ఓగ్లాసు మజ్జిగ తాగి వచ్చింది. కొంత తాపం ఉపశమనం పొందినట్లయింది.

అక్కడున్న పూలబుట్ట తీసుకుని పూలచెట్లసమీపానికి చేరింది.

సౌకుమార్యంతో అలరారుతూ, సౌరభాన్ని అందించే పూలబాలల్ని తాకుతున్నప్పుడు, హర్షాతిరేకంతో పులకించిపోతుంటుంది రాధ. ఏనాటి కానాడు కొత్తభావాలు మదిని మధురానుభూతితో నింపుతుంటాయి. అవే తనకు సంతోషాన్నిచ్చే సాధనాలు. కాని ఆ రోజు... ఎలాంటి అనుభూతి లేక యాంత్రికంగా పువ్వులను త్రుంచి మాల కట్టసాగింది.

మనోవీధిని ఆక్రమించుకున్న విచార మేఘాలను ఏ విధంగా తొలగించుకోవాలో మార్గం గోచరించ లేదామెకు.

గేటుతీసిన చప్పుడు కాగా తలెత్తి చూచింది.

మాధవ్ తనవైపే చూస్తూ వస్తున్నాడు.... ఈ సంగతెలా చెప్పడం? నాన్న సౌదామినితో పెళ్ళి స్థిరపరచుకోడానికి వాళ్ళింటికొస్తున్నాడని విన్నప్పుడు వెన్నెల వెదజల్లిన అతడి నయనాలు అలా జరగదని తెలిసినప్పుడు కళాహీనమై పోవా? సౌద నిరసన అవమానంగా భావించకుండా వుండగలడా ??... నాన్న వాళ్ళింటికి రాకపోవడంతో సంబంధం వద్దనుకున్నట్టు గ్రహించి .. అది అవమానంగా భావించి, ప్రైవేటుకు యిక రానని చెప్పి, ముఖాన నాలుగు దులపడానికే వచ్చుంటాడు—రోజూ అతణ్ని చూచే అదృష్టానికి కూడా దూరమౌతుంది. ఛ ఛ, ఏమిటీ చపలచిత్తం. ప్రతి దినం చూడాలని అభిలషించడం నేరం కాదా! ఏమిటీ వెర్రికోరిక ? ఛ ఛ, తన బుద్ధి వక్రమార్గాన పోతుందేమిటీ ?

"రాధాదేవిగారు! ఊహాలోకాల్లో మీరొక్కరే విహరించకపోతే, మాకూ కాస్త వర్ణించి చెప్పకూడదూ! మేమూ ఆనందంలో పాలుపంచుకుంటాం కదా!" అని మాధవ్ చిరునవ్వుతో పలకరించేదాకా రాధ ఆలోచనాపరం పరంలో మునిగిపోయివుంది

అతడివైపు నేరుగా చూచే సాహసం లేక నెమ్మదిగా కనురెప్పలు పైకెత్తింది.

ఎప్పటిలా మెరిసే కనులూ, అధరాలపై దరహాస వీచికలు, మంద్రస్వరం, కొంచెం కూడా మార్పు లేని రూపం.

ప్రస్తుత పరిస్థితి అతణ్ని ఆందోళనపరచలేదేమిటి ?

ఐనా తనకెందుకీ తాపత్రయం ? పాపం అతనికి అసలు విషయం తెలియక పోవచ్చునేమో ! ఏదో అనివార్య కారణాలవల్ల నాన్న వెళ్ళినట్లుగా మాత్రమే అనుకుంటు న్నాడేమో ! సౌదామిని తిరస్కృతిని ఎలా చెప్పడం ??

తన రాకను గుర్తుచేస్తూ తాళపు చెవితో కుర్చీమీద శబ్దం చేశాడు.

"కూర్చో మాధవ్ ! అన్నయ్య ఇంకా పూర్తించి రాలేదు" అన్నది రాధ తన గాభరాను అణుచుకోడానికి ప్రయత్నిస్తూ - చిరునవ్వును అరువు తెచ్చుకుంటూ.

"క్రొత్తగా మాట్లాడుతున్నావేమిటీ ? మాస్టారుగారు వూళ్ళో లేకపోతే-తప్పక ఇంటికొచ్చిపోతూ వుండు, అవసరా లేవైనా వుంటాయి అంటుంటారుగా !" అతి సహజంగా అన్నాడు మాధవ్.

జవాబు దొరకలేదు రాధకు.

ఇరువురి మధ్య మౌనం రాజ్యం చేసింది.

"నీవలా 'డల్'గా వుంటే బాగోలేదు. ఏమైనా మాట్లాడు రాధమ్మా !" ప్రాధేయత ధ్వనించింది అతడి మాటల్లో.

"ఏం మాట్లాడను? మాటలు దొరకడం లేదు. ఇంక దొరకవేమో కూడా!" బరువుగా వెలువడ్డాయి మాటలు.

భావ గర్భితంగా విషయాన్ని వివరించబోయింది.

"అయితే నీ'ారంతా ఏదో ఉద్దేశం మనసులో పెట్టుకుని మాత్రమే నన్నభిమానిస్తున్నారన్నమాట? నేను చాలా పొరపాటు పడ్డాను!" మాధవ్ ముఖంలో కినుక, మాటల్లో నిష్ఠురత ప్రస్ఫుటమైనాయి.

"నువ్వసలు వున్న సంగతిని పసిగట్టినట్టు మాట్లాడుతున్నావే! అదే నిజమైతే దాన్నింత తేలిగ్గా తీసుకోగలిగావా?" అతడి పరిస్థితి గమనించే కొద్దీ విస్మయం కలగసాగింది రాధకు.

"పసిగట్టడమేం ఖర్మ, ప్రత్యక్షంగా విన్నాను. ఇంకేమైనా వివరాలు కావాలా?"

"మాధవ్! అన్నీ...అన్నీ విన్నావా?" రాధ గొంతు తడబడింది. శరీరం చిన్నగా కంపించసాగింది.

'భగవాన్! అతడెన్ని మాటలన్నా భరించాలా? అన్నీ తెలిసి అంత నిమ్మళంగా వున్నాడంటే, అది తుఫానుకు ముందు ప్రశాంతతే అయివుండాలి. అయితే ఓ బెడద తప్పింది. తనెలా వివరించాలా అన్న సమస్య తీరిపోయింది.' అనుకుని దీర్ఘ నిశ్వాస వదలి, కాస్త ధైర్యంగా ముఖం పైకెత్తింది రాధ.

"నీ వెందుకింత బెంబేలుపడిపోతున్నావో నా కవగతం

కావడంలేదు. నీ చర్యల్లో, మాటల్లో లోకాలన్నీ ముంచుకు పోతున్నంత చింత వ్యక్తమౌతోంది. నీ ఆకాంక్షను అనవసరంగా ఒకరి మీద రుద్దాలని చూశావు. అది బెడిసికొట్టింది. అనుకోని పరిణామానికి తట్టుకోలేకపోతున్నావు. అంతేగా ?" అనునయంగా అంటూ ప్రశ్నార్థకంగా చూచేడు మాధవ్.

తన మనోభావాలను క్షుణ్ణంగా చదవగలిగిన మాధవ్ నేర్పరితనానికి అచ్చెరువొందింది, విప్పారిన నేత్రాలతో విచిత్రంగా చూస్తూ కూర్చుంది.

మాటలు కరువై ప్రతిమలా వుండిపోయిన రాధను పలకరించలేక తనే మాట్లాడం ప్రారంభించాడు మాధవ్.

"శ్రద్ధగా విని ఆకళింపుచేసుకో ! యదార్థం ప్రస్తుతానికి బాధాకరమనిపించవచ్చునేమో ! కాని, అది భవిష్యత్తుకు బంగారు బాట కావచ్చు. ఒక్కొక్కసారి కొన్నినుంచికే దారితియ్యగలవు. సౌదామిని మాటల్లో అంతరార్థముంది. మన అందరి కళ్ళు తెరిపించే పరమసత్యం యిమిడివుంది"

"అయితే నన్నేమందో కూడా స్పష్టంగా విన్నావా మాధవ్ ! నేను...నేనట...నిన్ను" విషాదంగా నవ్వింది.

ఏదో పొరపాటు చేసినట్లు నాలిక కరచుకుంది.

"ఇందులో వింతేముంది? ఊహించని విషయం గనక విచిత్రంగా వుండడం సహజమే—నిప్పులాంటి నిజం కాల్చివేసేదే గాక ఆ పరిస్థితినిబట్టి చలికాచుకునేదిగా కూడా ఉప

యోగపడుతుంది !" అర్థయుక్తంగా అంటూ రాధ నయనా ల్లోకి తదేకంగా చూడసాగాడు.

అతడి ధోరణిలో ఏదో క్రొత్తదనం కొట్టవచ్చినట్లు గ్రహించింది రాధ.

'సాద నిరాకరించినందువల్ల నైరాశ్యంలో వేదాంతం పుట్టుకొచ్చి వుండవచ్చు. శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం తాత్కాలికాలేనంటారు. అలాగే, మరి తన ప్రసక్తి వచ్చినపుడు, గ్రుచ్చి గ్రుచ్చి చూడడం ఏమిటీ? అది తన భ్రమ కాదుకదా !'ఆమె మనసులో ప్రశ్నల పరంపరలు చెలరేగాయి.

ఆమె నుంచి సమాధానం రాదని గమనించి, తనే మళ్ళీ మాట్లాడ్డం మొదలుపెట్టేడు మాధవ్.

"సాదతో నా పెళ్ళి జరగనంతమాత్రాన, నీ వంత బాధెందుకుపడాలో నా కర్థం కావడంలేదు. ఆ అమ్మా యన్నట్టు, ఏ భాగ్యవంతుడో ఆమె సౌందర్యం చూచి చేసు కోవచ్చు. మీా యింటి మనువు కాకపోతే నే నిప్పట్లో పెళ్ళి చేసుకోవాలనుకోలేదు-బాగా చెప్పాలంటే మీా 'ఫామిలీ' మీాది గౌరవం-నీ మీాదున్న అభిమానంతో ఒప్పుకున్నాను... ముఖ్యంగా ... నిన్ను ..."

"నన్ను...నన్నేమిటి మాధవ్ !" సంభ్రమాశ్చర్యాలు పెనవేసుకున్నాయామె గొంతున.

"అవును. రాధమ్మా ! నా కెందుకో నీ సాన్నిధ్యంలో

గడపాలని వుంటుంది. చిన్నప్పటినుంచి కూడా నీ వంటే ఎంత ఇష్టపడేవాణ్ణో నీకు తెలీదా ?—మనం పెరిగినా నాకా ఉద్దేశం తరగలేదు. నిన్ను అనుక్షణం చూడాలని వుంటుంది. అది నీతో చెప్పడానికి సాహసించలేక పోయూ ఇంతకాలం. అది నువ్వు హాస్యంగా తీసుకుని, నన్నో చవట క్రింద జమ కడతావని భయపడ్డాడు. నిన్ను గురించి నాలో నే నెంత... సారీ...ఇప్పుడు చెప్పలేను మనసులో మాట చెబితే నీవు అపార్థం చేసుకుని ఇక నా ముఖం కూడా చూడవని, ఈ మూలంగానైనా నిన్ను దూరం చేసుకోకుండా వుండవచ్చని ఆశించాను...అందుకే..."

"మాధవ్ ! ఏమిటిలా మాట్లాడుతున్నావు ! మతిగాని చలించలేదు కదా ? నా మనసు పరీక్షించదలచుకున్నావా ?? లేక నా మనసును తక్కువ అంచనా వేసుకున్నావా! చెప్పు మాధవ్ ! చెప్పు" ఆనందావేశాలు మిళితంకాగా విభ్రాంతిగా మాధవ్ కేసి చూడసాగింది రాధ.

"ఏమిటమ్మా ! మాధవుణ్ని చెప్పమని నిలదీసి అడుగుతున్నావ్ ? ఆ చనువు, ఆ అర్హత మనకు దూరమౌతున్నాయని మరిచిపోతున్నావా తల్లీ !"

బాధగా రాధ భుజం తట్టి-ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు అప్పుడే అక్కడికొచ్చిన రాఘవయ్య.

"మామయ్యా ! మీరంతా నన్నెందుకు వేరుచేసి

మాట్లాడుతున్నారు ? మన సాన్నిహిత్యం యీనాటిది కాదు కదా? అది పియ్యంతో మాత్రమే బలపడుతుందని భ్రమిస్తున్నారా ? ? అనుకున్న విధంగా జరగకపోతే,నన్ను దూరంగా తరిమెయ్యడమేనా ? ? ?" దీనంగా ధ్వనించింది మాధవ్ స్వరం.

"నీ మంచితనంతో నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నావు మాధవా! నీలాంటి ఉన్నతుణ్ని అల్లుడుగా పొందే అదృష్టం లేనందుకు విచారిస్తున్నానయ్యా ! దేనికైనా పెట్టి పుట్టాలయ్యా...! చేతులారా ఒకటి చెరుచుకున్నాను. చేజేతులా మరొకటి చేజార్చుకుంటున్నాను...." రాఘవయ్య గొంతు గాద్గదికమైంది.

ఇంటి కెళుతున్నానని సౌంజ్ఞ చేసేడు మాధవ్.

తల ఆడించింది రాధ.

# 3

మాధవ్ ఇంటికెళ్ళినా అతడి తలపులే రాధను తలమున్కలు కావిస్తున్నాయ్.

రోజూ తనను చూచే మాధవ్‌లో క్రొత్త భావాలంకురించాయేమిటీ? కలకాదు కదా! నా మనోభావాలెలా వున్నాయో పరీక్షించడానికేమో! పరిహాసానికైనా అబద్ధమాడే స్వభావం కాదే? మా సన్నిహితం రూపు దాల్చడం

సంభవమా? క్రొత్త ఆశలు మొలకెత్తుతున్నా యేమిటి?? తనందుకు అర్హురాలా! సమాజం హర్షిస్తుందా??? ప్రజలు చేసే సవాల్‌ను ఎదుర్కోగలనా ! సంఘానికి దడవకుండా ధైర్యంగా నిలబడగలదా తను ? అసంభవం.

ఆనాడు సుధీర్ తనను కోరినప్పుడు ఇలా అనిపించిందా? ఆనాడు, ఎప్పటిలాగే అతడి నోట్సు చూచి రాసుకుంటోంది తను. అర్థంగాని పదాలు వివరిస్తున్నాడు సుధీర్.

"రాధా! నిన్నొకటడగాలని వుంది. అడగనా!" అను రాగం రంగరించి వుందా స్వరాన.

"నీకంటే నాకేం పాఠాలయ్యాయని సుధీర్! తెలీనివి రేపు అన్నయ్య పాఠం చెప్పేటప్పుడు అడుగుదాం!" అన్నది అమాయకంగా. "వెర్రి రాధా! నీకెలా చెప్పాలో అర్థం కావడం లేదు. నీకు వయసు పెరిగింది. అందం అధికమైంది. సంపాదన పరురాలివయ్యావ్, ఇంగితజ్ఞానం శూన్యం కావడం విచిత్రంగా వుంది సుమా!" వింతగా చూస్తూ జాలి వొలకపోసేడు.

"కోయ్, కోయ్, నీ కోతలు, ప్రశంసలతో నన్ను బుట్టలో వేసుకుని అన్నయ్యకు 'రెకమెండ్' చెయ్యమని కోర డానికే కదూ నీ ఎత్తులు! పది రోజులు ప్రవేటు ఎగ్గొట్టి వూర్లు తిరిగొస్తాను— జబ్బు చేసిందనో ఏదో నమ్మించమనే గదూ! సరే! ఈ క్రొత్త విషయం ఎక్కడ కనిపెట్టావ్ అందం అది అంటున్నావే! దాని సంగతి నాకే గుర్తులేదే,

నీ వెక్కడ గమనించావబ్బా!" చెక్కిట చెయ్యిజేర్చి ఎగ తాళిగా అడిగింది.

నీ సౌందర్యం నీకు తెలీదు రాధా! చందనపు చెక్కకు తన పరిమళం తనకు తెలీదట. నీ అందం అడవిగాచిన వెన్నెల కాకూడదు. దానికి సార్థకత వుండాలి. అందుకే...నిన్ను... ప్రేమిస్తున్నాను. కాదనకు. ప్లీజ్!"

"మిస్టర్ సుధీర్! ప్రేమ రెండక్షరాల పదం. కాని జీవితమంతా దానిమీద ఆధారపడివుంది. నా పరిస్థితి తెలిసిన వాడివై కూడా నన్నిలా అడుగుతున్నావంటే హేళన చేస్తున్నావనిపిస్తుంది. లేక నన్ను నీచంగా చిత్రించుకునైనా వుండొచ్చు" అన్నది ఆవేశాన్ని అణుచుకోడానికి ప్రయ త్నిస్తూ.

"సారీ! రాధా! నీ శ్రేయస్సుకోరి, నీ జీవితం పంచు కోవాలని అభిలషిస్తూ అర్థిస్తున్నాను. సావధానంగా ఆలో చించుకుని చెప్పవచ్చు. తొందరేం లేదు." అని సుధీర్ అంటున్నంతలో అన్నయ్య అటు వచ్చి—

"అర్జంట్ లేదంటున్నాడుగా! రేపు రాసుకుని ఇవ్వ వచ్చు నోట్సు— ఇప్పటికి బుక్సు మూసి ఇంట్లోకి రా!" అన్నాడు.

అన్నయ్య అసలు విషయం విననందుకు మనసులో దేవుడికి ధన్యవాదా లర్పించుకుంది తను.

దొంగకు తేలు కుట్టినట్టు నెమ్మదిగా జారుకున్నాడు

సుధీర్. ఇంత ధైర్యం లేనివాడు రేపు సంఘానికి ఎదురు నిలుస్తాడు? యువరక్తపు పొంగు మాత్రమేననేది స్పష్టమైంది తనకు.

మాధవ్ కూడా? అలా ఎప్పుడూ తలచదు. మాధవ్‌కు సుధీర్‌కు పోటీ ఏమిటీ? హస్తిమశకాంతరం— అది తన మనసుకా? కాదు, నిజం అంతే.

పరాగ్గా గులాబి మొక్కల కుండీ దగ్గరికి నడిచింది. అరవిరసి మురిపిస్తున్న ఎర్రగులాబీని త్రుంచింది. చటుక్కున చిన్న ముల్లు గ్రుచ్చుకుంది. పువ్వు కోసం ముల్లుల బాధను వోర్చుకోగలరా? తన కోసం, సమాజాన్ని ఎదిరించి అగ్ని పరీక్షలకు తట్టుకోగల ధైర్యం వుందా మాధవ్‌కు. వొద్దు, వొద్దు, తన కోసం సున్నిత హృదయుడైన మాధవ్ మనసు గాయపడరాదు. తనమీద జాలితో వుద్ధరిద్దామని మనసు విశాలం చేసుకుని వుండవచ్చు. పసితనపు ఆవేశంతో ఓ నిర్ణయానికొచ్చిన అతడి మనసు మరల్చడానికి ప్రయత్నించాలి. ప్రేమ ఎప్పుడూ అవతలివారి సుఖాన్ని కోరుతుందంటారు.

అక్కడో ఎండిపోతున్న గులాబి రెమ్మకు 'పేడ' ముద్ద అతికించి వుంది. దానికి, తనకు సామ్యం సరిపోయింది.

ఎండిన రెమ్మనెందుకు చిగురింపజెయ్యాలనే ప్రయత్నం జరుగుతోంది. ఓ మొక్కకున్న విలువ తనకు లేదు. దానికనర్హురాలు. తన బ్రతుకును తనే ఎడారి చేసుకుం

టుందా? ఇతరులే తక్కువగా జూస్తున్నారా! ఎవరు నిర్ణయించారీ శిక్ష! ఏమో! ఏమో!

నిశాదేవి కప్పిన నల్లచీరలో వెలుగు రేఖ లంతరించగా ఇంట్లోకి నడిచింది రాధ.

# 4

ఇంటికి తిరిగొచ్చిన మాధవ్ మనసు ప్రఫుల్లమైంది. తన సాహసానికి తనకే ఆశ్చర్యం కలిగింది. చండీ రూపం దాల్చి ఇంకెప్పుడూ ముఖం చూడొద్దని తరిమి కొడుతుం దనుకున్న రాధ ప్రసన్నంగా వుండడం మరింత ఉత్సాహాన్ని రేకెత్తించింది. మూగ వీణను మీటితేనే శృతి పలుకుతుం దనేది పరమ సత్యం. నిషేధ వస్తువుగా త్యజిస్తే ... శిథిలమై పోకేం జేస్తుంది?

"రాధనురా! మదనా!" రేడియోలోనుంచి శ్రావ్యంగా వినిపించేసరికి మాధవ్ మనసు మధుర భావాలతో నిండి పోయింది. పరవశించి తనూ శృతి కలిపాడు.

"ఏంరా! రాఘవయ్యన్న మనువు విషయం మాట్లాడ్డానికొస్తాడన్నావ్ రాలేదేం?" అని తల్లి వైదేహమ్మ అడిగే దాకా, పాటలో లీనమై యున్నాడు మాధవ్.

"వాళ్ళు మన సంబంధం విరమించుకున్నట్టు తోస్తోం దమ్మా! నాకు మేలు జేసిన వాళ్ళయ్యారు. ."

"మేలు చేయడమా! నీ చదువేంకానురా? పిల్లనివ్వ దలచుకుని సహాయం చేస్తున్నాడనుకున్న మీా అత్తయ్య మొగుడు—ఆ ఉద్దేశంతో కాదు. బావమరిది కొడుగ్గా ఏదో యిస్తున్నానన్నందుకు, మీా నాన్నకు రోషం వచ్చి వద్దన్నారయ్యా! ఇంటి కూటినీ, బంతి కూటినీ చెడుచుకున్న చందమైంది గదరా!" నిస్పృహతో అంటూ క్రింద కూల బడింది వైదేహమ్మ.

"నువ్వు నిరుత్సాహపడొద్దమ్మా! చదువు చాలించి చేతనైన ఉద్యోగం చేస్తాను."

"యమ్. ఏ. పాసై యింట్లో కూర్చున్న శ్రీధరానికి దొరకలేదు గాని—డిగ్రీ అయినా తీసుకోని నీకేం దొరుకు తాయిరా! పొలం తాకట్టు పెట్టి అప్పు తెస్తాను!" భరోసాగా అన్నాడు తండ్రి సోమశేఖరం.

"వద్దు నాన్నా! అంతపని చెయ్యొద్దు! ఆ తిండి గింజల ఆధరువైనా వుండనివ్వు!" ప్రాధేయత వుట్టిపడింది తతడి గొంతున

"ఒరే! మాధవా! నాకు భోగ భాగ్యాలు లేక పోయినా, నీవంటి బుద్ధిమంతుడైన కొడుకును భగవంతు డిచ్చినందుకు గర్వపడుతున్నానురా! చిన్నవారిని యెదుట మెచ్చుకోకూడదుగాని..." అతడి గొంతుక వాత్సల్యంతో నిండిపోయింది. కళ్ళు గర్వంగా మెరిశాయి.

"అది మీా పెంపక ప్రభావం-అమ్మ చేతి చలువ-

నా ఘనతేం కాదు నాన్నా!" అభిమాన భరితంగా వెలు పడ్డాయి మాధవ్ మాటలు.

"మనం అనుకోవలసిన విషయాన్ని దాచేసి, ఏవేవో మాట్లాడుకుంటున్నాము. ఝాన్సీని కోడలుగా చేసుకోలేక పోయినా, సౌదామినినన్నా చేసుకుంటాడనుకున్నాను. వాడికి తగిన అందమైన పిల్లలిద్దరూ తప్పిపోయినారు. రెండూ రెండు ముత్యాలు. అవి మనకు దక్కకపోగా ... చదువూ సాగేట్టు లేదు...అదృష్టవంతుల కడుపున పుడితే అన్నీ సాధ్య మయ్యేవి. ప్చ్ప్చ్" ముఖం కళావిహీనమైంది. మాటలు పేలవంగా రాసాగేయి వైదేహమ్మకు.

దివాలా తీసిన వ్యాపారిలా అయిపోయిన తల్లిని జూచి జాలేసింది మాధవ్‌కు. కాని మౌనమే శరణ్యంగా వూరుకున్నాడు.

ఎక్కడినుంచో ఇంటికొచ్చిన గోపీ, రవిని చూచి "కాళ్ళు కడుక్కొని రండిరా! అన్నం పెడతాను-లేరా! మాధవా! మీ నాన్నను కూడా రమ్మను" అంటూ వంట యింటి వైపు దారి తీసింది వైదేహమ్మ.

తమ్ముళ్ళకేసి నిశితంగా చూచి, ఏదో తలపుకు రాగా, దీర్ఘంగా నిశ్వాస వదలి అక్కడి నుంచి కదిలాడు మాధవ్.

# 5

"ఏరా! ఇంటర్వ్యూ బాగా జరిగిందా! ఈ సారైనా ఆశేమైనా వుందంటావా?" కొడుకును ప్రశ్నించాడు రాఘవయ్య.

"హ్హు...ఆశకేం నాన్నా! ఆశాజీవేగా మానవుడు." విరక్తిగా జవాబిచ్చాడు శ్రీధర్ చిన్నగా.

"తండ్రి వేదాంతం కొడుక్కూ బాగా వంట బడుతున్నది. ఇహ అయినట్లే...అణిగి మణిగి వుండాల్సిన ఆడపిల్లకు లేని పిరికితనం నీ కొచ్చిందేవిరా!" ద్వంద్వార్థంగా అన్నది జానకమ్మ.

ఆమె ఎప్పుడైనా మరో విషయంతో ముడిపెట్టి మాట్లాడుతుందనే విషయం అందరికీ తెలిసిందే. అందుకే కొంచం భయం కలిగింది శ్రీధర్‌కు...ఇంకేదో జరిగే వుంటుందని.

ప్రశ్నార్థకంగా రాధ వైపు చూశాడు.

ఇది సమయం కాదన్నట్లు సైగ జేసింది రాధ.

కనుక్కోవలసిన సంగతి కోసం ఆత్రుత చెందసాగాడు శ్రీధర్.

"శ్రీధర్! ఆ కాలేజి కమిటీవాళ్ళు నాకు ముఖ్యులు. తప్పక సహాయం చెయ్యగలనన్నాడు గదరా సుబ్బారావు! అతడేం వాళ్ళతో మాట్లాడలేదట్నా?"

"నాన్నా! మన మీా కాలానికి పనికిరాము నాన్నా! తెల్లనివి పాలు,నల్లనివి నీళ్ళు కావని పరోక్షంగా చెప్తున్నా మనం తెలుసుకోలేక, పిచ్చిన పడుతున్నాం. నావల్ల ఆ పని కాదని చెప్పడానికి నామర్దాగా భావిస్తారు కొందరు...ఆ కోవకు చెందిన వాడేనని తోస్తుంది సుబ్బారావుగారు కూడా. 'నేనన్నీ మాట్లాడివచ్చాను. నీవు 'నామ్‌కే వాస్తే' ఇంటర్వ్యూకు వెళ్ళావంటే—నీకు ఉద్యోగం వచ్చేది ఖాయం' అని బల్లగుద్ది చెప్పాడు-'నాకా పోష్టిస్తారని నమ్మకం కలగలేదండీ' అంటే—'మనకు కాదని తెలిసినా, నా పలుకు బడి వినియోగించి మిత్రుడి కొడుక్కి వుద్యోగం వేయించగల ననే నమ్మకంవున్నది. ప్చ్...ప్చ్...నీవేం విచారించకు. రేపు వెళ్ళినప్పుడు ఎవర్నో పట్టుకుని నీకు నౌకరీ వేయించే పూచీ నాది. అయితే కాస్త తైలం వదలాల్సి వస్తుంది. చిన్నవాళ్ళ దగ్గర్నుంచి పెద్దవాళ్ళ దాకా కాస్తో కూస్తో ముట్టజెప్పాల్సొస్తుందిరా' అన్నాడు" అసలు సంగతి చిన్నగా బయట పెడుతూ.

"ఏ మాత్రం కావాలన్నార్రా?"

"లంచమిచ్చి నౌకరీ కొంటావా నాన్నా! అలా ఇచ్చేట్టయితే యం. ఏ. పాసై రెండేళ్ళ నుంచి ఎందుకు ఖాళీగా

వుంటాను? నాకేం అర్హతలేక, మార్కులు రాక ఉద్యోగ
మడుగుతున్నానా? అర్హతున్నా వాడికే రికమెండేషన్లు,
లంచాలు పెట్టాల్సొస్తే ఇహ చదువు తక్కువైన వాళ్ళ
సంగతేం గాను?" శ్రీధర్ నోటి వెంట ఆవేశంగా మాటలు
దొర్లసాగాయి. ఛాతీ ఎగిరెగిరి పడుతూంది. కళ్ళు తెలీని
రోషంతో ఎరుపెక్కాయి.

"చూడు నాయనా! బాధపడకు. దేనికైనా కాలం
కర్మం కలిసి రావాలయ్యా! మనం తలచేదొకటైతే, జరిగేది
మరొకటి." విచారంగా తల పంకించాడు రాఘవయ్య.

"ఎక్కడున్నా అప్పో సొప్పో తెచ్చిచ్చి ఇట్లా
చెయ్యరా అనడం పోయి, వాడికి తాళం వెయ్యడం మొద
లెట్టేవే! ఇదేనటయ్యా నీ నిర్వాకం. ఇంక వాడికి ఉద్యోగం
వచ్చినట్లే-హ్హూ..పూజకొద్దీ పురుషుడు-దానం కొద్దీ బిడ్డలూ"
చిరచిర్లాడింది జానకమ్మ.

"నీ పూజకేమో! నీ నోటికి దడిసి సమాధానం చెప్ప
లేని మొగుడు. కిక్కురుమనని పిల్లలూ - ఇంతకంటే ఆడదాని
కింకేం అదృష్టం కావాల్నే!" వ్యంగ్యం, వృథా మేళవిం
చాయి రాఘవయ్య గొంతున.

"కుట్టిన తేలు గుణవంతురాలు, అరచినది గయ్యాళిది'
అని మీవి చేతలు, నావి మాటలు...వున్నమాటంటే
వులుకెక్కువే మరి..." ఉడుక్కుంటూ అక్కణ్ణించి కది
లింది జానకమ్మ.

జడివాన కురిసి వెలిసినట్లు గాలి పీల్చుకున్నా రక్కడి సభ్యులు.

క్రమేపీ కుర్రాళ్ళు రాగా వరండాలోకి వెళ్ళాడు శ్రీధర్.

# 6

"ఏమే! ఒంగోలు సంబంధం వాళ్ళ దగ్గర నుంచి జాబొచ్చింది చదవమంటావా ?" అన్నాడు రాఘవయ్య.

"పిల్ల నచ్చిందట కదూ! ఎందుకు నచ్చదూ దాని చక్కదనమే దాని అదృష్టం" పొంగిపోతూ యింత ముఖం చేసుకుంది జానకమ్మ.

"ఉత్తరంలో సారాంశం వింటే నీవీ మాట అనవు... చదువు తాను—సావధానంగా విను—

రాఘవయ్యగారికి !

మీా మనువు చేసుకోవడం మాకందరికీ ఇష్టమే. అయితే మీా చిన్నమ్మాయి సౌదామినిని కాదు. పెద్దమ్మాయిని!... పెద్దమ్మాయిని వదలి చిన్నపిల్లకు ఎందుకు చేస్తున్నారో తెలుపవలెను-రాధను ఇచ్చే పక్షంలో తక్కిన విషయాలు మాట్లాడుకోవడానికి రావలసినది—

ఇంతేసంగతులు.

వి. శ్రీనివాసరావు.

"ఊఁ, బాగా నేవుంది సంబడం.. ఇంకేం... స్థిరపరచుకుని రా మరి" హేళన నిండింది జానకమ్మ స్వరంలో

రాఘవయ్య మనసును కెలికింది.

"నవ్వీన నాపచేను పండే రోజులు రావంటావటే ? ఒక్కటే సందేహం, సంగతి చెప్పకుండా చేస్తే? చెబితే చేసుకుంటారనే నమ్మకం లేదు. అందుకే పూరుకోవలసి వస్తున్నది" అన్నాడేగాని, ఆలోచనలో పడ్డాడు రాఘవయ్య.

శ్రీధర్ అక్కడికి రాగానే, ఉత్తరం చేతిలో పెట్టాడు రాఘవయ్య చదివి, ఓ నిర్ణయాని కొచ్చినట్టుగా.

"నాన్నా! నే వెళ్ళి మాట్లాడొస్తాలే నాన్నా! యిలాంటి అవకాశాన్ని దుర్వినియోగ పరుచుకో గూడదు నాన్నా! రేపు ఒంగోలు వెళ్ళిరానా?" ఉత్సాహంగా అడిగాడు, లాటరీలో తన టికెట్ నెంబర్ గెలిచినంత ఆనందపడిపోతూ శ్రీధర్.

హాల్లో కొచ్చిన రాధ, చేతిలో జాబుతో, వెలిగే కండ్లతో పచార్లు చేస్తున్న అన్నను జూచి, చెల్లెల్ని చూచి వెళ్ళిన వాళ్ళునచ్చినట్టు వుత్తరం వ్రాసుంటారని ఊహించింది. శ్రీధర్ చేతిలో జాబు తీసుకుని ఆత్రుతగా చదివి తెల్లబోయింది.

"రాధా! పెళ్ళివారింటికి వెళ్ళిరానా! అందొచ్చిన అదృష్టాన్ని ఎందుకు కాలదన్నుకోవాలి? చెప్పు... నీ ఇష్టం చెప్పు!" తొందర చేసేడు శ్రీధర్.

అందరివైపు కలియజూచింది. తండ్రి ముఖంలో ప్రసన్నత గోచరించింది... తల్లి అందర్నీ మింగేసేలా చూస్తోంది.

"అన్నయ్యా! నా బ్రతుకు...నీకంత ఎగతాళిగా వుందిరా? నన్నిలాగైనా బ్రతకనివ్వకలచుకోలేదా యేం? నా జీవితం ఇలా గడిచి పోనీయుండి, దయవుంచి" ముఖం ఎర్ర మందార మైంది. కళ్ళు చింత నిప్పులయ్యాయ్.

మాధవ్ తనకు ఆశలు కల్పించకపోతే, ఈ సదవ కాశాన్ని వినియోగించుకునేదా? వుహూ, ఎన్నడూ తనకలాంటి అభిప్రాయాలు కలగలేదు. ఆనాటి నుంచి కరుడుగట్టి పోయింది తన మనసు- తనలోనే అనుకుంది. పమిట చెరుగు వ్రేలికి చుట్టుకుంటూ నేల చూపులు చూస్తూ వుండిపోయింది.

"ఆనాడు నీ భవిష్యత్తు బాగుపరచాలని అట్లా చేసేను గాని, నిన్నిట్లా మోడుగా వుంచాలని కాదమ్మా! నన్ను కటిక వాడి క్రింద జమకట్టేవా తల్లీ! చెప్పు, అన్నయ్య మాటకు జవాబు చెప్పు. మమ్మల్ని నీ సంపాదనమీాద జీవించే స్వార్థ పరులుగా చిత్రించుకోవద్దమ్మా! మమ్మల్ని మనుషులుగా చూడు" ఆర్ద్రమైంది రాఘవయ్య గొంతు.

"నా...న్నా! ఇంకెప్పుడూ ఇలాంటి సంభాషణ నా దగ్గర తేవద్దు" గిరుక్కున తిరిగి రూములో కెళ్ళింది రాధ.

శ్రీధర్, రాఘవయ్య నిశ్చేష్టులయ్యారా మె చర్యకు.

"నా కళ్ళతో ఎన్ని అరాచకాలు చూడాల్సొస్తుందో? మన సాంప్రదాయం ఎటువంటిదీ, మీారు చెయ్యబోతున్న పని ఎటువంటిది? అందుకే కలికాలంలో..."

"దయవుంచి నీవు నోరు మూసుకోవే. మండే వుండు

మీద కారం జల్లినట్లు మాట్లాడ్తాం నీవెప్పటికి మానుకుంటావే! అబ్బబ్బ..." విసుక్కున్నాడు రాఘవయ్య.

"తండ్రీ పిల్లలూ అంతా ఒకటే, నేనే పరాయిదాన్ని. మీ ప్రేమలు మీ కెక్కువైతే, నా వాళ్ళమీద నా కెందు కుండదనుకుంటారు? నేనింత కఠినురాల్ని కావడానికి కారణం నువ్వేకదూ!" జానకమ్మ కంఠం దుఃఖంతో పూడుకుపోగా మాట్లాడలేకపోయింది. విసురుగా పమిట చెరగు రొంటిని దోపి పెరటివైపు దారితీసింది.

రూములో కెళ్ళిన రాధకు తల్లి మాటలు స్పష్టంగానే వినిపించాయి. 'ఆ మెస్థానంలో ఎవరున్నా అలాగే ప్రవర్తిస్తా రేమో! ఎవరి వ్యధ వారిది. ఆమె మాటలు అలవాటైనవైనా అప్పుడప్పుడు ములుకుల్లా గుచ్చుకుంటాయి..' అలా ఆలోచిస్తున్న రాధకు సౌదా పెళ్ళి చూపుల నాటి సంఘటన గుర్తు కొచ్చింది.

ఆరోజు ప్రొద్దున ప్రవేటుకు మాధవ్ గూడా వచ్చాడు. తనూ అన్న దగ్గర పాఠం వింటూ కూర్చుంది. పెళ్ళి వారొచ్చి నప్పుడు మామూలు చీరె కట్టుకోబోయింది. సౌద, నివేద వేధించి తెల్ల జరీ చీర కట్టించారు ... తలంటి పోసుకున్న వెంట్రుకలు తడారకపోతే, రెండు పాయలల్లుకుని, రిబ్బన్ కట్టు కుని కూర్చుంది. అన్నయ్య పుస్తకం వైపు చూచినప్పుడల్లా మాధవ్ తనకేసి చూచేవాడు... ఎన్నడూ లేని పులకింత కలగడం తనకే చోద్యంగా తోచింది. అతడి చూపులు బాల

భానుని లేలేత కిరణాల్లా గిలిగింతలు పెట్టసాగాయి. మనసుకూ శరీరానికీ అవినాభావ సంబంధమని అనుభవపూర్వకంగా తెలుసుకుంది. అతడి మీద కేవలం వాత్సల్యం మాత్రమే! వున్నప్పుడుగాని, తను... ఏ విధమైన యోచనలు పెట్టుకో నప్పుడుగాని ఎలాంటి అనుభూతి వుండేదిగాదు. సంకల్ప మాత్రంగానే తన్మయత్వం కలిగినప్పుడు చటుక్కున ఏదో గుర్తుకొచ్చి వళ్ళు గగుర్పొడిచింది... మనసులో విచారం చోటు చేసుకోగా ఆ ఆలోచనలకు స్వస్తి చెప్పింది. ఆనాటి పాఠాలేవీ శ్రద్ధగా వినలేకపోయింది.

ఇంతలో నాన్న పెళ్ళివాళ్ళను రిసీవ్ చేసుకోడానికి రైలు స్టేషన్ కెళ్ళుతూ అన్నను బజారు పనిమీద పంపేడు. తనొచ్చేదాకా మాధవ్‌ను వుండమని అన్నయ్య ఆదేశించాడు.

"రాధాదేవిగారూ! పెళ్ళికూతురు కంటె ... తోడి పెండ్లి కూతురే బాగా ముస్తాబయిందే?" చిలిపిగా చూస్తూ కళ్ళు చికిలించాడు మాధవ్.

"తోడి పెళ్ళికూతురా! అంటే ... వేదా! ఏదీ... సిల్కు పరికిణీ కట్టుకుందా?" ప్రక్కలకు చూచింది తను.

"వేద కాదు... రాధ... తెల్లచీర కట్టుకుంది" వేలితో తనవైపు చూపేడు, కళ్ళలో అనురాగ జ్యోతులు వెలగ్గా.

క్రొత్తగా సిగ్గు ముంచుకొచ్చింది తనకు.

"కొంటె మాటలెప్పుడు నేర్చావ్ మాధవ్!"

"పరిస్థితిని,మనస్థితిని బట్టి అవే పుట్టుకొస్తాయి మేడమ్!

అయితే వాటికి ఉత్సాహ ప్రోత్సాహాలు అవసరమనుకో! సరేలే, మాటల్లో పడి చెప్పదలచుకున్నది మరచిపోతున్నాను- దేనికైనా మంచిది తరుచుగా కాబోయే పెళ్ళికొడుక్కు కనిపించకు. బహుశా నిన్నే చేసుకుంటాననవచ్చు..."

"ఆపు మాధవ్! నీ చమత్కృతి. పరిహాసానికైనా హద్దుండాలి! దాని సౌందర్యమెక్కడా, నేనెక్కడ!... నాకు దానికి వయసు తేడా కనిపించదా? నీకా భయం అక్కరలేదు."

"నీ వాక్కమాటు పెద్దద్దంలో చూచుకో. ఎలా వున్నావో తెలుస్తుంది. అల్లనల్లన ఫాలాన్ని స్పృశించే ముంగురులు, చక్కని చామన చాయలో నునుపుదేలిన శరీరం, తెల్లని చీరలో దేవదూతలా..."

"మీ కథానాయిక పేరేమిటి మాధవరావుగారూ?" అనే సౌదా పలకరింపుతో త్రుళ్ళిపడ్డాడు మాధవ్.

"చెప్పనా... చెప్పనా" అన్నాడు తడబాటుతో.

కోరగా చూచిందితను.

"మరో మారు చెపుతాను సౌదామినీ..." ఓరగా చూచాడు తన వైపు.

"అక్కయ్యా! అమ్మ లోపలికి రమ్మంది" లోనికిదారి తీసింది సౌద.

హాల్లో చాపలు వేసి కుర్చీలు తుడిచి వంటింట్లో తల్లికి సహాయం చెయ్యడాని కెళ్ళింది తను.

అమ్మ ఓ లిప్తపాటు తనవైపు దీనంగా చూచి... తన పనిలో లీనమైంది. అప్పుడప్పుడు మాతృమూర్తినని జ్ఞాపకం చేసుకుంటుందేమొ! ఆ చల్లని చూపుకోసం ఎంతో తపిస్తుంది తను.

ప్లేట్లు, గ్లాసులూ సర్దిపెడుతుంటే, నాన్న మాధవ్ గారింటికి మనువు స్థిరపరచుకుని రావడానికి వెళతారనే విష యాన్ని గురించి మాధవ్‌తో ప్రస్తావిస్తున్నప్పటి సంఘటన జ్ఞప్తి కొచ్చింది.

"మాధవ్! ఈరోజు నాకెంత ఆనందంగావుందో చెప్ప లేను!" అంది తను సంతోషాతిరేకంతో.

"ఏమిటబ్బా! అంత హర్షం కలిగించేటంత విలువైన విషయం! నేను తెలుసుకోవచ్చా?" అమాయకంగా ముఖం రంగులుమార్చసాగాడు.

"చూడు మాధవ్! పసితనపు చాపల్యం నీకింకా పోలేదు. అయినా నిన్ను గృహస్థును చెయ్యబోతున్నారు... అన్నయ్య చెప్పిన షరతులు నీవు వొప్పుకున్నావు! అన్నయ్య చెప్పగా, నాన్న ఆమోదించి, మీ ఇంటికి వచ్చి అన్ని విషయాలు మాట్లాడి స్థిర పరుచుకు రావడానికి రేపు మంచి రోజనివెళ్ళిరావాలనుకుంటున్నారు. అంతకంటేసంతోష మైంది నా కింకేం కావాలి. బుద్ధిమంతుడైన కుర్రాడితో . అందులో అతి పరిచయస్థుడూ, మా కుటుంబాన్ని అభిమానించే వాడు, ఇంటి కల్లుడవుతున్నాడంటే ఆనందం కాదా! ఇద్దరూ

రూపవంతులు. మీాకు పుట్టబోయే పిల్లలు అంకమైన గుణ వంతులు. వాళ్ళను చూచుకుంటూ..." తన వాక్యం పూర్తి గాక ముందే అందుకున్నాడు మాధవ్.

"శేష జీవితాన్ని గడుపుతారా? అమ్మమ్మగారూ ?"

"వరుసలు కూడా తెలీవేంటి మాధవ్ ! అమ్మని."

పెద్దగా నవ్వింది తను. "నన్ను మరీ పాలు త్రాగే పసివాడిని జేసి మాట్లాడకు రాధమ్మా! నిస్వార్థానికీ హద్దుంది. తన కడుపుకు తింటేనే ఆకలి చల్లారుతుంది. తన జబ్బుకు మందు వాడితేనే రోగం తగ్గుతుంది..." ఆవేశం, ఆవేదన మిళితం కాగా ఉపన్యాస ధోరణిలో చెప్పుకపోతున్న మాటలకు అడ్డు తగిలింది తను.

"మాధవ్! నామీాది అభిమానంతో, జాలిగా అంటు న్నావు గాని, నా కలాంటి వుద్దేశమే లేదు. ఆశలేని కూటికి ఆకలుండదు మాధవ్." నిశ్చలంగా తన నోటినుంచి వెలు వడ్డాయి ఆ మాటలు.

"ఆశ గలిగిస్తే ఆకలుంటుందంటావా?" ఆశగా తన కనుల్లోకి చూచాడు మాధవ్.

"అలాంటి విశాల హృదయులు, అరుదు మాధవ్ ! అందుకే నేనిలాగే వుండిపోవాలనుకున్నాను. సమాధానం చాలా?" అంది తను.

"విశాల హృదయు లెవరైనా ఆశిస్తే...అనుగ్రహించ

గలవా?" ఆత్రుతగా తన ముఖంలోకి చూపులు సారించాడు మాధవ్.

"ఏమిటి మాధవ్! నీ డొంక తిరుగుడు ప్రశ్నలూ? నీ కథలోకి నాలాంటి క్యారెక్ట రెవరైనా కావాలా? మన స్తత్వం కోసం నన్ను పరీక్షిస్తున్నావా ?" తేలిగ్గా తీసుకుని నవ్వింది తను.

"సాహసిస్తే ఏమౌతుందీ?" నిలదీసి అడిగాడు.

అటువైపు అడుగుల చప్పుడు కాగా తలత్రిప్పి చూచింది తను. మనిషిజాడ కానరాలేదు.

"నా ప్రశ్నకు జవాబు రాలేదు." రెట్టించాడు మాధవ్.

"ఏమౌతుందో చెప్పనా...ఏమౌతుందంటే..." తడబడింది"అతడి ముఖం జన్మలో చూడకుండా వుండాల్సొస్తుంది" అన్నది మళ్ళీ విసుగ్గా అతడి వైపు రోషంగా చూస్తూ.

ముఖం తేలేసి, భారంగా శ్వాస వదిలాడు మాధవ్.

తన కర్థం కాలేదానాడు. అతడి మాటలు సౌద వినుంటుందేమో. ఆ అడుగులు దానివే కావచ్చు. అప్పటి వరకూ మాధవ్‌ను చేసుకోడానికి సుముఖంగా వున్న సౌద మారిపోయిందంటే తను గ్రహించ లేనంతటి అవివేకి అయింది.

"అక్కయ్యా! ఈ వోణీ బాగుందా?"అని సౌద అడిగే దాకా, తను ఆలోచనా కెరటాల్లో కొట్టుకులాడుతూ వుండిపోయింది.

"నీ సెలక్షన్‌కు అపీలుంటుందా! అదే వేసుకో!" మెచ్చుకోలుగా చూచింది తను.

అన్నయ్య కేకతో హాల్లోకొచ్చింది ఆనాడు.

"అమ్మ భోజనానికి రమ్మంటోందక్కా!" అనే వేద పిలుపుతో గతంనుంచి యదార్థానికొచ్చింది రాధ.

# 7

ఆ రోజుల్లో సోమశేఖరానికి మాధవ్ చదువో బెడదై కూర్చుంది. చేతినిండా డబ్బున్నప్పుడు — నీళ్ళ పైకి చల్లితేగాని చలమ పూరదని - ధనాన్ని మంచినీళ్ళ ప్రాయంగా వెచ్చించాడు.

ఇంటినిండా పంట, దొడ్డినిండా పశువులు, చేతినిండా డబ్బున్నప్పుడు...అతణ్ని దేవుడిగా కొలిచిన వాళ్ళు-అవన్నీ దూరం అయ్యేసరికి, తప్పించుకుని తిరగసాగారు.

అప్పట్లో తన ఏకైక సోదరి శారదకు, బీద పిల్ల వాణ్ని, బుద్ధిమంతుడుగా చూచి...ఎంతో కట్నం ఇచ్చి పెళ్ళిచేసేరు. వాళ్ళు వరదక్షిణతో అప్పులు తీర్చుకుని... శారద భర్త రమణరావుకు చదువు మాన్పించదలచుకున్నారు. ఆ సంగతి తెలిసి అతడు చదువుకున్నంత వరకూ చెప్పిస్తానని వాగ్దానం చేశాడు సోమశేఖరం.

రమణారావును—పైవూళ్ళకు పంపి చదివించాడు...

ధాన్యానికి పెద్ద ధరలు లేనందువల్ల... ఎంతో ధాన్యం అమ్మితేగాని డబ్బు చేకేదికాదు. అయినా, రమణరావుకు ఏ సందర్భంలోనూ ఇబ్బంది కల్గించలేదు.

బాపూజీ పిలుపు అందుకుని స్వాతంత్ర్య సమరంలో దూకేడు సోమశేఖరం. కొంత పొలం అమ్మి రమణరావు చదువుకు బ్యాంకులో అతడి పేర కొంత డబ్బువేశాడు. అట్లాగే ఇంకొంత అమ్మి...చెల్లెలి పేరిట, భార్య పేరిట వేశాడు.

మిగిలింది ఉద్యమ కార్యక్రమాలకు ఖర్చు చేశాడు. సోమశేఖరం పాల్గొనని ఉద్యమం లేదు. అతడి కోసం-తెల్ల వాళ్ళు తీవ్రంగా వెతికించేవారు. అతడి సాహసకృత్యాలు, అన్ని పేపర్లలోనూ పడేవి ఆ రోజుల్లో. అప్పటికి వైదేహమ్మ కాపరానికి రాలేదు. భర్త పరాక్రమానికి గర్వపడు తున్నా, అతడికేమౌతుందోనని భీతి చెందేది. శారద ధైర్యం చెప్పేది. వదినా ఆడబిడ్డలు అన్యోన్యంగా వుండేవారు.

రమణరావు చదువయ్యేదాకా, వదిన పుట్టింట్లోనే వుండేది శారద. రమణరావుకు అల్లుడి మర్యాదలన్నీ వైదేహమ్మ పుట్టింట్లోనే జరిగేవి. చదువు పూర్తయిన తరువాత అన్ని మర్యాదలతో అత్తవారింటికి పంపింది శారదను.

వదిన తనకు జరుపుతున్న మర్యాదలకు ఆశ్చర్య

పడేది; ఎప్పటికైనా, వాళ్ళ రుణం తీర్చుకోవాలనిపించి, సదా కృతజ్ఞతతో నిండిపోయేది శారద మనసు.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు, జైళ్ళలో ఉన్నవాళ్ళను విడుదల చేసిన సందర్భంగా. . .సోమశేఖరం బయటపడ్డాడు. వైదేహమ్మ, శారదల సంతోషానికి మేరలేక పోయింది.

స్వాతంత్ర్యం వచ్చేనాటికి 'శంకారం'లో సొంత యిల్లు, నాలుగెకరాల మాగాణి, కొంత మెట్ట మిగిలాయి.

మెట్టచేలో, మోటబావి తవ్వించి తోట వేయించాడు సోమశేఖరం. ఉన్నదాన్లోనే వైదేహమ్మ పొదుపుగా కాపురం చేసేది.

కొన్ని రోజులవరకు సభలకు, సమావేశాలకు హాజరయ్యేవాడు సోమశేఖరం — కాలక్రమేణా అన్నీ అడుగున బడిపోయాయి. సోమశేఖరం అంటే ఎవరికీ కూడా తెలీనంతగా అతను మరుగున పడిపోయాడు.

ఆ వూరి మోతుబరి కొండానాయుడులా పరిస్థితిని స్వార్థానికి ఉపయోగించుకోలేకపోయాడు. అప్పు ఉద్యమంలో తిరిగిన పలుకుబడిని ఉపయోగించుకుని . . . వూళ్ళో కంట్రాక్టులు అవీ చేజిక్కించుకుని లక్షాధికారయ్యాడు కొండా నాయుడు.

రాజకీయ బాధితులకు ఐదెకరాలిస్తున్న తరుణంలో

ఎవరెవరి పేర్లో పెట్టించి ఎంతో పొలం సంపాదించాడు కొండానాయుడు.

అప్పుడు...కరణం నారాయణరావు సోమశేఖరం పేరు చేర్చి-అతడి పేర పట్టా వచ్చేదాకా, తనేం పట్టించుకోలేదు సోమశేఖరం.

వైదేహమ్మ సోమశేఖరానికి తగిన భార్య అనిపించు కుంది. ఆ వూళ్ళోనే వున్న రాఘవయ్యగారి కుటుంబానికి, సోమశేఖరం కుటుంబానికి మంచి సాన్నిహిత్యం, స్నేహం వుండేవి.

జానకమ్మ అహంభావి అయినా వైదేహమ్మంటే ఇష్టపడేది. కోడరికానికొచ్చిన నాలుగేళ్ళవరకూ, సంతానం కలగనందువల్లనేమో శ్రీధర్‌ను, రాధనూ ముద్దుగా చూచేది వైదేహమ్మ.

మాధవ్ పుట్టినప్పటినుంచీ...రాధ వారింట్లోనే ఎక్కువగా గడిపేది. మాధవ్‌ను వదలి క్షణమైనా ఉండలేక పోయేది. కొంచెం దూరపు కాన్పయి సౌదామిని పుట్టినా కూడా మాధవ్‌ను ముద్దు చెయ్యడం తగ్గించేదిగాదు రాధ.

పిల్లల కోసం ఆడబిడ్డచేత ఎన్నో నోములు, వ్రతాలు చేయించింది వైదేహమ్మ ; రమణరావు ఎన్నో వైద్యాలు చేయించాడు.

కాపరానికి వెళ్ళిన పది సంవత్సరాలకు శారదకు ఝాన్సీ పుట్టింది. ఝాన్సీ నేలమీద పడ్డప్పటి నుంచి తన కోడలని మురిసిపోయేది వైదేహమ్మ. "ఇంత మంచి అత్తగారికి కోడలు కాబోవడం దాని అదృష్టం వదినా" అనేది శారద.

రమణరావు మాత్రం మౌనం వహించేవాడు... అంగీకార సూచకమో, కోపకారణమో, తెల్సుకోలేక శారద మనసు కలుక్కుమనేది.

## 8

సోమశేఖరం...ఇంట్లో అడుగు పెట్టేసరికి, ముందు గదిలో సామాను దించి వుంది. వంటింట్లో నుంచి శారదమ్మ రావడం చూచి గతుక్కుమన్నాడు సోమశేఖరం. 'చెల్లెలూ, పిల్లలూ వచ్చారన్న సంతోషానికన్నా-వాళ్ళకు ఏ లోపం రాకుండా జరపడమెలాగా?' అనే చింత పట్టుకుంది.

"ఏమిటన్నయ్యా! అలా ఉన్నావ్? వంట్లో బాగో లేదా!" కంగారుగా అడిగింది శారదమ్మ.

"నాకేం...బాగానే వున్నానే! ఏ బండి కొచ్చావమ్మా!" తన గాభరా కప్పిపుచ్చుకోడానికి వృధా ప్రయత్నం చేసేడు సోమశేఖరం.

"మాధవ్ రాలేదేం ? కాలేజీ వదిలి ఉంటారే ?" వాకిలి వైపు చూస్తూ ప్రశ్నించింది శారదమ్మ.

"కాలేజినుంచి అటే ప్రైవేటుకు వెళుతుంటాడు ఒక్కొక్కసారి. శ్రీధర్ ట్యూషన్ చెబుతున్నాడు" సోమ శేఖరం నుంచి జవాబొచ్చింది.

"మీరు భోజనాలకు రండి వదినా!. . .రావే ఝాన్సీ. . .ఎప్పుడు తినొచ్చారో ఏమో !" అన్నది వైదేహమ్మ.

"గోపీని, రవినీ రానియ్యత్తయ్యా ! వాళ్ళతో అనిల్ కూడా వెళ్ళేడుగా !" అంది ఝాన్సీ.

"అవునే-మరచేపోయాను. . .ఇంక వాడికి అన్నం నీళ్ళు పట్టేదుగా, ఇద్దరు బావలూ వుంటే చాలు " మురిసిపోతూ అన్నది వైదేహమ్మ

అన్నయ్య పరిస్థితిని అర్థం చేసుకున్న శారదమ్మ—తనలో చెలరేగుతున్న సంఘర్షణను ఆ సమయంలో వ్యక్తం చేయకుండా ఉండలేకపోయింది.

"నేను అక్కడెంత ఐశ్వర్యం అనుభవిస్తున్నా, మీ దిగులే నన్ను వేధిస్తుంటుంది. చివరకు మాధవ్‌ను చదివించే హక్కు కూడా కోల్పోయామంటే మమ్మల్ని కృతఘ్నులుగా జమ కట్టేరు. ఝాన్సీని యివ్వకపోడానికి, డబ్బు పంపడానికి ఏం సంబంధం ?. . .మేం ఎంత యిస్తేమాత్రం మీ రుణం తీర్చుకోగలమా ?...పోనీ, గోపీని, రవినీ నాతో పంపండి...

ఆయన్ని బ్రతిమాలి వొప్పించుకుంటాను. నాకూ కొంత స్తిమితంగా వుంటుంది..." జాలి, విచారం మేళవించిన శారదమ్మ మాటలకు కాస్త చలించింది వైదేహమ్మ. ఒప్పుకుందామా అన్నట్టుగా భర్తవైపు చూచింది.

'ఎంత నీచానికి దిగజారావ్' అనే భావన ముఖంలో వ్యక్తపరచాడు సోమశేఖరం.

"వదినా, అన్నయ్యా! నా కెవరూ జవాబు చెప్పరేం. నన్ను పరాయిదాన్ని చేస్తున్నారా! నా కూతుర్ని మీ ఇంటి కోడల్ని చేసే అదృష్టానికి నోచుకోకపోయినా, సహాయం చేశాననే తృప్తి కూడా లేకుండా చేస్తారా?" నిష్ఠూరం ధ్వనించింది ఆమె మాటల్లో.

"చూడు శారదా! నీ మనసు నాకు తెలుసమ్మా! శక్తి ఉంటే ఆడపిల్లకు పుట్టింటివాళ్ళు పెట్టాలిగాని, ఆడపిల్ల సొమ్ము ఆశించకూడదమ్మా! అందునా, మీ ఆయనకు పేద వాళ్ళంటే చాలా చులకన ... పిల్లలు కించపడుతుంటే నేను సహించలేను...ఆస్తి వారసత్వంగా మిగలక పోయినా ఆత్మాభిమానం మాత్రం వాళ్ళకు అబ్బింది. మీ అన్నయ్యను యాచకుడిగా...మాత్రం....." ముఖం ప్రక్కకు త్రిప్పుకుని అక్కడి నుంచి లేచిపోయాడు సోమశేఖరం.

ఝాన్సీ ఇంట్లో తిరుగుతుంటే ఆ అమ్మాయి తన కోడలు కాకుండా పోతున్నందుకు బాధగా అనిపిస్తుంటుంది వైదేహమ్మకు. మాధవ్, ఝాన్సీసమీపాన ఉన్నప్పుడు కల

కాలం వాళ్ళు అలా వుండే ప్రాప్తం లేనందుకు దీర్ఘ నిశ్వాసాలు వదులుతుంటుంది వైదేహమ్మ.

ఝాన్సీని చూశాక అప్పటికీ ఇప్పటికీ ఆమె చాలా మారిపోయిందనుకున్నాడు మాధవ్. మునుపటిలా 'బావా.. బావా'...అంటూ వెంట తిరగడం మానుకుని అడిగిన దానికి క్లుప్తంగా జవాబు చెపుతోంది ఝాన్సీ. అది అహంభావంగా భావించాడు మాధవ్. మొదటి నుంచీ ఝాన్సీని తనకు జోడీచేసి మాట్లాడుతుంటే...ఏదో అలవాటు మాటలుగా మాత్రమే అనిపించేది. ఝాన్సీ దూరమౌతున్నందుకు తనకేం బాధని పించడం లేదు. ఝాన్సీని తనకే ఇవ్వడం ఖాయమైతే అప్పటి సంగతి ఎలా వుండేదో అతను యోచించలేదు.

కాని, రాధకు ఝాన్సీకి సామ్యం చూచుకోసాగాడు. మాధవ్.

రాధ గలగల పారే సెలయేరు—ఝాన్సీ నిర్మలమైన సరస్సు. ఝాన్సీ కళ్లు నిండుగా గాంభీర్యాన్ని తెల్పుతాయి. రాధ నేత్రాలు చలించే చేప పిల్లలు.

ఝాన్సీని చూస్తూంటే అందమైన పాలరాతి శిల్పం అనిపిస్తుంది...సుకుమారమైన సుమబాలను గుర్తు చేస్తుంది. అమాయకమైన ముగ్ధమోహన స్వరూపం ఎదుట నిలిచినట్లుంటుంది.

రాధ నోరూరించే పరిపక్వమైన...కమ్మని ఫలంగా పూరిస్తుంది. మనిషిని ఆకర్షించే సంచలన లావణ్యమది. రాధ...రాధ...రాధ...పేరులోనే ఏదో మాధుర్యం !

"బావా! కథ ప్లాటేమయిన మననం చేసుకుంటు న్నావా? ఊహాలోకాల్లో విహరిస్తున్నట్లున్నావ్!" రూప్సీ పిలుపులో ఆలోచనల పల్లకి నుంచి క్రిందికి దిగేడు మాధవ్.

"కూర్చో...రూప్సీ... ఏమిటీ కథలా! ఏదో పురుగు దొలిచినప్పుడు రాస్తుంటాను... సరే... అలకగా ముఖం పెట్టావేమిటి...నా మీదేనా కోపం?"

"నాకేం కోపం? మీ రందరే నామీద ఆగ్రహంగా ఉన్నారు. నాదేం తప్పు బావా! అమ్మా నాన్న చెప్పినట్లు వినాలికదా! నువ్వూ నా పరిస్థితిని అర్థం చేసుకో లేదా బావా? నన్నెందుకు మీరంతా పరాయిదాన్నిగా చూస్తున్నారు? అలా అయితే యింక నేను రానేరానీ వూరికి." రూప్సీ నయనాల్లో నీటి పొరలు కదలాడాయి.

"ఏమిటిది పిచ్చిపిల్లా! ఎందుకా ఏడుపు. ఛీ ఛీ, తప్పుకదూ?" కళ్ళు తుడవబోయి చెయ్యి వెనక్కు తీసు కున్నాడు మాధవ్.

మాధవ్ చెయ్యి ముందుకు చాపడం చూసి కాస్త వెనక్కు తప్పుకుంది.

"సారీ రూప్సీ! వెనుకటిలా ముట్టుకో బోతున్నాను. నువ్విప్పుడు పెద్దదానివి కదూ! నువ్వేదో బిడియంగా తప్పుకు తిరుగుతూంటే నిన్ను ఇబ్బంది పెట్టడం ఎందుకని పలకరించడం లేదు. దానికి నేనేదో కోపంలో ఉన్నానని ఊహించు కుంటున్నావ్...!"

"చాలు బావా! చాలు. నువ్వంత మాత్రం విశాల దృక్పథంతో ఆలోచించావంటే నా కెంతో సంతోషంగా వుంది" కళ్ళు తుడుచుకుంది.

"పిచ్చిపిల్లా!" ఆప్యాయత వొలికింది మాధవ్ స్వరంలో.

"బండి టయిమైంది రావే! ఇన్ని రోజులుంటే ఇప్పుడు తీరిందన్నమాట, బావతో మాట్లాడ్డానికి. మాధవా! నీ కేదైనా అవసరం వుంటే నీకో అత్త వుందని మరచిపోవద్దు. నా శక్తి వంచన లేకుండా చెయ్యగలిగినదయితే చేస్తానని గుర్తుంచుకో!" కరుణ, అనురాగం రంగరించి ఉన్నాయి-ఆమె ఆదేశంలో.

యూన్నీకీ, తనకూ పెళ్ళి కానందుకు, వీళ్ళింతగా ఎందుకు బాధ పడుతున్నారో అర్థం కాలేదు మాధవ్ కు.

# 9

సౌదామిని స్నేహితురాలైన జయప్రద పెళ్ళిలో, పెండ్లికొడుకు స్నేహితుడు నిరంజనరావనే యువకుడు, సౌదామినిని చూచి ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని రాఘవయ్యగారింటికి చెప్పి పంపేడు. అతని తల్లిదండ్రులతో మాట్లాడి, పెళ్ళి చూపులు ఏర్పాటు చేసేరు. పెద్దలకు కూడా సౌద నచ్చింది.

సౌద నిరంజనరావును చూచి పెళ్ళికి ఒప్పుకున్నందుకు అందరికంటే మిన్నగా రాధ నిర్ఘాంతపోయింది. కారణం నలుపు, పొట్టి, కాస్త వయసు కూడా ముదురుగానే ఉండడం.

"ఏవే! నీ కళ్ళకేమైనా పొరలు కమ్మేయా! లేక... కట్నం లేకుండా చేసుకుంటున్నాడని, ఇంజనీరుకదాని ఆశ పడ్డావా ?" అన్నది రాధ తన అయిష్టాన్ని వ్యక్తం చేస్తూ.

"కోరి వచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకునేటంత అవి వేకిని కాను! అతనికేం...నల్లగా ఉన్నా కళకళ్ళాడుతూ వున్నారు. ఇలాంటి సదవకాశాన్ని దుర్వినియోగ పరచుకో లేను. నా పెళ్ళి సంబంధాల విషయంలో నీకు వ్యతిరేకంగా నడుస్తున్నందుకు మన్నించక్కయ్యా!" అని ప్రాధేయపూర్వకంగా రాధ రెండు చేతులూ పట్టుకుంది సౌదామిని.

తనకంటే చిన్న వయసులో వున్న చెల్లెలి మనసు ఎదిగినంత తను ఎదగలేనందుకు మొదటిసారిగా చింత కలిగింది రాధకు.

తూచి తూచి మాట్లాడిన ప్రతి వాక్యం తన కేసి సవాల్ చేసినట్టుగా తోచింది రాధకు. కిమన్నాస్తిగా వుండి పోయింది.

అక్కలోని భావ సంచలనానికి చెల్లెలి మనసు సంత

సించింది. అక్క పరివ ర్తన చెందడానికి...తనేమైనా చెయ్య గలిగితే అదే తనకెంతో ఆనందం—అనుకుంది సౌదామిని.

"మాధవ్ ! చెల్లెలికి కాబోయే భ ర్త ఏమీ బాగుండడు. ఎలా ఒప్పుకుందో ఏమో !" క్రింది పెదవి విరచి చేతులు అదోలా త్రిప్పింది రాధ.

"అందం అంటే చూచి ఆనందించేదిగా వుంటుంది కొందరి అందం...కాని పెద్ద సౌందర్యం లేకపోయినా, ఏదో ఆకర్షణకు లోనౌతారు కొందరు. అది ఒక్కొక్కరి మనస్తత్వం మీాద ఆధారపడి వుంటుంది !" పరోక్షంగా తన మనసును ఏకరువు పెట్టేడు మాధవ్.

అతనిలో అంతర్లీనంగా ఉన్న ఉద్దేశాన్ని గ్రహించ గలిగిన రాధ మనసులో మల్లెలు పరుచుకున్నాయి. మధురానుభూతిలో ఒక్కక్షణం కనులు మూసుకుంది.

చటుక్కున ఏదో గుర్తుకొచ్చి కొరడాతో వెన్నున చరిచినట్లయింది.

తను నిర్ణయించుకున్న విషయం జ్ఞప్తికొచ్చి తన కర్తవ్యం బోధపడింది ..ఆనందం స్థానే విచారం ఆక్రమించుకుంది. రాధ ముఖంలో ఇంద్రధనుస్సును గమనించి నిర్ఘాంతపోయాడు మాధవ్.

రాధకు ఎలాగైనా నచ్చజెప్పి ఆమె జీవితానికో

అర్థమూ, తనకో పరమార్థమూ కలిగించుకోవాలని గట్టి నిర్ణయం తీసుకున్నాడు. అందుకోసం శక్తివంచన లేకుండా కృషి చెయ్యాలని దృఢనిశ్చయాని కొచ్చాడు.

"ఎడారిలో కూడా పూలు సృష్టించుకోవాలి-తను బ్రతుకుతున్నది యితరులకోసమని... ఓ పరిధి ఏర్పరచుకోవడం తమను తామే వంచన చేసుకోవడం లాంటిది. అందొచ్చిన అవకాశాన్ని జార విడుచుకుంటే 'నేల విడిచిన సామే' అవుతుంది"

"ఈ ఉపోద్ఘాతం దేనికి నాందో నాకు తెలియకపోలేదు అయినా ఎంత 'విజ్ఞానం సంపాదించుకున్నావు,మాధవ్ - ఇంత చిన్న వయసులో! నాకు చాలాఆనందంగావుంది సుమా...." అంటూ అతన్ని మెచ్చుకుంది రాధ.

దోవలో పడుతున్నప్పుడే గట్టిగా బంధం బిగించాలను కుని ఆ 'మూడ్' పోకుండా విషయం తెలుసుకుందామను కున్నాడు మాధవ్.

"నాకు బిరుదు ప్రదానాలు చెయ్యడం కాదు. నిన్ను గురించి బాగా ఆలోచించుకో! నేనెందుకు వివరించి చెప్తు తున్నానో అర్థం చేసుకో. నిన్నొక ఆశాజీవిగా నిలబెట్టాలని నా మనసు పరితపిస్తుంటుంది. నేనెంతవరకు ఈ ప్రయత్నంలో కృతకృత్యుడ నవుతానో భగవంతునికే తెలియాలి. కాని నీవూ

నీ మనసును పరివర్తన చెందనివ్వడానికి ప్రయత్నించిననాడు నా ఆశయం నెరవేరుతుంది. నీ బ్రతుకును బాగుపరచ లేక పోతే జీవితాంతం నేను అశాంతితోనే గడపాల్సొస్తుంది” భావోద్రేకంతో చెప్పుకు పోసాగాడు మాధవ్.

అతడి నేత్రాల్లోని కార్యదీక్ష, మాటలలో దృఢత్వం రాధను కలవరపెట్టాయి. దానికి సడలింపు లేకపోతే పర్యవసానం ఏమౌతుందోనని భయం వేసింది రాధకు.

“మాధవ్! ఎంతసేపటికీ నీ ధోరణి నీదేగాని అవతల మనిషి సంగతి పట్టించుకోవు కదా! నీకు పసితనపు ఆవేశం, యువకరక్తపు వేడి మినహా, నా స్థితినిగాని,అలా జరిగితే ఉభయులు ఎదుర్కో వలసిన సమస్యలుగాని నీకు గుర్తురావడం లేదు.మన పెద్దవారి సంప్రదాయాలు, మన సమాజపు కట్టుబాట్లు ఎన్నో వున్నాయి. వాటిని అధిగమించే శక్తి మనకు లేదు. చట్టాలు, వాటి సంగతి కొచ్చినప్పుడు తీర్పు చెప్ప గలవు గాని, ప్రతి క్షణం ఎదుర్కో వలసిన సమస్యలను నిరోధించలేవు. నీవొంటి అనురాగంతో, నీ మాటలు ఆలకించినంత మాత్రాన...ఆమోదించాననుకోకు- నేనీ పరిధిదాటి బయట పడలేను.నిన్నీ విషవలయంలో బంధించి పతనం చెయ్యలేను. నన్ను క్షమించు మాధవ్ - క్షమించు!” నయనాలు జల పూరితాలుకాగా, రాధ వదనం మబ్బుగమ్మిన జాబిల్లయింది. గొంతు పొడారిపోగా మాటలు పెగల్లేదు రాధకు.

“నీకు యిష్టం లేకకాదు. లోకానికి భయపడు

తున్నావు. నా భవిష్యత్తును ఊహించి నన్ను తప్పుకోడానికి ప్రయత్నిస్తున్నావ్. నీ మనసు ఆ మాత్రం తెలుసుకోలేక కాదు. నన్ను మభ్యపెట్టి నీవు తప్పించుకోడానికి 'ప్లాన్' వేస్తున్నావు. గుండె మీద చెయ్యేసుకుని, నా కళ్ళలోకి చూచి, నిజమైన మనసుతో చెప్పు—నేనంటే ఇష్టం లేదని, నా మీద నమ్మకం లేదని..."

"నేనేం చెప్పలేను మాధవ్! నన్ను నిర్బంధించకు...నా కోసం పరితపించే వ్యక్తి ఒకరున్నారనే తృప్తితో జీవిస్తాను...అంతకంటె ఈ జన్మకు, ఇక..." దుఃఖంతో గొంతు పూడుకుపోగా ముఖానికి రెండు చేతులు అడ్డం పెట్టుకుని నిశ్శబ్దంగా విలపించసాగింది రాధ.

"రాధా! ఏడవకు ప్లీజ్! నిన్ను కష్టపెడితే క్షమించు...తొందరలేదు...బాగా ఆలోచించుకో!"

కరుణో, ప్రేమో, చనువో, తెలియని ఏదో చొరవతో చటుక్కున లేచి రాధ చేతులు పట్టుకున్నాడు.

వానకు తడిసి, నేలరాలిన పారిజాతంలా వుంది రాధ మోము! ఆర్ద్రతతో ద్రవించిపోయింది మాధవ్ మనసు.

అప్రయత్నంగా మాధవ్ హస్తద్వయాన్ని కళ్ళ కద్దుకుంది రాధ.

ఇద్దరూ కొన్ని క్షణాలపాటు తన్మయత్వంలో ఉండిపోయారు. చటుక్కున అతడి చేతులు వదలి, కళ్ళు తుడిచేసుకుని, గబగబ యింట్లోకి దారి తీసింది రాధ.

# 10

సౌదామినికి పెళ్ళి కుదిరినందుకు, అందరి మనసులూ ఆనందంతో నిండివున్న సమయంలో... ఓ జటిలమైన సమస్య తెచ్చిపెట్టేడు మధ్యవర్తి రామకృష్ణశాస్త్రి.

రాధ విషయమేమిటో క్షుణ్ణంగా తెలిస్తేగాని... శుభలేఖలు వేయించమని పిల్లవాడి తల్లిదండ్రులు మొండికేసి కూర్చున్నారని, పెళ్ళికుమారుడు మాత్రం ఈ పిల్లనే చేసుకోవాలని పట్టుబట్టి వున్నాడని, తను తెలిసినంతవరకూ చెప్పదలచుకున్నా— 'మీ అనుమతి లేకుండా చెబితే ఏమనుకుంటారో'నని చెప్పలే'దని వివరించాడు మధ్యవర్తి.

రాఘవయ్యకు అరికాలిమంట నెత్తికెక్కింది.

"ఇప్పుడే ఇన్ని మారాముళ్ళు పెట్టేవాళ్ళు రేపు మా పిల్లను ఏం ఏడిపిస్తారోనని భయంగా వుందయ్యా... మానుకోమను, మునిగిపోయిందేముంది..." విసురుగా అన్నాడు.

"దీన్ని కూడా ఇంట్లో దానికి తోడుగా కూర్చోబెట్టుకో! ఏదో వరగబెడదామని దాని బ్రతుకట్లా బండలు చేసేవ్! కలిసొచ్చినదాన్నిపుడు కాలదన్నబోతున్నావ్! ఉన్న విషయం చెప్పి వాళ్ళకు నచ్చజెప్పమనక ... సంబంధం మానుకుంటాడట. ఎదిగిన ఆడపిల్లలు తలి

గుండెల మీద కుంపట్లని గ్రహించలేక పోతున్నావు..."
కుండ బద్దలు కొట్టింది జానకమ్మ.

"సరే! నా పిల్లేం తప్పు జేసిందని రహస్యంగా దాచాలి! చెప్పు! అన్నీ చెప్పు! ఈ పరిస్థితిలో పిల్ల సుఖం కోరే తండ్రులు ఏం జేస్తారో వాళ్ళనే చెప్పమను..." వ్యధాభరితంగా వెలువడిన రాఘవయ్య మాటలకు రామకృష్ణశాస్త్రి మనసు కరుణా భావంతో కరిగిపోయింది.

"ఇంట ఆడపిల్ల వున్న ఏ తండ్రీ...సుఖంగా ఉండలేడని గ్రహించుకోలేని మూర్ఖుణ్ని కాదు లెండి...మీ మాట తీసుకోకుండా చెప్పగూడదని అట్లా మధ్యస్థంగా వున్నాను. నా శాయశక్తులా ... విషయాన్ని బహు సున్నితంగా వివరించి ... సంబంధం జారిపోకుండా చూస్తాను. అవతల మీ అదృష్టం" అంటూ వెళ్ళాడు రామకృష్ణశాస్త్రి.

గదిలో వున్న రాధ అన్నీ విన్నది. ఆమెలో అగ్ని జ్వాల రగిలింది.

ప్రతి పరిస్థితీ తనమీదనే ప్రభావం చూపడం తన దౌర్భాగ్యం - తప్పులేని శిక్ష అనుభవించమని భగవంతుడు రాసేడు ... తనెంత మంచి మనసుతో ప్రవర్తిస్తున్నా తన స్థితి తనకు కోడె త్రాచులా వెంటాడి క్షణ క్షణం కోరలు చాస్తూనే ఉంది...ఏ పాపం ఎరక్కపోతేనే ... ప్రజల నోళ్ళలో నానాల్సొచ్చినప్పుడు, తన స్వయంకృతంగా చేస్తే ఇంకెంత బాధ పడాల్సొస్తుందో...

ఏమైనా ... ఎన్ని కష్టాలనైనా భరించగలదు గాని యితరులచేత మాటలు పడలేదు...తను నిందలు పడడానికి బాధ్యురాలుకారాదు...అందుకే...అందుకే...మాధవ్‌తో సాన్నిహిత్యాన్ని కూడా వదులుకోవాలి ... అతణ్ని తన మీద ఆశలు పెట్టుకోవద్దని నయాన్నో, భయాన్నో... తన నుంచి దూరం చేసుకోవాలి.

తన జీవితంలాంటి శూన్యంలోకి చూడసాగింది.

ఆకాశం మేఘావృతమైంది తన మనసులా. ఒక్కొక్క చినుకు నేల రాలసాగింది...వచ్చీ రాని తన ఏడుపులా.

"అశోకవనిలో సీతాదేవిని గుర్తు తెస్తున్నావ్ సుమా!" అన్నాడు అప్పుడే అక్కడికొచ్చిన మాధవ్.

అగ్గిమీద గుగ్గిలంలా తోచిందా సరసవాక్కు రాధకు.

"నేను వియోగంతో క్రుగ్గే సీతాదేవిని గాను,అలిగిన సత్యను గాను...విరహంతో వేగే రాధను గాను..."

"ఆఖరు మాట కరెక్టు...అ ...హ్హా...హ్హా... కాని సత్యభామవు మాత్రం కావద్దు. కృష్ణపరమాత్మకున్న సహనం నాకు లేకపోవచ్చు..."

"షటప్... యూ గెటవుట్... నా బ్రతుకు నీకు హేళనగా వుందికదూ! ఇంకా నవ్వులపాలు చెయ్యాలని చూస్తున్నావ్ కదూ! ఈ రోజునుంచి నా జోక్యం నీ కనవ

నరం... అర్థమైందా ?" జ్యోతుల్లాంటి కళ్ళనుంచి నిప్పులు రాలాయి.

"ఈ రోజు నీకేమైంది రాధమ్మా! ఎందుకింత కోపం! నేనేం చేసేనని ? ప్రతి పరిస్థితికీ నువ్వు ఉడుక్కుంటా వెందుకూ ? ఇంట్లో ఏదో గొడవ జరిగితే సవ్యంగా చెప్పాలి గాని... అత్తమీద కోపం దుత్తమీద చూపించినట్లు..." అనునయంగా లాలించబోయాడు మాధవ్.

"నీ నక్క వినయాలు— నా దగ్గర కాదు... నన్ను వంచించి బుట్టలో వేసుకుందామని... పథకం పన్నావు... నేనింత మాత్రం తలెత్తుకొని బ్రతకడం కూడా నీ కిష్టం లేకున్న మాట... నీకు ఆఖరుసారిగా చెప్తున్నాను. నా జీవితం నువ్వేం బాగుపరచక్కర్లేదు... నన్నిలా వదలి పెడితే అదే పదివేలు" విసురుగా చేతులు జోడించి నమస్కరించింది రాధ. చటుక్కున ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది.

"నువ్వేదో కోపంలో వున్నావు... ఆ మాట లిప్పు డెందుకు కాని, మరోమాటు చెప్పుకోవచ్చు. వస్తా..." అంటూ రెండడుగులు వేశాడు ఆమె వైపు జాలిగా చూస్తూ.

"దయవుంచి ఈ విషయాలు మాట్లాడ్డానికైతే రానక్కర్లేదు. నేను బాగా ఆలోచించే ఒక నిర్ణయానికొచ్చి చెబుతున్నాను... పదే పదే ఈ ప్రస్తావన తెచ్చి నన్ను బాధించకు..."

"నిజంగా నే చెప్తున్నావా ? ఎందుకు నిన్ను నువ్వింత చిత్రవధ చేసుకుంటున్నావో అర్థం కావడం లేదు... నీ బ్రతుకును బాగుపరచుకోవడం చేతగాక ఒకరు చెప్పితే వినక... అవతల చింతిస్తావు... తొందరపడి నిర్ణయానికి రాకు."

రాధ ముఖం త్రిప్పకుండానే "నేనేం చింతపడను... కరుడు కట్టుకపోయిన నాకేం దుఃఖం... నేను మనిషిని కాదు పాషాణాన్ని... నామీద గౌరవం ఉంటే మరెప్పుడూ ఈ సంగతి గురించి మాట్లాడకు..." అంది గద్గద స్వరంతో.

పమిట చెరుగు - నోట్లో కుక్కుకుని పరుగులాంటి నడకతో మల్లెపందిరికేసి దారి తీసింది.

గత్యంతరం లేక ఇంటిదారి పట్టాడు మాధవ్. పెన్నిధి పోగొట్టుకున్న పేదలా... దీనంగా ఇంట్లోకి అడుగు పెట్టాడు మాధవ్.

తనివిదీర ఏడ్చి, అలసి... సొమ్మసిల్లిన రాధ మేను సిమెంటు బెంచీని అంటిపెట్టుకుని వుంది.

చల్లని హస్తస్పర్శతో అదిరిపడి తిరిగి చూచింది రాధ.

కరుణ భరితమైన దృక్కులు ప్రసరిస్తూ నిలుచుని ఉన్నాడు శ్రీధర్.

"పిచ్చి... రాధా! నీ జీవితంలో నందనవనం నీ కన్నుల్లో పన్నీరు... ముఖంలో ఆనందం ఎప్పటికి చూస్తానమ్మా !" చెల్లెలి తలమీద చెయ్యివేసి నిమురుతూ ఆప్యాయంగా అన్నాడు శ్రీధర్.

"నా కేమ్మదేమీ లేదన్నయ్యా! లక్షణంగా ఉన్నాను. కళ్ళు... మంటగా వుంటే చల్లగాలికి కూర్చున్నానంతే"

"అవును... నీకేం కాలేదు. నిన్నెవ్వరేం అనరు. నీ కన్నీ వున్నాయి. నిన్ను నువ్వు మభ్యపెట్టుకుని... ఎన్ని రోజు లిలా గడుపుతావు రాధా ? నీ మేలుకోరేనంటూ అప్పటి కప్పుడూ, ఇప్పటి కిప్పుడూ ఎడారిలో వదలి వేసేరు. ప్రజ లనే కీటకాలు నిన్ను పీల్చి పిప్పి చేస్తూంటే... చూస్తూ చేత గాని దద్దమ్మల్లా మేము వూరుకున్నాము..." బాధగా నుదురు రాసుకుంటూ— భారంగా అడుగులేస్తూ పచార్లు చెయ్య సాగాడు శ్రీధర్.

"నాన్న నాకేం కీడు చెయ్యలేదన్నయ్యా! రెంటికి చెడ్డ రేవడిని గాక, నాకో తీరం ఏర్పరచారు... నన్నొక ఇంటి నౌకరుగా కాక, చదివించి నా కాళ్ళ మీద నిలబడనిచ్చారు. అంతకంటే నాకేం కావాలన్నయ్యా! కూపస్థ మండూకంలా యింట్లో పడుండక చిన్నారి పాపలకు, భావిపౌరులకు బంగారు బాట మలిచే టీచర్ని చేసేరు... చాలు- అంతకంటే నేనేం కోరటం లేదు!" కృతజ్ఞతా భావంతో అంజలి ఘటించింది తండ్రిని తలచుకుని రాధ.

"మంచి మనసున్న వారికి అందరిలోనూ మంచే కని పిస్తుంది చెల్లాయ్ ! అయితే భగవంతుడికి నీ మనసు కనిపించడం

లేదు.. ఆయన పన్నీటి అభిషేకాల్లో మునిగి, కన్నీటి మను ష్యుల్ని మరిచాడు. అంతే..." తలపంకించాడు.

రాధ కన్నుల్లో నీటి అల చివ్వున లేచింది.

వర్షపుజల్లు రివ్వున విసిరింది.

అన్నా చెల్లెలిరువురూ ఇంట్లోకి పరుగు తీశారు.

# 11

రామకృష్ణశాస్త్రి చాకచక్యంతో మనువు స్థిరపడింది. సౌద, నిరంజనరావుల పెండ్లికి 'లగ్నాలు' పెట్టుకున్నారు. పెండ్లిపనుల సందట్లో, రాధ తన యోచనలకు 'ఫుల్‌స్టాప్' పెట్టింది. శ్రీధర్ ఏదో 'ఇంటర్వ్యూ' వుందని గుంటూరు వెళ్ళేడు. అక్కచెల్లెళ్ళు అక్కడినుంచి ఏవేవో తెమ్మని పురమాయించారు.

"అక్కడ నా పనయ్యేదాన్నిబట్టి వుంటుంది మీ జాబితా సంగతి" అన్నాడు.

"ఏ వుద్యోగానికి అన్నయ్యా!"తన సందేహ నివృత్తి కోసం అడిగింది రాధ.

"వచ్చినపుడు చెపుతాను. ఈసారంతా సీక్రెట్! 'సింగన్న అద్దంకి పోనూ పోయినాడు, రానూ వచ్చాడని' ఎగతాళై పోయింది!"

"ఈసారెందుకో నాకు నమ్మకంగా వుందిరా! మనకు

మంచి రోజు లొస్తున్నాయి...నయాపైసా కట్నం లేకుండా అల్లుడొస్తున్నాడు. రూపాయి లంచం లేకుండా నౌకరీ రావచ్చు. ఒక్కొక్కరు అడుగుపెట్టిన వేళావిశేషం గూడా వుంటుంది. యిటు అల్లుడూ అటు వుద్యోగం..." ఆనందంతో వెలిగింది జానకమ్మ వదనం.

*　　　*　　　*

'టెలిగ్రాం' అందుకుంటుంటే సోమశేఖరం చెయ్యి కొంచెం కంపించింది. సంతకంచేసి తీసుకున్నాడు.

ఆందోళనగా భర్త ముఖంవంక చూడసాగింది. సోమశేఖరం ముఖం కందగడ్డయిపోవడం గమనించింది వైదేహమ్మ. జంకుతూనే అడిగిందామె. "సంగ తేమిటని"

"మాధవ్‌గాడు ఎంతపని చెయ్యబోతున్నాడో చూడు! 'మిలిటరీ యింటర్వ్యూ సెంటర్'కు వెళ్లాడని, యింటర్వ్యూకేమోనని అనుమానంగా వుంది. గనక నీవు వచ్చి నచ్చజెప్పి తీసుకెళతావని తెల్పడమైందని రమణారావు టెలిగ్రాం యిచ్చాడు" ముగించాడు సోమశేఖరం.

"బుద్ధిమంతు డనుకున్నందుకు...బాగానే చేస్తున్నాడే? యిప్పుడేం రైలుందో! తొందరగా వెళ్ళండి..." గాభరాగా అన్నదామె.

"పోవాలంటే దగ్గరా దాపా ?...పాతిక రూపాయలైనా కావాలి" అంటూ ఆలోచనలోపడ్డ భర్త సంశయాన్ని గ్రహించి—

"డబ్బు కోసమైతే చెప్పండి...రాధ దగ్గర కెళ్ళి తీసుకొస్తాను" అంటూ భర్త జవాబుకు ఎదురుచూడకుండా — చీర సవరించుకుని ప్రక్క వీధిలో వున్న రాఘవయ్యగారింటికి దారితీసింది దేవమ్మ.

# 12

మిలిటరీ సెలక్షన్ సెంటర్లో ... వరండాలో బెంచీ మీద కూర్చున్నాడు మాధవ్. ఎందుకో ద్వారాని కేసి బిత్తరచూపులు చూడసాగాడు...మళ్ళీ లోపలినుంచి వచ్చేవారికేసి, తన నెంబరు ఓమారు చూచుకుని, 'వాచీ' వైపు చూచుకుని, ఇంకా ఆలస్యమున్నందుకు గాభరాపడుతున్నాడు. కారాగిన చప్పుడైతే వాకిలికేసి చూచిన మాధవ్ 'షాక్' తిన్నట్టయిపోయాడు...

కారు దిగిన రమణారావు వెంట సోమశేఖరం కూడా దిగాడు. రమణారావు వాకిట్లో కాపలా వాళ్ళతో ఏదో మాట్లాడి, కొన్ని నిముషాలు హాల్లో గడిపి ఇవతలికొచ్చాడు. సోమశేఖరానికేదో సైగ చెయ్యగా ముందుకు అడుగేసాడతడు. మాధవ్ పై ప్రాణాలు పైనపోయినంతపనై వణకడం ప్రారంభించాడు...చల్లని వాతావరణంలో కూడా ముచ్చెమటలు పోసాయి. మాధవ్—'క్లోరోఫారమ్' యిచ్చిన మనిషిలా గాలిలో తేలిపోసాగాడు.

తండ్రి ముందుకేస్తున్న ఒక్కొక్క అడుగు తన శిరస్సు మీద పడి తననూ, తన ఆశయాన్నీ అధఃపాతాళానికి అణగ ద్రొక్కినట్టు వ్యథతో మెలికలు తిరగసాగాడు

మాధవ్ కు రమణారావు ... గాంభీర్య వాలకం చూస్తుంటే నిలువునా పాతేయాలనిపించింది ... అతడే ఈ నిర్వాకం చేసిందని స్పష్టంగా తెలుస్తోంది. పరోక్షంగా తన పతనాన్నే ఆశిస్తున్న బద్ధవిరోధిలా కనిపించసాగాడు. పిడికిళ్ళు బిగించి...సన్నగా పళ్ళు నూరుకున్నాడు మాధవ్...

"రారా!...బైటికి..." అన్న తండ్రి పిలుపు కటువుగా ధ్వనించింది.

తనకు ఊహ తెలిసినప్పటినుంచి ఎన్నడూ కటువుగా పిలిచి ఎరగడు. స్నేహంగా, ప్రియంగా మాట్లాడేవాడు. తన నెంతో గౌరవించేవాడు. అలాంటిది, ఈనాడు...ఇలా?

"రావేంరా!" అతడి కన్నుల్లో కోపం, పిలుపులో ఆజ్ఞ ధ్వనించాయి.

"ప్లీజ్ నా...న్నా! ఓ అరగంట తర్వాత వస్తాను...అప్పటికీ..." బెక్కుతూనే చెప్పబోయాడు.

"వీ...ల్లే...దు..." బిగ్గరగా ధ్వనించింది తండ్రి గొంతుక.

పరాజితుడైన రాజు—సింహాసనాన్ని త్యజించాల్సిన సమయంలో పొందినంత బాధ పడిపోయాడు...ఇంటర్వ్యూ హాలు కేసి చూస్తూ... ముందుకు సాగాడు.

సర్వం పోగొట్టుకున్నట్టు దీనంగా కూర్చున్న కొడుకును అడిగింది సైదేవమ్మ.

"మిలిటరీలో చేరే ఖర్మ నీకేం పట్టిందిరా? చదువులో పైకొచ్చే వాడివి - తమ్ముళ్ళను, ముందుకు తేవలసిన వాడివి- నీవేనా నాయనా _ ఇట్లా చేయదలచుకున్నదీ? ఎన్నడూ అబద్ధమాడని వాడివి, అనురావతికని, అత్తయ్యగారింటికని చెప్పి..."

"మొదటిసారిగా... అబద్ధమాడినందుకు మన్నించమ్మా! నేనేది చేసినా మీ కోసమని మరచి పోవద్దమ్మా! నా చదువు సాగే మార్గంలేక, చదువుకోవలసిన పిల్లలుండి— పైగా, ఈ చదువుతో నౌకరి దొరుకుతుందన్న నమ్మకం లేక... నా తమ్ముళ్ళని నాకంటే పెద్దవాళ్ళను చేద్దామని, నాన్న రెక్కలకు తోడుకావాలని... నే చేసిన పని మీకంత చెడుపైతే... నేనేం చెప్పలేనమ్మా!"

"నీవు.. మిలిటరీలో లక్షలు ఆర్జించి, తమ్ముళ్ళను చదివిస్తావేమోగాని మమ్మల్ని మాత్రం శ్మశానానికి పంపే వాడివి..."

"ఎందుకు నాన్నా! అంతంత మాటలంటావు? అందునా నువ్వంటున్నావంటే నాకాశ్చర్యంగా వుంది నాన్నా! రాజకీయాలలో కాకలు తేరిన రాజకీయవేత్తవు. దేశం కోసం ధనాన్ని వెచ్చించిన... దానశీలుడివి. అలాంటిది, దేశసేవ కోసం నీ కొడుకు వెళుతున్నాడంటే గర్వంగా

పిడోక్కలివ్వాలిగాని... పిరికిగా వెనక్కు మళ్ళించుక రావడం..." అరచేతిలో పిడికిలిని బాదుకో సాగాడు మాధవ్.

తన ఎదట ఎన్నడూ ఆవేశంగాగాని, ఆగ్రహంగా గాని మాట్లాడని కొడుకు ఈనాడు భావోద్రేకంగా, రోషంగా మాట్లాడుతుంటే విభ్రాంతుడైన సోమశేఖరానికి మాట పెగల్లేదు.

"మా కడుపులో చిచ్చుపెట్టి- నీవక్కడ బావుకునే దేంటిరా!" చిరుకోపం ప్రదర్శించింది వైదేహమ్మ.

"అమ్మా! ఎన్నో సంవత్సరాల క్రిందటే స్వాతంత్ర్య సమరానికి భర్తను పంపిన నువ్వు, కాలం ఎంతో ముందుకు నడుస్తుండే రోజుల్లో నన్నెందుకు వెనక్కు లాగుతున్నావో అర్థం కావడం లేదమ్మా! ముగ్గురు కొడుకులున్న నువ్వే, దేశసేవ కోసం పంపకపోతే- వొక్కగా నొక్కడున్న వాళ్ళ సంగతేం గాను...!"

ఏ స్టేజి మీదనో స్వాతంత్ర్య యోధుడు ప్రజలకు బోధించే రీతిగా చెప్పుకుపోతున్న కొడుకు ధోరణిని మధ్యలో తుంచుతూ మాటందుకుంది వైదేహమ్మ.

"ఆనాడు త్యాగం అనే పేరుతో పంపపట్టే,ఆస్తంతా కొల్లగొట్టుకుని పిల్లలకు... చదువు కూడా చెప్పించుకోలేని స్థితి కొచ్చాం... అందుకే తనకు మాలిన ధర్మానికి పోకూడ దని... నిన్ను వారిస్తున్నాను. ఈ రోజు ఒక్క పదిరూపాయ

లిచ్చేవాళ్ళు లేరు. అనాథవ ప్రాయంగా నేర్చుకున్న గుణ
పాఠం... అందుకే, నన్ను..."

విసుగ్గా ముఖం చిట్లించుకునే మాధవ్‌ను చూచి తన
మాటలను మనసు కెక్కించుకోవడం లేదని... తేచిపోయింది.

తన వంతిన్నట్టు సోమశేఖరం కలుగ జేసుకున్నాడు.

"అమ్మ చెప్పిన వన్నీ హితవుగా లేవు కదూ!
వుండవు... భర్తతో కలిసి కాపురం చెయ్యాల్సిన రోజుల్లో..
పుట్టింట్లో గడుపుతూ.. యింట్లోనే వుండి తగినవిధంగా
సహకరించమని నా కాళ్ళు వేళ్ళు బడి బ్రతిమాలుకుంటే -
పిరికిదానివని విసుక్కుని... వున్నదంతా నాశనం జేసుకుని
ఉద్యమాల్లోకి దూకేను... తిరిగొచ్చే సరికి మిగిలింది, కీర్తి
కాకపోయినా తరిగింది ఆస్తి. నేను స్వార్థపరుణ్ణనుకో వద్దు..."

"నన్ను మాట్లాడనివ్వు నాన్నా!... అది మీకై
మీరు... చట్టానికి వ్యతిరేకంగా పోరాడి... డబ్బు ఖర్చు
పెట్టుకున్నారు ఇప్పుడు నేను దేశరక్షణ కోసం.. సైనికు
డిగా వెళ్ళ దలచుకున్నాను. ఎన్నో సౌకర్యాలు... సైనికు
డిగా వెళ్ళితే 'హోదా'నో పురస్కరణమో! ఏ విధంగా
చూచినా మీకు నష్టం ఉండదు. పైపెచ్చు మీ రక్తం
పంచుకు పుట్టిన ఒక యువకుడిని దేశమాత సేవ కర్పించామనే
తృప్తి ఉంటుంది.

"నాన్నా! మీ అణువు అణువు స్వాతంత్ర్యాభి
లాషతో పోరింది. ప్రతి రక్తబిందువు దేశంకోసం ధార

బొయ్యాలనుకున్నారు. ప్రతి పైసా అందుకోసమే ఖర్చు చేసేరు. అలాంటిది... నీ కొడుగ్గా నాకా హక్కు లేదని, నన్నో పిరికివాడుగా... నన్నో పరికరంగా భావించి తీసు కొచ్చారు .. నే నెంత దౌర్భాగ్యుణ్ణి నాన్నా!..." వ్రేళ్ళతో నుదురు రుద్దుకున్నాడు మాధవ్.

"కాదు నాయనా కాదు! ప్రస్తుత పరిస్థితి, నా దౌర్బ ల్యం, నా స్వార్థం నన్నిలా చేశాయి. నీవు మిలిటరీలో సెల క్షన్‌కు వెళ్ళావని విన్నప్పుడు నా మనసు ఆనందంతో, గర్వంతో పొంగిపోయింది... కాని మన సంసారాన్ని తలచు కోగానే, నీ కేదైనా అయితే ? మన స్థితి ఏమిటని గుండె దిగజారి పోయిందిరా! అందుకే క్రుంగిపోయాను... నీలాంటి వాళ్ళు దేశానికి అవసరమైనా, నీ ప్రాణం మన కుటుంబానికి ముఖ్యం.. .అందుకే నిన్ను తీసుకొచ్చాను. మన సంసారం ఒక దారికి రాగానే నువ్వు అడక్కుండానే నిన్ను...నా చేత్తో వీరకంకణం కట్టి పంపుతాను. . ఈ సారికి... నన్ను..."

"నాన్నా! నా కది చాలు నాన్నా! అదే తృప్తి..." తండ్రి పాదాలను భక్తి పూర్వకంగా కళ్ళ కద్దుకున్నాడు మాధవ్.

"మాధవా!...లే" అంటున్న సోమశేఖరం నయన ద్వయాన రాలిన అశ్రుబిందువులు మాధవ్ శిరస్సున ఆశీ ర్వచనాలై నిలిచాయి.

# 13

"ఇంటర్వ్యూ" నుంచి తిరిగొచ్చిన శ్రీధర్‌లో ఉత్సాహం పొంగులువారడం గమనించిన రాధకు అక్కడి సంగతులు అడగాలని కుతూహలం కలిగింది. ఇటీవల ఎప్పుడడిగినా చిరాకు ప్రదర్శిస్తూ—లోకం మీద విరుచుకపడి, పెద్దవాళ్ళతో జరిగే అరాచకాలు, ఏకరువు పెడుతూ, ఆఫీసర్లని దుయ్యబడుతూ ఓ లెక్చరివ్వడం - లంచం మీద కొన్ని కథలు చెప్పడం —. వాటి నిర్మూలనార్థం యేం చేస్తే ప్రజలు బాగుపడతారో, ప్రగతినెలా సాధించగలరో, విప్లవాత్మక ధోరణిలో ఉద్రేకంగా ఉపన్యసించేవాడు. అతన్నడిగి ఆవేశాన్ని రెచ్చగొట్టడం తప్ప ప్రయోజనముండదని అడగడం విరమించుకునేది.

"అన్నయ్యా! ఈసారి..."

"ఇంటర్వ్యూ ఎలా జరిగిందిరా! ఉద్యోగ మేమైనా వచ్చే ఆశ వుందా?? ఇత్యాది ప్రశ్నలే కదూ — ఒక్క మాటలో చెప్పాలంటే నౌకరి రావడం 'ష్యూర్'." ఛాతీ వెడల్పు చేస్తూ నిటారుగా నిలబడ్డాడు. ... చెల్లెలి వైపు గర్వంగా చూస్తూ సన్నగా ఈల వేసేడు శ్రీధర్.

వైదేహమ్మ రాఘవయ్యగారింటికొచ్చి జరిగినదంతా సవిస్తరంగా చెప్పి వెళ్ళేటప్పుడు "మాధవ్ మిలిటరీలో

చేరకుండా వస్తే అమ్మవారికి పూజ చేయిస్తానని మొక్కు కున్నాను. దేవాలయానికి నీవు కూడా వస్తావా వదినా !" అన్నది వైదేహమ్మ.

"సౌద వివాహం మా రాముళ్ళు తొలిగి లగ్నాలు పెట్టుకుంటే దేవాలయానికి వస్తానని మ్రొక్కుకున్నాను. కాని ఈ రోజు వీలయ్యేట్టులేదు. సామానులు బాగు చేస్తు న్నారు" అన్నది జానకమ్మ.

రాధ మాధవ్ ఇంటికి వెళ్ళేసరికి, మాధవ్ రేడియో ముందు కూర్చుని పుస్తకంలో ఏదో రాసుకుంటున్నాడు. రేడియో నుంచి పాట తాలూకు 'మ్యూజిక్' వినవస్తోంది. తను సవ్వడి చెయ్యకుండా 'స్లిప్పర్సు' విడిచి అడుగులో అడుగేసుకుంటూ టేబుల్ దగ్గరకు వెళ్ళింది.

ఈ లోపల పాటందుకుంది రేడియోలో రికార్డు.

"సావిరహే తవ దీనా...రాధా !" 'టక్' మని కసిగా ఆపేశాడు రేడియో.

"మాధవ్ ! ఎందుకింత కోపం ?" లాలింపుగా అంది రాధ.

"ఓహో ! రాధాదేవిగారా ! మా అమ్మ లేదండీ ! గుడికి వెళ్ళింది" నీరసంగా అన్నాడు.

"ఫరవాలేదండీ ! వున్నవాళ్ళతో మాట్లాడి పోతాను" మునిపంటితో క్రింది పెదిమను బిగించింది-రాబోయే నవ్వును ఆపుకుంటూ.

"అయితే వచ్చేదాకా కూర్చోండి! టీచర్!" కుర్చీ ముందుకు జరిపి తను లేచాడు మాధవ్.

చటుక్కున అతని చేతులు పట్టుకుని కూర్చోబెట్టింది.

ఎలాంటి అనుభూతికి లోనుగాక ... చిన్నగా ఆమె చేతులు తొలిగించుకున్నాడు.

"ఏమిటి మాధవ్! నువ్వు చెయ్యబోయిన అఘాయిత్యం? అందర్నీ ఏం చేసి పోవాలనుకున్నావ్?" కాస్త వణికింది గొంతు.

"అందరెవరూ? అయినా నా విషయాల్లో నీకెందుకు జోక్యం?"

"నే నెవరో నీకు తెలియకనే దూరంగా పోవాలనుకుంటున్నావా! ఆరోజు నేనలా అన్నాననేగా నీ కోపం!"

"దయవుంచి నా జోలికి రాకు! నేనేమైతే నీకేం?" కినుక స్పష్టమౌతోంది అతని ప్రవర్తనలో.

"చూడు మాధవ్! నీకు నేనేంకానా? అనుకుంటే అన్నీ అవుతాను. సూటిగా నా వైపు చూచి చెప్పు! కాదనగలవా? ఆవేశంలో నేనారోజు అలా అన్నాననేగా, సైన్యంలో చేరడానికి సాహసించింది! నా మూలంగా నీ సున్నిత హృదయం బాధపడుతుందని, అన్ని సమస్యలను ఎదుర్కొనే మనస్థయిర్యం నీకింకా కలగలేదని, నీ సుఖం కోరి నేనానాడు నిరాకరించాను. నయాన చెపితే నీవు విననందుకు అలా ప్రవర్తించాల్సొచ్చింది... మరో విషయానికి నాకు

గాయం రేగింది... ఆ బాధలోనే నువ్వొచ్చి వత్తిడి చేశేవ్! పర్యవసానం..." వేదనగా నిట్టూర్చింది.

"సమర్థించుకోకు! నేన్నీకు తగనని పరోక్షంగా చెప్పావ్! నేనే వూహించలేక పోయాను... నువ్వు సంపాదన పరురాలివి, వ్యక్తిత్వం గల ఆత్మాభిమానివి... నీ వెక్కడ-నే నెక్కడ.... ఏదో పొరపాటున నోరు జారాను .. మరచి పోయి...."

"నీ కోర్కె నెరవేర్చుతాను మాధవ్! నన్ను క్షమించు.... యింకెన్నడూ యుద్ధంలోకి పోనని వాగ్దానం చెయ్యి... " చేతిని ముందుకు చాచింది అధికారపూర్వకంగా.

"ఏదీ చెయ్యకపోతే నా తమ్ముళ్ళ చదువులెలా సాగుతాయి ? నా చదువు పూర్తయ్యేదెలా ? నన్ను అడకత్తెరలో బిగిస్తున్నారు మీరంతా ! పరోక్షంగా నా జీవితం మీద 'సవాల్' ఇది" తన చర్యను సమర్థించుకోసాగాడు.

"సవాల్ కాదు, దైవసాక్షిగా చెపుతున్నాను. ఈనాటి నుంచి మనిద్దరం ఒకటే—మన రెండు కుటుంబాల్లో ఏ ఒడిదుడుకులొచ్చినా ఇద్దరం జతగా పంచుకుందాం...నీ చదువు పూర్తయ్యేదాకా నేను ప్రైవేట్లు చెప్పి సంపాదించి యిస్తాను."

"నీ డబ్బుతోనా ?..." కించపడ్డాడు మాధవ్.

"నీ, నా...తరతమభేదాలింక వుండకూడదు. నేను

కావాలనుకుంటే నే చెప్పినట్టు చెయ్యి...ఉభయత్రా శ్రేయస్కరం..." ప్రేమభరిత నేత్రాలతో చూచింది.

అనురాగపూరితంగా చేతులు చాపాడు మాధవ్.

కరద్వయాన్ని ఆదరంగా కళ్ళకద్దుకుంది రాధ.

ఆ కలయికలో యువకోద్రేకం గాక ప్రేమాతిశయం వెల్లివిరిసింది.

ఇరువురి నయనాల్లో నీటిచక్రాలు కదలాడాయి.

"కల కాదుకదా రాధమ్మా..." సంతోషాతిరేకంతో అతని గొంతు పూడుకపోయింది.

"కల కాదుగాని కల్ల కారాదని ఆశిద్దాం మాధవ్ గారూ ! ఇకనైనా రాధ వెంబడి 'మ్మా' తీసివెయ్యాలి..." ఆదేశం, ఆకాంక్ష మేళవించిన స్వరంతో అంది.

"దేవిగారి ఆజ్ఞ...ఈ భక్తుడు సదా భృత్యుడు.కనికరం కరగనివ్వకండి...'క్షణక్షణంబుల్ జవరాళ్ళ చిత్తముల్..." అతని మాటలో అభ్యర్థన ధ్వనించగా, అనురాగం నిండిన కళ్ళతో చూశాడు.

"స్త్రీ చిత్తం పురుష భాగ్యం; సామెతల పరం పరలకేం గాని, వాటిని ఆచరించడమే అసాధ్యం" మురిపెంగా అతణ్ని వీక్షింప సాగింది.

టేబుల్ మీది నోట్సు, ఆమె దృష్టిని ఆకర్షించగా చేతికి తీసుకుని చూచింది. రామకోటిలా 'రాధా మాధవ్' అని బుక్కు నిండా రాసుంది...క్రొత్తగా కొట్టివేసిన గీత

లున్నాయ్...మాధవ్ అనే అక్షరాలు 'అండర్ లైన్' చేసు న్నాయి. టేబుల్ మీది పెన్నందుకుని, రెండు పేర్లను కలిపి ఒకే 'అండర్ లైన్' చేసింది. వేరే లైన్‌లో రాధా మాధవ్ అని వ్రాసి, దాని క్రింద 'ఐ లవ్ యు'...అని రాసింది.

రేడియో ఆన్ చెయ్యగానే,

'రాధ హృదయం... మాధవునికే దేవాలయం.' అని పాడసాగింది. "సందర్భోచితంగా రికార్డులు వేస్తున్నది ఆకాశ వాణి, మన రహస్యం ముందుగా కనిపెట్టి - అల్లరి పెడు తోంది. చూడండి మాధవ్..."

"బాబోయ్ ! అప్పుడే 'అండీ' బరువు మొయ్యలేను. కొన్ని రోజుల పాటు తేలిగ్గా పోనియ్ !"

జీవితంలో మొదటిసారిగా నిండుగా నవ్వింది రాధ.

ఆమె ప్రఫుల్ల వదనంలోనూ, నయనాల్లోనూ వెన్నెల రేఖలు విరిసాయి. అలాంటి వింత మెరుపెన్నడూ చూడలేదు మాధవ్.

ఇంతలో దేవాలయానికి వెళ్ళిన వైదేహమ్మ ఇంట్లోకి అడుగు పెట్టింది.

పూజ కుంకుమ ఇద్దరి ముఖాన దిద్ది, ఒక్క అరటి పండు రాధ చేతికిచ్చి, "వాడికి తుంచి పెట్టు" అంది.

"కొంచె కొరికి పెట్టమంటావా! మాధవ్" అంది పరాచికంగా.

రాధకేసి కొంటెగా చూచాడు.

"ఇదైనా కొత్తేం కాదు గదరా! చిన్నప్పుడు, నోట్లో పెట్టుకున్న పిప్పరమెంటయినా సరే, నువ్వేడిస్తే ఎంగిలిదే తీసిచ్చేది-పిచ్చి పిల్ల" వాత్సల్యం నిండిన కళ్ళతో రాధను వీక్షించింది వైదేహమ్మ.

కనుకొనలు సిగ్గులు చిలకగా ఓరగా మాధవ్‌ను అవలోకిస్తూ "పో అత్తయ్యా! చిన్నప్పటి సంగతులు చెప్పి నన్ను చులకన చేయిస్తావు..." అంది.

"నీ వెంత పెద్దదానివైనా మాకు చిన్నపిల్లవే! మొన్న జరిగినట్టుంది నాకు" ఆప్యాయత వొలికింది ఆమె స్వరం.

"నీ అభిమానం అలాంటి దత్తయ్యా" 'కలకాలం నీ అభిమానం నిలవాలి'... తన మదిలోనే అనుకుంది. "రేపు షికారుకు రా మాధవ్! అన్నయ్యకు తీరకపోతే తెలీని పాయింట్లయినా చెప్పించుకుపోవచ్చు. నువ్వు కనిపించకపోతే నాన్న పదే పదే అడుగుతుంటాడు..."

"అలాగా!" అని రహస్యంగా ఆమె చెవిలో గుస గుసలాడాడు.

మనోహరంగా నవ్వింది రాధ.

"వెళ్ళొస్తానత్తయ్యా!" లేచి చెప్పు లేసుకుంది.

"చీకటి పడినట్టుంది. వదలిపెట్టి రా రా! వంటరిగా ఎలా పోతుంది" తల్లి పురమాయింపుతో రాధను అనుస రించాడు.

"ఒంటరిగా వద్దట, జంటగా నన్ను నీతో వెళ్ళమంది" జంట దగ్గర వత్తి పలికాడు.

"పిడని జంటగా అనే నీవన అది..." మృదువుగా పలికింది రాధ స్వరం.

# 14

ఎప్పుడైనా మంచి చీరలు కొనుక్కోవాలనుకుంటే నా కెందుకని మొరాయించే రాధ, చెప్పిందే తడవుగా తన కిష్టమైనవి గాక, మాధవ్‌ను కూడా 'కన్సల్ట్' చేసి మరీ కొన్ని తీసుకుంది. బట్టల దుకాణానికి శ్రీధర్‌తో మాధవ్ రాబట్టి అలా తటస్థించింది. తనకని తెచ్చుకున్న చీరల్ని చూచి జానకమ్మ కళ్ళు ఎర్రనైనాయి. మనసు కేదో అనుమానం తోచింది.

రాధ తన శరీరం మీద, అలంకరణ పైన శ్రద్ధ వహిస్తున్నందుకు అందరూ ఆనందిస్తూంటే జానకమ్మ క్రోధం మరింత పెరిగింది.

"రాధా! నా మాట నీ కెంత కష్టం కలిగినా సరే, నువ్వు మాత్రం వన్నెల చిన్నెలా వుండడానికి వీల్లేదు. ఆ మాధవ్ గాడితో రాచుకు పూచుకు తిరుగుతూంటే అనేక విధాల అనుకుంటారు. నీ ప్రవర్తన మీద నీ చెల్లెళ్ళ భవి

వ్యక్తిత్వం ఆధారపడి వుంటుందని మరవద్దు..." మెత్తగా చివాట్లు పెడుతూ ఆర్డర్ జారీ చేసింది.

నిద్రపోతున్న సింహాన్ని తట్టిలేపి రెచ్చగొట్టి నట్లయింది రాధకు.

"అమ్మా! నేనేం చిన్నపిల్లనుగాను, నా మంచి చెడ్డ లేవో నేను నిర్ణయించుకోగలను... నా మనసుకు తప్పుగా తోస్తే నేనే చెయ్యకుండా వుండగలను ... ఎందరి కోసం ఎన్ని రోజులు నన్ను నేను చంపుకుంటూ బ్రతగ్గలను! నాకు కష్టం కలగడమనేది క్రొత్తగా జ్ఞాపకం వచ్చిందన్నమాట. నా సుఖం ఎప్పుడైనా యోచించావమ్మా!! నేనేం పాపం చేశానని నన్నిలా సాధిస్తున్నావమ్మా!" కన్నీళ్ళు చిప్పిల్లాయి రాధకు.

"నే చెప్పినట్టు విని వుంటే, నిన్ను అపురూపంగా చూచుకునే దాన్ని! కాని నాకు తోడు నీడా లేకుండా చేసేవ్! ఇంతకంటే ఇంకేం పాపం చేయాలి తల్లీ!... కూతురివని ప్రేమ పొంగినా, పాత జ్ఞాపకాలు నన్ను రాక్షసిని చేస్తున్నాయి. నా జ్ఞాపకాలెన్నడు మాసిపోతాయో! నీ కెప్పుడు మంచి దినాలొస్తాయో, దైవానికే ఎరుక..." ఓ లిప్తపాటు విచారం అలుముకొంది జానకమ్మ ముఖాన.

టైలర్ బట్టలు తెచ్చాడని హాల్లో నుంచి పిలుపు రాగా వెళ్ళింది రాధ.

మగ పెళ్ళివారికిచ్చే విడిదింటి ఏర్పాట్లు, వర పూజకు దేవాలయంలో జరగాల్సిన ఏర్పాట్లూ చూడ్డానికి రాధ, మాధవ్‌లు కలిసి వెళ్ళేరు.

రోజాకలర్ చీర, అదేరంగు జాకెట్, జడలో రోజా పూలగుత్తి వుంచుకుని, లేడీలా గెంతుతూ పనులు పురమాయిస్తున్న రాధను చూస్తుంటే మాధవ్ మనసు మధుర భావాలతో నిండిపోయింది. మదిలో మోహనరాగం ఆలపించినట్లయింది దానితో రాధ శ్రుతి కలిపితే బావుంటుం దనిపించింది.

తనది కాదనుకున్నప్పుడు, ఓ మిత్రురాలిగా అభిమానించేవాడు. కాని, తనదనుకున్నప్పుడు, ఏదో శ్రద్ధ, మమత, ఆశ పెనవేసుకున్నాయి మాధవ్‌ను.

అలాగే కన్నార్పకుండా చూస్తూ వుండి పోయాడు.

రాధ చూచే సరికి, విస్ఫారిత నేత్రాలతో త్రాగేసేలా తిలకిస్తున్నాడు తనను. చేతులు వెనక్కు కట్టుకుని నిలబడిన మాధవ్ మిలిటరీ ఆఫీసర్లా ఠీవిగా నిలబడి ఉన్నాడు. 'లైట్ స్నఫ్'కలర్ శ్లాకుతో తెల్లని నిండైన శరీరంతో విశాలమైన నుదురుపై రెండు రింగుల వెంట్రుకలు నర్తిస్తుంటే, సన్నని కోరమీసకట్టుతో అందాలు రంగరించి మలచిన... అపురూప పురుష శిల్పంలా వెలిగి పోతున్నాడు.

ఆ విశాల వక్షంపై వాలిపోయి కలకాలం కాపురం చేయాలనిపించింది. అమాయకుడిగా తన వెంట తిరిగే మాధవ్

ఈనాడు తనకు కాబోయే భర్త—అనుకోగానే లజ్జాభావంతో రాధ కనులు వాలిపోయాయి.

చిన్నగా నడుచుకుంటూ రాధ సమీపానికొచ్చిన మాధవ్ "ఇల్లాంటి కలలు కనకపోతే అలా కూర్చుందాం రాకూడదూ!" అంటూ చెయ్యిపట్టి నడిపించాడు.

సాయిబాబా దేవాలయం వెనకవైపు ఓ బండమీద కూర్చున్నారు. అక్కడనుంచి 'పార్కు' కనిపిస్తుంది. అక్కడికింకా మనుష్యులు రాలేదు. దేవాలయం గర్భగుడి తలుపులు తీయనందున జనసమ్మర్దం ఎక్కువగా లేదు.

"పరవ్రాజకు నన్ను గూడా యిక్కడే దించుతావేమోకదూ!" ఆనందంతో తేలిపోతూ అన్నాడు మాధవ్.

"నమ్మకం లేదు మాధవ్! నీకూ మీ వాళ్ళకూ ఆ కోర్కె వుండడం సహజం. నాతో జరిగేట్టయితే శాస్త్రోక్తంగా జరక్కపోవచ్చు. కారణం వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను."

రాధ ముఖం పాలిపోవటం గమనించి "సారీ... రాధా! బాధపడకు, అందరి అంగీకారం లేకపోతే, రిజష్ట్రాఫీసు వుండనే వుంది. ఇంక ఏ సందర్భంలోనూ నీవు బెంగ పెట్టుకోకూడదు. నీ కంటి నీళ్ళు నే చూడరాదు రాధా! నీకు నేనున్నాను..." అభయ ప్రదానం చేసేడు.

"అవును మాధవ్! నీవున్నావు... ఇంక నాకే చింత లేదు. నీ ఆసరాతో నేను ఏ ఉన్నత శిఖరాలనైనా అధిరో

హించగలను. ఎన్ని దూషణాలనైనా తేలిగ్గా తీసుకోగలను... ఈ నా మనోమందిరాన ప్రతిష్ఠించబడ్డావు... అందుకే ఈ గుడికి పునర్నిర్మాణం జరిగింది... నాకు పునర్జన్మ ప్రసాదించబడింది. ఆనాటి రాధ రాతిబొమ్మ, జీవచ్ఛవం-ఈనాటి నీ సన్నిధినున్న రాధ - మాధవ్ చేతి మురళి. మధుర రవళి... పలికించే భారం నీదే" కన్నులు అరమూతలు కాగా కొన్ని క్షణాలు అలా ఉండిపోయింది.

ముకుళించిన రాధ కరద్వయంలో ఏదో వస్తువుంచాడు, మాధవ్. కళ్ళింతవి చేసుకుని చూచి సంతోషాతిరేకంతో కనుల కద్దుకుంది. అది రాధామాధవ్‌లు ప్రణయరాగాను బంధంలో లీనమై పోయిన ప్రతిమలున్న దంతపు లాకెట్.

గబగబ 'పర్సు'లో వేసుకుని నలువైపులా చూచింది.

అప్పుడే నలుమూలలా చీకటి తెరలు అలుముకున్నాయి. నెలబాలుడు తొంగిచూస్తున్నాడు. నీలాకాశాన వెండి పూలలాంటి తారకలు నిక్కి నిక్కి చూడసాగాయి వసుంధర కేసి.

"దేవిగారు గగనవీధులలో విహరిస్తుంటే ఎలా? భువికి దిగిరండి! ఇక్కడ తమ కటాక్ష వీక్షణాలకై ఒక దీనుడు నిరీక్షిస్తున్నాడు..." అన్నాడు చిలిపిగా.

తెల్లని పలువరుస తళుక్కుమనగా, ఫక్కున నవ్వింది రాధ. ఆ వెన్నెల వెలుగులో ముత్యాల నేరుకోసాగాడు మాధవ్.

"రాధాదేవి! కానుక కొట్టేసి గమ్మునుంటే సరా! ప్రతిగా నీవేం యిస్తున్నావో చెప్పవా!" కొంటెచూపు విసిరాడు.

"నా దగ్గరేం మిగిలుంది మాధవ్! నా మనసే నీదైనపుడు నేను..."

"అవునవును. నేనే మరచాను నీవు నా మురళివి కదూ! మరి, అధరాల దరికి చేర్చుకోవాలిగా! ఏదీ" అంటూ రాధ మోము దోసిట్లోకి తీసుకుని చటుక్కున చెక్కిలిపై ముద్దు పెట్టుకున్నాడు. ఆ మధురానుభూతి విద్యుత్‌లా మేనంతా ప్రాకి మత్తావరింపజేసింది. మనసు ప్రభావితమై పల్లవించింది. అలాంటి స్పర్శ మున్నెన్నడూ అనుభవించలేదు. మది స్వర్గ సోపానాలు అధిరోహించినట్లుంది...హృదయ తంత్రులు మీటిన గాయకునిపై మమత మరింత పెరగసాగింది. ఎందుకు స్త్రీ పురుషునికి తన సర్వస్వం సమర్పించడానికి వెనుకాడదో ఇప్పుడిప్పుడే అర్థం కాసాగింది. ఈ అనురాగవల్లరి జన్మజన్మాల అనుబంధం కావాలని ఎందుకు ఆడది కోరుకుంటుందో తెలుసుకోగలిగింది. ఇన్నాళ్ళ తన జీవితానికో అర్థం ఏర్పడింది.

ఏ దివ్య లోకాల్లోనో విహరిస్తున్న రాధ, అక్కడ 'లైట్లు' వెలగడం, మనుషులు హడావుడిగా తిరగడం గమనించలేకపోయింది.

"ఏమ్మా! ఇక్కడే కూర్చున్నావ్? కాళ్ళు నొప్పులు

పుట్టాయా ! అన్నీ సర్దుకోవాల్సింది నీవేగా ?" అనిన అన్న పలకరింపుతో దివినుంచి భువికి దిగిపడింది రాధ.

శ్రీధర్ ప్రక్కన విజయగర్వంతో అలరారే మాధవ్‌ను చూచి కంగారు పడింది. మాధవ్‌తో తన చొరవను అన్న చూసిఉంటే ఏమని భావిస్తాడో నని గాభరా పడింది.

"లేదన్నయ్యా ! వూరికే కూర్చున్నాను...నా కెంత పనైనా కష్టంగా లేదు. ఇంకెంతైనా ఆనందంగా చెయ్యగలను..." గాలిలో తేలిపోతూ సమాధానం చెప్పింది.

"సంతోషం సగం బలం" అర్థాంతరంగా నవ్వేడు శ్రీధర్.

అతడి ప్రసన్నతకు సంతోషం కలిగింది రాధకు.

"కరెక్ట్...కరెక్ట్..." ఎన్ని సార్లందో గుర్తు లేదు.

"ఫుల్‌స్టాప్" అన్న శ్రీధర్ గొంతు విని, పరాగ్గా పలికిన పదాలకు సిగ్గు జనించగా, వడి వడిగా అడుగులేసుకుంటూ జనంలో కలిసిపోయింది.

సౌద పెండ్లి జరుగుతున్నప్పుడు పెండ్లి కుమారుడిలో మాధవ్, సౌదలో తనూ వున్నట్లు వూహించుకుంటూ, మధ్య మధ్యన మాధవ్ కేసి చూచేది రాధ. అదే తరుణంలో

[illegible] తనవైపు ప్రార్థించే కన్నులతో చూచేవాడు. మురిసిపోయేది రాధ.

"నాతిచరామి, నాతిచరామి" మూడుసార్లు వినిపించేరు.

పాదసిగ్గు దొంతర్లలో వోరగా వరుణ్ని చూస్తుంటే కవ్వించే కన్నులతో ఎంతో తృప్తిగా చూస్తున్నాడు నిరంజన రావు.

"అర్ధంచ, కామంచ..." పలుమార్లు పలుకుతున్నాడు వరుడు.

అసలెందుకు చెప్పిస్తున్నారో! ఎందుకు పలుకుతున్నారో! కొందరికి అసలే తెలీదు. సమయం వచ్చినప్పుడు పెళ్ళినాటి ప్రమాణాలకు ప్రాముఖ్యం యివ్వని వారెందరో వున్నారు.

పెళ్ళంటే తనకు తెలిసిందల్లా పట్టు పావడా కట్టుకోవడం, పూలజడ వేయించుకోవడం, మిఠాయిలు తినడం, అందరూ తనను దేనికీ కోప్పడకుండా అపురూపంగా చూచుకోవడం మాత్రమే. అయితే తన కప్పుడు అర్ధం కానిదల్లా ఒకటే... పెండ్లికొడుకు తనకేమో, మామయ్యగానే అనిపించేది. 'మొగుడు' అంటుంటే పిసుగనిపించేది.

తను పెళ్ళిలో పూలబంతులాట అవగానే పరస్పరం పేర్లు వాళ్ళను చెప్పమన్నారు. తను మామయ్యా అనే

చెప్పించి - పెండ్లికొడుకు చేత. అతడు మామయ్య కాదు నీ మొగుడు అని కోపగించుకున్నారు.

పెండ్లి జరుగుతున్నప్పుడు వాళ్ళన్న చంకలోనుంచి మాధవ్ తన దగ్గరికి రావాలని ఏడ్చేవాడు. అమ్మ ఉరిమి చూడగానే బిత్తర చూపులు చూస్తూ... ఇంకా బిగ్గరగా ఏడ్చేవాడు... తనకది గుర్తురాగానే బొద్దుగా, ముద్దుగా ఉంగరాల జుట్టుతో బాలకృష్ణుడిలా వున్న మాధవ్ గుర్తు కొచ్చాడు... తనకు కలగబోయే బిడ్డలు అచ్చం మాధవ్‌లా అలా అనుకుంటూ రాధ మధురానుభూతితో ఉండిపోయింది.

తన కెదురుగా కూర్చున్న మాధవ్ కేసి చూచింది. అతడి చూపులు తూపుల్లా రాధ ఎదను గిలిగింతలు పెట్టేయి. తల్లి తమను చూస్తుందేమోనని తల త్రిప్పి చూచింది. ఆమె తీక్షణ దృష్టికి తట్టుకోలేక ముఖం త్రిప్పుకుంది.

వివాహపు తంతు ముగిసింది.

రాధ పెండ్లి పందిట్లో...వచ్చిన వారందరికి తాంబూలాలు కవర్లందాయో లేదో చూడడానికి లేచింది.

# 15

కొన్ని కారణాలవల్ల రాధకు చిన్నతనంలోనే పెళ్ళి చేయాల్సొచ్చింది. జానకమ్మ తండ్రి జబ్బు మనిషి గనక, పొలం ఎక్కువగా వున్నందువల్ల 'బాలు' జరుపుకోలేక మేన ల్లుడు రాఘవయ్యను, ఇల్లిటం తెచ్చుకుని జానకమ్మనిచ్చి చేసేడు. కొడుకు చంద్రశేఖరం- గారాబంవల్ల మొండిగా తయారై బడికెళ్ళకుండా... తోటల్లో, దొడ్లల్లో దొంగపిల్లల ముఠాను జేర్చి, అల్లరి చేసేవాడు. ఒకసారి కోపంతో శేఖ రాన్ని వళ్ళు వాతలు బడేట్టు కొట్టాడు తండ్రి... దాంతో అలిగి వూరొదిలి వెళ్ళిపోయినాడు చంద్రశేఖర్.

ఆ వెళ్ళడం... మళ్ళీ ఎనిమిదేళ్ళ తరువాత వచ్చాడు. అప్పటికి ఎన్నో పరిస్థితులు మారాయి. తండ్రి మరణించాడు. సగం ఆస్తి రాఘవయ్య పేర సగం శేఖర్ పేర విల్లురాసి పోయాడు.

అప్పటికైనా యిల్లు చేరినందుకు అందరూ ఆనందిం చారు. సేద్యపు పనులు చూస్తూ బుద్ధిగానే వుండేవాడు. చదువబ్బక పోయినా లోకజ్ఞానం సంపాదించుకుని వచ్చి నందుకు మురిసిపోయేది జానకమ్మ. క్రమేణా నమ్మకం ఏర్ప డింది రాఘవయ్యకు.

ఇంతలో పెద్ద జబ్బు చేసింది శేఖర్ తల్లికి. కొన్ని నెలల కంటే బ్రతకదని చెప్పారు వైద్యులు.

కొడుకు పెళ్ళి చెయ్యమని బ్రతిమాలిందామె. శేఖర్ బాగు పడ్తాడనే ఉద్దేశంతో రాజుతో శేఖర్ పెళ్ళి జరిపించాడు... పెండ్లయిన రెండు నెలల తదనంతరం ముసలామె చనిపోయింది. శేఖర్ కుర్రకారుతో స్నేహాలు మొదలు పెట్టేడు. జల్సాగా తిరిగి డబ్బు ఖర్చు కాగానే ఇల్లు చేరేవాడు. దేశం మీదికి వెళ్ళినప్పుడు అన్నీ దురలవాట్లు పట్టుబడ్డాయి. వచ్చిన క్రొత్తలో కొన్ని రోజుల వరకూ... బుద్ధిగా వుండి, ఆ తర్వాత పాత అలవాట్లను తెచ్చుకున్నాడు.

ఎన్నో విధాల చెప్పి చూచి మందలించాడు రాఘవయ్య. ఫలితం శూన్యమైంది.

"చిన్నప్పటి నుంచి దేశం మీద తిరిగి, ఇప్పుడింట్లో వుండవస్తే వాడికి... నీ ఆంక్షలేంటీ ! వాడి సొమ్ము వాడు ఖర్చు పెట్టుకుంటాడు. వాడిష్టం !" భర్తనంటూ తమ్ముడిని సపోర్టు చేసేది జానకమ్మ.

దాంతో అతడికి అలుసు దొరికింది.

జానకమ్మ మొదట్నించీ పెత్తనం చెలాయించడం అలవాటు చేసుకున్నందువల్లనో, భర్త ఇల్లరికం వచ్చాడని అలుసోగాని, నిర్లక్ష్యంగా మాట్లాడుతుంది.

శేఖర్ అప్పులు చేస్తున్నాడన్న విషయం రాఘువయ్య చెవులదాకా వచ్చింది.

"మీరాకు బాకీ తీరుస్తాడని నమ్మకముంటేనే ఇవ్వండి! వాడి అప్పుతో నాకెలాంటి సంబంధం లేదు" ఖచ్చితంగా చెప్పాడు తన నడిగిన వారితో రాఘవయ్య.

"లిగిసింట్లో పుట్టి వాడికేం ఖర్మ. పిసినారిగా బ్రతక డానికి ? ఇవ్వండి!" ఆజ్ఞాపించేది జానకమ్మ.

శేఖర్‌కు అప్పుల వాళ్ళధికమైనారు. అందరూ వత్తిడి చెయ్యడం ప్రారంభించారు. ఆస్తి కంటె అప్పే ఎక్కువ కన పడ్డంతో ఐ. పి.-కోర్టులో దాఖలు చెయ్యవలసి వచ్చింది... అప్పుల బెడద తీరిందిగాని దురలవాట్లు మానలేక పోతు న్నాడు శేఖర్.

చేతికి డబ్బిస్తే చెడిపోతాడని రాఘవయ్య డబ్బు ఎక్కువగా ఇచ్చేవాడు కాదు. పదో, పరకో జానకమ్మ ఇస్తూ వుండేది.

ధాన్యం అమ్మిన డబ్బు ఇంట్లో వుంది. మర్నాడు నెల్లూర్లో బ్యాంక్‌లో వేసి రావాలనుకున్నాడు రాఘవయ్య. ఆనాడు ప్రొద్దుగూకిన తరువాత డబ్బు యిచ్చారు ధాన్యం కొలుచుకున్న వాళ్ళు.

తెల్లవారేసరికి ఆ డబ్బుతో శేఖర్ అదృశ్య మయ్యాడు.

జానకమ్మ నెత్తి నోరు కొట్టుకుని ఏడ్చింది. ఇల్లొదిలి శేఖర్ పోవడానికి భర్తే కారణమని నిందించింది.

తాళి కట్టించుకున్నది అదృష్టవంతురాలు. అలాగు వల్లే భర్త పారిపోయాడని కూతుర్ని దూషించేది.

మామయ్య పోవడానికి, తనను తిట్టడానికి సంబంధమేమిటో అర్థమయ్యేది కాదు రాధకి.

# 16

బొట్టెడు పూలు తెప్పించింది రాధ. శోభనపు గది అలంకరించడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంది.

శాటిన్ గలీబులు కుట్టించుకొని రమ్మని పురమాయించింది మాధవ్‌ని. కొన్ని నోట్లు అతడి చేతిలో కుక్కి ఒక్కొక్కటని ఆదేశిస్తోంది.

"చెల్లెలి విషయానికే ఇంత హడావుడి చేస్తున్నావ్! మరి మన..." మనోహరంగా నవ్వేడు మాధవ్ రహస్యంగా.

"ఛీ... పో... చిలిపివాడివై పోతున్నావ్!" చిన్నగా జబ్బపై చరిచింది.

"అ...బ్బా...అలా...ఇంకొన్ని కొంటె మాటలు నేర్పుతుంటే బావుండునే! దేవిగారి కరస్పర్శ భాగ్యమైనా లభిస్తుంది..." అంటూ చిన్నగా చిటికిన వ్రేలితో రాధ బుగ్గ మీటేడు.

రాధ ప్రఫుల్ల ముఖారవిందం గాంచిన మాధవ్

మనసు పల్లవించింది. నాలుగు కళ్ళు ఒకటై నిలిచిపోయాయి. ఇరువురి మధ్య ప్రణయ పవనాలు వీచాయి.

గడపలో ఎవరివో అడుగులచప్పుడు తాగా పైటై తాళం వేసే నెపంతో అక్కడికి నడిచింది రాధ. అక్కడున్న బ్యాగ్ అందుకుని హాల్లో కొచ్చాడు మాధవ్.

సామాను సంచితో మాధవ్ రూములోకి వచ్చే సరికి పందిరి మంచం చాందినీకి మల్లెలసరాలు, కదంబమాలల్నీ జాలర్లుగా దించుతోంది రాధ.

తెల్లని శాటిన్ గలీబులతో మెరిసిపోయే పడక తనను ఆహ్వానిస్తున్నట్టు తోచింది మాధవ్‌కు.

“ఒక్కమాటు...పడుకొని చూడనా ? హాయిగా వుందో లేదో !...” వాంఛ నిండిన కళ్ళతో వీక్షించాడు మాధవ్.

రాధ కపోలాల్లో గులాబీలు పూసేయి. మేనంతా తియ్యని కోర్కెను వాంఛించింది. మంచంపై సర్దుతూవున్న రాధ చెయ్యి పట్టు తప్పింది. తల దిండుపై ఆనింది.

మువ్వకొనని ముంగురులు, అల్లనల్లన దిండుపై పరుచుకున్నాయి. శ్రమజేసి అలసిన మేను చమరించి వుంది. స్వేద బిందువులు ముత్యాల్లా మెరవసాగాయి, లైట్ల కాంతికి. చేత్తో అలా దిండు నిమురుతున్న రాధ చేతికి నును వెచ్చని

స్పర్శ తగిలింది. నున్నటి చెక్కిలిపై అతడి సన్నని మీసం చిన్నగా గ్రుచ్చుకుంది. ఆ సుఖానుభూతిలో యుగాలవరకు వుండిపోవాలనిపించింది రాధకు.

ఆ స్వర్గధామం నుంచి యదార్థానికొచ్చిన రాధ ఉలిక్కిపడి చివుక్కున లేవబోయింది. అతడి బలిష్ఠమైన కర ద్వయం ఆమెని నొక్కిపట్టింది. సున్నితంగా రెండు చేతుల్నీ నెట్టివేసింది రాధ.

"ఇక్కడికెవరూ రారు. అంతా హాల్లో భోజనాల మీదున్నారు" అన్నాడు మాధవ్ ఆలోచిస్తూ.

"అయితే అవధులు మీరాలనుకున్నావా, మాధవ్! నన్ను కవ్వించకు...ప్లీజ్!" చేతులు జోడించింది ప్రార్థన పూర్వకంగా.

"సారీ! రాధా! ఇక మీదట కంట్రోల్లో వుండడానికి ప్రయత్నిస్తాను..." గడ్డం పట్టుకొని వూపాడు.

"ఇదేనా కంట్రోల్లో వుండడం? చిలిపీ!" అతడి నెత్తిన చిన్నగా మొట్టింది

"నేను...పరిధి దాటేనన్నావే! నువ్వు చేసిం దేమిటో?" అన్నాడు వెక్కిరింపుగా.

రూములోకి మనుష్యులు రాసాగారు. రాధా, మాధవ్‌లు, ఏదో సర్దడంలో లీనమైనారు.

శోభనపు గదిలో అడుగు పెడుతున్న రాధ కన్నుల్లో ఏదో కాంతి. [illegible] ఏదో మత్తు గోచరిస్తోంది. ముందుకు వేస్తున్న ఒక్కొక్క అడుగు ఆనంద శిఖరాల సోపానాల అధిరోహిస్తున్నట్టున్నది. నిరంజనరావు మేనిలోని గర్వపు పొంగులు నిశ్వాసల ద్వారా వెలువడుతున్నాయి. నయనద్వయం దేదీప్యమానమైన కాంతిని వెదజల్లుతోంది. అతని చూపుల్లో తియ్యని గాఢవాంఛ వ్యక్తమౌతూంది.

వారిరువురి పరిస్థితి గమనిస్తోంది రాధ.

స్త్రీ జీవితంలో యిదో మరపురాని మధుర ఘట్టం. దాంపత్య జీవనానికి రాగబంధం. వలపుల తలపులు, పరువపు పొంగులు సార్థకమయ్యే కమనీయమైన సన్నివేశం.

ఊహాలోకాల్లో విహరిస్తూ అందరితో బాటు రూము వాకిలి దాటనందుకు రాధను తలొక విధంగా విమర్శనా దృష్టితో చూడసాగారు. కొందరు సానుభూతి ప్రకటిస్తే, మరికొందరు ధిక్కారం వ్యక్తపరిచేలా చూస్తున్నారు.

రాధ పరాకునుంచి తేరుకుని చూచేసరికి అలా వుంది పరిస్థితి. సిగ్గుతో కుంచించుకుపోతూ చకచక నడిచి పెరట్లోకి వెళ్ళింది.

* * *

ఇల్లు చిన్నదైనందువల్ల బంధువుల రాకతో విశాలంగా వాడుకోడానికి వీలుగా లేదు. హాల్లో, వరండాలో చుట్టాలకు పడకలు సరిపోయాయి. రాధ యీజీ ఛేర్లో కిటికీ

ప్రక్కన మేను వాల్చింది. శోభనపు గదికీ ఆ కిటికీ సమీపాన వున్న అగరొత్తుల పరిమళం కిటికీ 'వెంటిలేటర్' నుంచి వస్తోంది. వాకిట్లో వున్న మల్లె, సన్నజాజి పందిర్ల నుంచి మెల్ల మెల్లగా మలయ పవనాలు సౌరభాన్ని మోసు కొస్తున్నాయి. టేబుల్ ఫేన్ శబ్దంలో మధ్య మధ్యన చెల్లెలి చేతి గాజుల చిరుసవ్వడి శ్రుతి కలుపుతోంది.

సన్నని నిశ్వాసలు మధుర సన్నివేశపు సంకేతాన్ని సుస్పష్టం చేస్తున్నాయి.

ఆ పరిస్థితి రాధ తనువు వాలు కుర్చీలో అసహనంగా కదలసాగింది.

మాధవ్ రూపు తన కళ్ళ ముందు మెదలసాగింది మనసంతా మాధవ్ భావనలో నిండిపోయింది.

వయసు, మనసు నేర్పలేని ప్రణయ పాఠాన్ని మాధవ్ నేర్పాడు. స్పందన లేని పాషాణ ప్రతిమకు ప్రాణం పోసేడు మూగ వీణపై మధురగీతం ఆలపింప జేశాడు. ఆరిపోయిన ప్రమిదలో ఆశాదీపం వెలిగించాడు.

కేవలం పురుష స్పర్శలోని మధురానుభూతి స్త్రీ సహజమైన ప్రకృతి వాంఛే అయితే, ఆనాడెందుకు మగ స్పర్శకు, కరుడు గట్టిన కఠిన శిలగా మారిపోయింది తను?

మనసు లేని శరీరానికి స్పందన లేదని అర్థమౌతోంది. మనసుకు, శరీరానికి అవినాభావ సంబంధమేమో!

రాధ ఆలోచనలు కొన్ని సంవత్సరాలు వెనక్కు వెళ్ళేయి.

# 17

దేశాలు పట్టుక పోకూడదనుకున్న శేఖర్ మావయ్య చాలా సంవత్సరాల తరువాత తిరిగొచ్చాడు. అమ్మ ఆనందానికి మేర లేదు. నాన్న ఆందోళనకు అంతు లేదు. మావయ్య తిరిగొచ్చాడని మాత్రమే తనకు అనిపించింది.

అమ్మ వాలకం తనను కలవర పరచేది. మావయ్య తీవ్రదృష్టి తన శరీరాన్ని కంపర మెత్తించేది.

అమ్మ కార్యాన్ని కంటూ ముహూర్తం పెట్టించినపుడు, తనకు భయం ఆవరించింది గాని, అది ఆడదాని జీవితానికి సహజంగా జరగవలసినది, అవసరమైనదిగా తోచ లేదు.

తనకు ఆ ఆపదనుంచి తప్పించుకుని ఎలా బయట పడాల్నా! అనే బెంగ పట్టుకుంది.

నాన్న ఆ కార్యం జరపవద్దని అమ్మను శతవిధాల ప్రతిమాలుకున్నాడు.

తన నలాంటి పూబిలోకి దింప వద్దని వేడుకుంది తను.

అమ్మ అవన్నీ పెడచెవిని పెట్టి, తను తలుచుకున్నది జరిపించ డానికే నిర్ధారించుకుంది.

"ఆ చపలచిత్తుడి చేతిలో దాన్ని పెట్టి, దాని జీవితం ఎందుకు నాశనం చేస్తావే?" అని విసుక్కున్నాడు నాన్న.

"ఎల్లకాలం అట్లాగే ఎందుకుంటాడూ? కాపరం నెత్తినపడి, పిల్లా జల్లా కలిగితే వాడే కట్టి పడేసినట్లు పడుంటాడు. ఏదో విధంగా, పుట్టింటి కాపరం నిలిచి, వాళ్ళ వంశం వృద్ధికొస్తే అదే తృప్తి నాకు. ఇంతకాలానికి ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు. మళ్ళా వాడ్ని కష్టపెట్టి, దేశం మీదకి తరిమి, నా కడుపులో ఎందుకు కోత పెడ తారు?"

తమ్ముడు దూరమౌతున్న బాధ తప్ప కూతురి సుఖం గురించిన ఊహ ఆమెకు కలగలేదు. ససేమిరా, తను మాట విననంది. తన పంతం నెగ్గించుకోడానికే పూనుకుంది.

సెకండ్ గ్రేడు చదువుతూ, సెలవలకు పల్లెకొచ్చి వుందప్పుడు.

స్కూల్లో తనకేదో ముఖ్యమైన పని వున్నట్టు తప్పని సరిగా రావాల్సినట్టు, ఎవరిచేతనో చెప్పించి ఆ వూరినుంచి తనను నెల్లూరు చేర్చారు నాన్న.

ఇలా ఆలోచనలతో వున్న రాధకు కునుకు పట్టింది.

నిద్రాదేవి ఆహ్వానాన్ని అందుకుని ఆమె వొడిలో కొరిగి పోయింది.

హాములో నుంచి సౌదను బయటికి రానివ్వాడు నిరంజనరావు. అందరితో సరదాగా మాట్లాడుతూ గడపాలని, నీటి వొడ్డున పడ్డ చేపపిల్లలా కొట్టుకులాడుతుంది సౌద.

సౌద స్నేహితురాలు, జయప్రద రాగానే, గది విడిచి బయటికొచ్చాడు నిరంజనరావు.

శ్రీధర్ ఏదో పని మీద బజారు కెళ్ళాగా, మాధవ్ నిరంజనరావుతో మాటలు కలపాలని అతడి సమీపానికి వచ్చాడు.

అయిష్టంగా ముఖం త్రిప్పుకున్నాడు సౌద భర్త. అతడి చర్యకు విస్మయం చెందాడు మాధవ్—వెళ్ళి కూర్చున్నాడు.

ఏమనుకున్నాడో నిరంజనరావు..మాధవ్‌ను పిలిచాడు. రావడానికి అభిమానం అడ్డొచ్చినా, సంస్కారం తృణీకరించలేకపోయింది - మౌనంగా వచ్చి నిలిచాడు మాధవ్. అంతా గమనిస్తూనే వుంది రాధ.

"మిష్టర్...మీ పేరు...?" డిగ్నిటీని మెయింటెయిన్ చేసుకుంటూ క్లిష్టంగా అడిగాడు.

"మాధవరావండీ!" అంతకంటే మరి మాటలు పెంచలేదు మాధవ్.

"మీరు .... బంధువులా!...." కనుబొమలు దగ్గరై నాయి నిరంజనరావుకు.

"అంతకంటే ... ఎక్కువే..." విసుగు ధ్వనించింది మాధవ్ జవాబులో.

"అంటే..." వెయ్యి ప్రశ్నలు, సందేహాలు మిళిత మైన స్వరమది.

"ఫామిలీ ఫ్రెండుని... శ్రీధర్ గారికి ప్రైవేటు విద్యా ర్థిని ... వీళ్ళింటికి నేను..."

అర్ధాంతరంగా ఆపినందుకు మనసులోనే ధన్యవాదా లర్పించుకుంది రాధ — కొంపతీసి కాబోయే అల్లుణ్ని అన నందుకు. నిరంజనరావు మాటలతీరు రాధను కలవర పరిచింది. కాబోయే పద్ధతులు...అంత విరసంగా వుంటే ఎలా! ... మరిదిగారి మన స్తత్వం అంతేనేమో! అని సరిపెట్టుకుంది.

రూములో నుంచి మిత్రురాళ్ళ సంభాషణ వినిపించగా గడపలోనే నిలిచిపోయింది రాధ.

"మాధవ్‌లా పాతకాలపు మనిషి కాదు. ఎంతో సరదా మనిషట-మావారు చెప్పారు. సొసైటీలో చలామణి కాగల ఘటికుడట—నీ కలాంటి వంటే యిష్టం కదటే...? పైగా రసికుడట - అందుకేగా, అందాన్ని ఆరాధించి, నిన్ను వరించాడూ?"వసపిట్టలా చెప్పుకుపోతోంది జయప్రద.

జయ చెప్పే ప్రతి మాట రాధ మనసును తీవ్రంగా ఆలోచింపజేస్తోంది. నిరంజనరావు పద్ధతులు ఒక్కొక్కటీ

హద్దుమీరినప్పై తే ప్రమాదకరమైనవేనని మనసు ఘోషించింది. ఇంతలో చెల్లెలేమంటుందోనని కుతూహలపడింది.

"అయితే మీవారు పాత చింతకాయ పచ్చడా! ఆహా–హా..." అది చెలెలికంఠం.

సౌద వాటిని తేలిగ్గా తీసుకున్నందుకు తృప్తి పడింది రాధ.

"పాత చింతకాయ, బూజు పట్టనిదైతే, ఎలాగో వాడుకోవచ్చుగాని ఎగిరే పతంగానికి, దారం గట్టిగా లాగి పట్టకపోతే ప్రమాదం సుమా!" పరిహాసంలోనే హెచ్చరిక జోడించింది జయప్రద.

"చూస్తావుగా" అన్న సౌద మాటల్లో బాగు పరచుకోగలనన్న భావం కొట్టవచ్చినట్టు తోచింది రాధకు.

కిలకిలమని యిద్దరి నవ్వులూ శ్రుతి కలిశాయి.

మిత్రత్వంలోని మధురిమ సాటిలేనిది, నిస్వార్థమైనది - అన్నిటికంటె తియ్యనిది స్నేహం – ఎవరో మహాపురుషుడు వ్రాసిన వాక్యం గుర్తుకొచ్చింది రాధకు.

నివేద వచ్చి 'అమ్మ వంట ఇంట్లోకి రమ్మంది'దని చెప్ప గానే ముందుకు సాగింది రాధ.

# 18

వెంకట గుంటూర్లో అత్తగారింట్లో వదలిపెట్టి వస్తే అవతల తను ఉద్యోగం చేసే వూరికి తీసికెళతానన్నాడు నిరంజనరావు.

సౌదను కోడరికానికి పంపేటప్పుడు, అందరి మనసులూ ఆర్ద్రమైనాయి...ఈనాటి వరకూ తమతో మెలిగిన పిల్ల, పరాయిచోటు తన స్థానంగా భావించుకుని మెలగడం కష్టమే....అనిపించింది రాధకు.

అత్తగారింటికెళ్ళే సౌద ముఖంలో కన్నవారి నొదిలి పోవాల్సొస్తుందనే విచారం కమ్ముకున్నా....ఆనంద రేఖ లేవో వెలిశాయి.

"అక్కయ్యా! నేను వెళుతున్న శాధకంటే, నీకు తోచదనే వ్యధ నన్ను పీడిస్తూందే! నీకు లేని సుఖాలు నే ననుభవిస్తూంటే, నీవు వుసూరుమని మోడులా వున్నందుకు..."

మాటను మధ్యలో తుంచుతూ.—

"ఇప్పుడవన్నీ ఎందుకే...!" విషయాన్ని సర్దుతూ ప్రియంగా ఓ చేత్తో చెల్లెలి ముంగురులు సవరిస్తూ బుజ్జగింపుగా భుజం నిమిరింది రాధ.

రిక్షాలు కదిలేదాకా వుండి, లోపలికి నడిచింది రాధ. శ్రీకర్ ముఖం వివర్ణమైవుంది. నివేద ముఖం కందగడ్డలా వుబ్బి వుంది. ఎప్పుడూ పేచీలు పడే అక్కచెల్లెళ్ళు విడిపోతున్న తరుణంలో... చింతకు లోనయ్యారు

ఆడపిల్లను అత్తగారింటికి పంపే ఘట్టంలోని దుఃఖం అలనాటి కణ్వమహామునికే తప్పలేదనేది, తండ్రి విచార వదనం చూచి జ్ఞప్తికొచ్చింది రాధకు.

సౌద విషయంలోని ప్రతి సంఘటన తన గతాన్ని, తన జీవితాన్ని వెలికి తోడుతోంది. తనకు అత్తవారిల్లంటూ లేకే లేదు.

# 19

"నా భార్యను నేను తీసుకెళ్తాను" అన్నాడు శేఖర్.

"నీకేం ఇల్లా? వాకిలా? సంపాదనా? ఎట్లా పోషిస్తావ్? ఎక్కడికి తీసికెళతావ్! అడగడానికి నీకిది లేకపోయినా, పంపడానికి నాకైనా జ్ఞానం వుండొద్దూ! తగుదునమ్మా! అని." అని కూతుర్ని పంపడానికి తిరస్కరించాడు రాఘవయ్య.

తమ్ముడికి వత్తాసి కొచ్చిన జానకమ్మ—

"వాడి సొమ్ము మనం తింటున్నాం గాని, మన సొమ్ముకు వాడేం రాలేదు. కోపం మీద పంపమన్న

మాత్రాన మన మొగుడికి పంపుతాం? ఇక్కడే మనతో పాటు వుంటారు."

"వాడి కేదైనా తిండికి నాలుగు రూపాయలు సహాయం చేస్తా గాని ఇంట్లో వుంచుకోలేను. ఒకటికి రెండుసార్లు నమ్మి నందుకు శాస్తి చేసి పోయినాడు. బుద్దొచ్చింది నీ వెంత గింజుకున్నా సరే అది జరిగే పనికాదు!" నిర్మొహ మాటంగా... తిరుగులేని జవాబు చెప్పాడు రాఘవయ్య.

"నీ కంతగా ఇంట్లో వుంచుకోను ఇష్టంలేకపోతే, వాడి పెళ్ళాన్ని వాడితో పంపు. చెట్టు క్రింద వుంచుకుంటాడు."

"జాన్నింట్లోనే గుట్టుగా బ్రతకనియ్యవే! ఎందుకు బజారుపాలు చేస్తావ్..." కోపంతో వూగిపోతూ బ్రతిమాలు కున్నాడు రాఘవయ్య.

అప్పటికి పట్టుదల సడలించుకున్నారు అక్కా-తమ్ముడు. కాని 'పగ' రాజుతూనే వుంది. సమయం కోసం వేచి వున్నారు.

ఇంతలో రాధ చేత 'విడాకుల' కోసం దావా వేయించాడు రాఘవయ్య.

అగ్గిమీద గుగ్గిలమైపోయింది జానకమ్మ.

మండే కొరివిని ఎగసన ద్రోసినట్లయింది శేఖర్ కు.

వారిద్దరికీ ద్వేషం పెరిగింది. పైకి కానరాకుండా కార్యరూపంలో చూపాలనుకున్నారు.

ఒకనాడు అనునయంగా నచ్చజెప్పబోయిన తల్లి మాటను తిరస్కరించింది రాధ.

"తృణీకరించిన ఫలితం జన్మ వున్నంత వరకూ అనుభవిస్తా" వని బెదిరించింది జానకమ్మ.

బెదిరింపులకు లొంగిపోని రాధ, తనను అర్థం చేసుకుని కాపాడమని ప్రార్థించింది తల్లిని. సోదరప్రేమ, పట్టుదల ఆమెను రాక్షసిగా మార్చాయి. మాతృప్రేమను ఓడించాయి.

ఒకనాడు రాధను ఎంతో ఆప్యాయంగా పిలిచి, ఆమెతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలన్నాడు శేఖర్.

"మేనమామగా నాకు గౌరవం ఎప్పుడూ వుంది. అలాగే మాట్లాడ" మంది రాధ.

"ఎప్పటికైనా భార్యాభర్తలం మనం. నీవిప్పుడు నాతో కాపరం చేస్తానని ఒప్పుకుంటే కేసు కొట్టేస్తారు. రాజీ పడొచ్చు. నా బుద్ధి మార్చుకున్నాను. ఇంకా మార్చుకుంటాను. కూలైనా చేసి నిన్ను పోషించుకుంటాను. నన్ను నమ్మి నాతో వచ్చేయ్. మీ నాన్న మనల్ని వేరు చేస్తాడు. మగవాణ్ని గనక నేను మళ్ళీ పెళ్ళి చేసుకోగలను. నీకు చేసుకో డానికి వుండదు. మొగుడొదిలిన ఆడదాన్ని చేసుకోవా లంటే ఎవరూ ముందుకు రారు, దాన్ని పొగరుబోతుగా

చిత్రించుకుంటారు. తిండి సంపాదించుకుని తిన్నా, దాంపత్య సుఖానికి నోచుకోని నిరర్థక జీవితం అవుతుంది నీది. బాగా ఆలోచించుకో!" అన్నాడు భవిష్యత్తును ఏకరువు పెడుతూ.

చదువులేని మామ అంత 'జనరల్ నాలెడ్జి' సంపాదించు కున్నందుకు ఆశ్చర్యపోయింది రాధ.

"మామయ్యా! ఒక్కటి గుర్తుంచుకో! పెళ్ళి నాకు తెలిసి, నా యిష్ట ప్రకారం జరగలేదు. అదీ పెద్దలే నిర్ణయించారు. ఇదీ పెద్దలే నిర్ధారిస్తున్నారు. నేను నిమిత్త మాత్రురాల్ని. నాన్న నా జీవితం ఎలా చెయ్యదలుచు కుంటే అలా చేస్తాడు. నేను విధి మీద భారం వేసి బ్రతుకు తున్నాను. నా కర్తవ్యం అంతే. అంతకంటే నేనేం చెప్ప లేను" మనసులోని మాటలు చెప్పేసింది రాధ.

"నీకే ఇష్టంలేక నాన్న మీద నెడుతున్నావు. అవతల పశ్చాత్తాపపడి వుపయోగం లేదు. యోచించుకో..." అధికారంగా ఒత్తిడి చేశాడు శేఖర్. అప్పటికి రాధ సహనం నశించింది.

"నీకు నిజంగా భార్య కావాల్సుంటే, అప్పుడు వెళ్ళినా మళ్ళీ తిరిగొచ్చి బాధ్యతాయుతంగా, దేనివల్లనైనా సంపాదించుకునే వాడివి. నీవు మంచి ప్రవర్తనలో వున్నట్టు రుజువై ఉంటే, నా మనసు నీ మీద లగ్నమయ్యేదేమో! కాని, నాకు తెలీని వయస్సులో తాళికట్టి దొంగతనంగా ఇంట్లో డబ్బు తీసుకుని పారిపోయావే — నేను కావాల్సుంటే

అలా చేస్తావా మామయ్యా ! నాకు వూహా తెలిసి నప్పటి నుంచి 'శేఖర్ దొంగ, జూదరి, త్రాగుబోతు' అంటుంటే విన్న నాకు నీ మీద ఎలా సానుభూతి కలుగుతుందను కున్నావు ? ఇప్పుడైనా వుంటావనే నమ్మకం ఏముందీ ?? మంగళసూత్రం తప్ప నీ గుర్తుగా నాకేం లేకుండా చేసి, ఇప్పుడు నన్నొక మనిషిగా నాలుగు డబ్బులు సంపాదించు కునే అర్హత కలిగినదాన్నిగా జూచి, మొగుడు పేరుతో జీవి తాంతం వేధించడాని కొచ్చావు. నీవు భర్తవనే వుద్దేశం నాకు లేదు. అమ్మకు తమ్ముడిగా మాత్రం గౌరవ మిస్తాను. విడాకుల సంగతి నాన్న యిష్టపడి ఇప్పిస్తున్నాడు. దయ వుంచి నా జోలికి రాకు మామయ్యా" అంటూ నమస్క రించింది రాధ.

ఆమె సజల నేత్రాలు అతణ్ని కరిగించలేక పోగా, పట్టుదల అధికమైంది.

"నీ వెట్లా సుఖపడతావో నేనూ చూస్తాను!" అధి కార పూర్వకమైన సవాల్ ధ్వనించింది అతడి గొంతున.

మరి మాట్లాడే ఆస్కారం లేక అక్కడి నుంచి నిష్క మించింది రాధ.

శ్రీధర్ పక్క వూరికి వెళ్ళాడు. రాఘవయ్య రాత్రి కొస్తానని చెప్పి పొలం మీది కెళ్ళాడు.

రాధ గోడ్డ చావిడి దగ్గరున్న వెదురు తడికల గదిలో ఏదో చదువుకుంటూ కూర్చుంది. అప్పటికి చిరుచీకట్లు అలముకుంటున్నాయి. చప్పుడు కాగా రాధ తిరిగి చూచింది. వికారంగా నవ్వుతూ, ముందుకు అడుగు వేస్తున్న శేఖర్ని చూచి, నిశ్చేష్టురాలైంది రాధ.

"నీ కేమైంది మావయ్యా! ఆ చూపేమిటి ? పిచ్చి గాని పట్టలేదు కదా ?" కంపిత స్వరంతో అడిగింది.

ఇంతలో, మాధవ్ దేనికో అటువైపు వచ్చాడు.

"మాధవ్! మావయ్యా ఏదోగా వున్నాడు. అమ్మను పిలువ్!" అంది రాధ.

"నేనిక్కడేవున్నా... వాడికేం కాలే... ఏం ఫరవా లేదు... పరాయివాడేం కాదు మొగుడే. వేధవ్వేషాలు కట్టిపెట్టి, వాడు చెప్పినట్టు విను!"కరుకుగా అంది జానకమ్మ.

"నువ్వేనా! ఇలా అనడం ?"విభ్రాంతిగా అంది రాధ.

"నెమ్మదిగా నే చెప్పినట్టు విను... పెడసరం చేస్తే మొరటుతనంగా ప్రవర్తించాల్సొస్తుంది... రా... దగ్గరకు, వూ!" హుంకరించాడు శేఖర్. బెదరిన లేడైంది రాధ. కసాయివాణ్ని చూచిన మేకపిల్లలా వణకసాగింది. కీచకుడు, రావణాసురుడు లాంటి వాళ్ళు గుర్తుకొచ్చారు. తనకు ఎదురు తిరిగి కలబడే శక్తిలేదు. అందుకే ప్రాధేయపడాలనుకుంది.

"మావయ్యా! నన్నేం చెయ్యకు మావయ్యా! నా జీవితం పాడుచెయ్యకు. మీ అక్క కూతురుగా ప్రార్ధిస్తు

న్నాను... నన్ను నాశనం చెయ్యకు..." రెండు చేతుల్లో పాదాలు పట్టుకుంది రాధ.

శేఖర్ మొరటు పాదాలు రాధ కన్నీళ్ళకు తడిశాయి. కరుణకు బదులుగా, కాఠిన్యం చోటు చేసుకుందతడిలో. ఆమె భుజాలు పట్టుకుని విసురుగా పైకి లేవ నెత్తాడు— జ్యోతు ల్లాంటి కళ్ళతో క్రూరంగా చూస్తూ.

"నాకు కాకుండాపోయే నువ్వు, జీవితమంతా కుళ్ళి కుళ్ళి ఏడ్చేట్టు చేస్తాను. నీ బ్రతుక్కి మచ్చ ఏర్పరచి గాని వదలను... శేఖర్ అంటే నీ కర్థం కాలేదు... ఇప్పుడు చూడు" పశుత్వంగా కౌగలించుకున్నాడు రాధను.

ఎముకలు విరిగేలా బాధపెట్టగా, జుగుప్సా, అసహ్యం, భయం, ఆవేదనలు ముసురుకోగా, ఆడు త్రాచులా బుసకొట్ట సాగింది రాధ. బాధతో విలవిల్లాడిపోతూ, అసహనంగా కదలిపోతోంది. పెనుగాలి తాకిడికి తట్టుకోలేని లేత రెమ్మలా, కొట్టుకులాడడం ప్రారంభించింది రాధ.

చేతులు వదలిన శేఖర్, ఆమె ముఖం చేతిలోకి తీసుకుని గట్టిగా బుగ్గమీద కొరికాడు.

లజ్జతో మందారాలు పూయాల్సిన కపోలాలు రక్త మయమయ్యాయి. నిప్పులు పెట్టి కాల్చినంత బాధ పుట్టగా 'కెవ్వున' కేకేసింది రాధ.

హృదయ విదారకమైన ఆ ఆర్తనాదానికి ఎక్కడి

నుంచో రెండు ఆకారాలు, తలుపు తలుపు తోసుకుని లోపలికొచ్చిపడ్డాయి.

రాధను గబుక్కున వదిలి, బోనులో నుంచి బయట పడ్డానికి ముందుకు లంఘించినట్టు, పారిపోవడానికి ముందుకు దూకాడు శేఖర్.

అతడు విసురుగా వదిలిన రాధ తూలి అక్కడున్న వడ్ల గాదె మీద పడి స్పృహ కోల్పోయింది.

తప్పించుకోబోయే శేఖర్ మీదికి వచ్చిన వారిలో పెద్ద శాస్త్రి కలబడ్డాడు; చిన్న శాస్త్రి గొడ్లపలుపు చిన్నగా చేతికి బిగించి గుంజకు కట్టాడు. బెల్టు తీసుకుని కసితీరా బాది వదిలాడు ఆ వ్యక్తి.

దీపం తీసుకొచ్చిన జానకమ్మ అక్కడున్న వాళ్ళను చూచి నిర్ఘాంతపోయింది.

ఒకరు మాధవ్-రెండవవాడు శ్రీధర్!

అసహ్యంగా తల్లి వైపు చూచాడు శ్రీధర్.

సిగ్గుతో కుంచించుకుపోయింది జానకమ్మ.

గుడ్డిదీపపు వెలుతుర్లో... తెలివితప్పి పడున్న చెల్లెల్ని జూచి, చన్నీళ్ళు చల్లాడు.

"అన్నయ్యా!" అంటూ జావురుమంది రాధ, లేచి.

శ్రీధర్ కళ్ళు చెరువులయ్యాయి.

కాస్త ఓపిక రాగానే ఏదో జ్ఞప్తికొచ్చిన దానిలా,

నూతి దగ్గరికి పరుగు తీసింది రాధ. ఒక్క-క్షణమైతే లోపల పడిపోయేదే...గబుక్కున పట్టుకున్నాడు శ్రీధర్.

"నన్ను చావనీయన్నయ్యా! నన్ను పరువుగా బ్రతక నివ్వడు ఆ దరిద్రుడు ... కళంకినిని చేసి ... లోకంచేత చిత్రవధ చేయిస్తాడు...నేను బ్రతకూడదు..." శ్రీధర్ చేతుల్లో గింజుకుంది రాధ.

"నీకు—నాన్న, నేనూ వున్నామమ్మా! ఇలాంటి పరిస్థితి మరోసారి రానీయం. సాహసిస్తే వాణ్ని చంపేసయినా జైలుకు పోతానుగాని నీమీద చెయ్యి వెయ్యనివ్వను. నీ వింకెప్పుడూ ఆత్మహత్యా ప్రయత్నం చెయ్యనని ప్రమాణం చెయ్యి. లేకపోతే నన్నూ నీతో చావనీ!" అన్నాడు వుద్రేకంగా శ్రీధర్.

"వద్దన్నయ్యా! నీవు కలకాలం జీవించాలి...నేను ఏ పరిస్థితిలోనూ చావుకు ప్రయత్నించను" శ్రీధర్ చేతిలో చెయ్యి వేసింది. చెల్లెలి చెయ్యి పట్టుకుని నడిపించుకు వెళ్ళాడు లోనికి.

ఆ సంఘటన విడాకులు తీసుకోడానికి మరింత దోహద కారయింది.

'డైవర్సు' యివ్వబడ్డ కొన్ని రోజులవరకూ, శేఖర్ ఆ ప్రాంతాల్లోనే వుండేవాడు. చాటుగా మాటుగా జానకమ్మ తమ్ముడికి డబ్బు సర్దుతూ వచ్చేది. చూచీ చూడనట్లుండే వాడు రాఘవయ్య.

'కంకారం'లో పొలాలు కౌలుకిచ్చి నెల్లూరుకు చేరాడు రాఘవయ్య. కొంత మాగాణి అమ్మి నెల్లూరులో చిన్న యిల్లు కొన్నాడు. రాధకు స్కూలు టీచరుగా ఉద్యోగం నెల్లూరులోనే రావడంతో నెల్లూరులోనే సంసారం పెట్టక తప్పలేదు. పంట గింజలతో, ఇంటిబాడుగ లేనందువల్ల, రాధ జీతం తోడుగా, తను అంగట్లో గుమాస్తాగా తెచ్చుకున్న జీతంతో ఓ విధంగా సంసారం నెట్టుకు రాసాగాడు.

శ్రీధర్ కాలేజీ చదువుకు మాగాణి అడమానంపెట్టి అప్పు తెచ్చాడు. పాపంలా వడ్డీ పెరిగి పోతూనే వుంది.

కొడుకు నౌకరీ చేస్తే, కొంతకొంత చెల్లుబడుతుంటే, చేను అమ్మకుండా సరిపోతుందని రాఘవయ్య వుద్దేశమైతే... అప్పులవాళ్ళు నీచంగా అనే మాటలకన్నా, అమ్మి అప్పు తీర్చడం వుచితమంటాడు శ్రీధర్.

తన ఖర్చుకు తగినంత డబ్బు అక్కడ ముట్టజెప్పలేక పోయేసరికి, శేఖర్ మళ్ళీ దేశం మీదికి పోయాడు. దీనికి తండ్రీ కూతుళ్ళే కారకులని మండిపడి పోతుంటుంది జానకమ్మ.

తన మాట ఖాతరు చెయ్యలేదనే హేతువొకటీ, తమ్ముడి పతకమొకటీ ఆమెను విచక్షణా జ్ఞానంలేని గయ్యాళిగా చేశాయి.

# 20

సౌదను అత్తవారింట్లో వదలి వచ్చిన జానకమ్మ ఒకసారి వియ్యాలవారి ఐశ్వర్యాన్ని మెచ్చుకుంటూ మురిసి పోతుంది. మరోసారి...సారెలు గొప్పగా తేలేదని మర్యాదలు ఘనంగా చెయ్యలేదని వాళ్ళు దెప్పారని, చెప్పుకుంటూ విచారంతో క్రుంగిపోతుంది.

శ్రీధర్‌కు కోయంబత్తూరు పేపరు మిల్లులో వుద్యోగం వచ్చింది. ఆర్డరందుకుని ప్రయాణమైనాడు. చెల్లెలు, అన్న కొద్ది రోజుల వ్యవధిలో ఇంట్లో నుంచి వెళ్ళడంతో ఎంతో వెలితిగా వుండేది ఆక్కడున్న వారికి. అక్కడికి వెళ్ళిన తరువాత శ్రీధర్ రాధ పేర లెటర్ వ్రాశాడు.

ప్రియమైన రాధా,

ఇక్కడి విశేషాలు కొద్ది రోజుల తరువాత మ రాస్తాను. ప్రస్తుతం నాకు నౌకరి ఎందువల్ల దొరికిందో వివరిస్తాను. మా మేనేజరు గారికి ఐదుగురు ఆడపిల్లలు. పెద్ద అమ్మాయి లిద్దరికి మేరేజ్ అయింది. అవి కూడా లవ్ మేరేజ్‌లే. అతడు లేడీస్‌కు పూర్తి స్వాతంత్ర్యం యివ్వాలనే మనస్తత్వం గల వ్యక్తి. మనవైపునుంచి ఉద్యోగరీత్యా వెళ్ళినవారు గనక — తన పిల్లలను కూడా మనవైపే యివ్వాలన్న వుద్దేశమట.

ఆ విషయం తెలుసుకుని నా ఫ్రెండ్ దాన్ని సభ్య పెట్టి వాళ్ళవాళ్ళకు తెలిసినవాడని చెప్పి నన్ను ఉద్యోగానికి వేయించాడు.

ఇప్పుడు పెళ్ళికున్న అమ్మాయిల్లో పెద్దమ్మాయి జ్యోత్స్న యమ్. ఏ. చదువుతోంది. చిన్నమ్మాయి తన కిష్టమని 'నర్స్' ట్రైనింగ్ చదువుతోంది. వచ్చే సంవత్సరానికి ఇద్దరికీ చదువులు పూర్తవుతాయి గనక ఓ ఏడాది పరిచయంతో నే నెవర్ని చేసుకోవాలని వుంటే వారిని చేసుకోవచ్చు. నేను చేరి కొద్ది దినాలే గనక, అమ్మాయిల్ని గురించి అంతగా తెలీదు. ఇద్దరి కిద్దరూ అతి 'ఫాషన్'గా, చాలా 'సోషల్' గా వుంటారు. నాకెందుకో వాళ్ళ వస్త్రధారణ, చొరవ, వెగటు కలుగుతోంది.

కొందరు స్వార్థంతోనే సహాయం చేస్తారు. నిస్వార్థపరులు అరుదేమో! అమ్మకు నాన్నకు నమస్కారాలు. మన మాధవ్‌ను మరీ మరీ అడిగినట్టు చెప్పు. సౌద దగ్గర్నుంచి వుత్తరాలొస్తున్నాయా? నివేదకు ఆశీర్వచనాలు. బాగా చదువుకోమని చెప్పు.

మీ అన్నయ్య

శ్రీధర్.

* * *

కాలేజీ నుంచి వచ్చిన మాధవ్ స్నానం చేసి, బాత్ రూమ్‌లో నుంచి వచ్చి పెరట్లో నిలుచుని వళ్ళు తుడుచుకుంటూ అంబరానికేసి చూపు సారించాడు. అక్కడి దృశ్యం కనులు త్రిప్పుకోనివ్వలేదు. తన్మయంగా తిలకిస్తూ వుండిపోయాడు.

పశ్చిమాద్రిని భానుడస్తమించబోతున్న సంధ్యా సమయమది. ఆకాశాన, ఎండమావుల్లా, ఇసుక తిన్నెల్లా, మేఘాలు కనిపిస్తున్నాయి...కొంతమేర ఇంకొక ఫ్రేములో, పెద్ద సరస్సు, చిన్న చిన్న ముళ్ళకంపల్లాంటి మట్టిరంగు మబ్బులు, మధ్య మధ్యన ఒంట్రమట్టి మేటవెట్టినట్టున్న మేఘాలు. కొంతసేపటికి సూర్యకిరణాలు ఆ కొలనుపై ప్రసరించాయి. 'హోలీ' పండగనాడు చల్లుకున్న రంగు రంగుల నీళ్ళు అతి పల్చగా చల్లినట్లున్నాయి. రంగు రంగుల మబ్బులు మెరిసిపోసాగాయి. ఇంతలో సూర్యుణ్ని కారుమేఘ మొకటి కప్పివేసింది. అంతలోనే ఓ నీటిపాయలాంటి తెల్లని పెద్ద మేఘ శకలం ఓ నీటిపాయలా రూపు దిద్దుకుని అందాల రంగుల సరస్సును ముంచి వేసింది.

అప్పటివరకూ ఆ కమనీయ దృశ్యంలో లీనమైన మాధవ్ మనసు...మయూరిలా నర్తించింది.

కలచెదిరినట్లయి తల త్రిప్పి చూచాడు మాధవ్. అతని తల్లి అక్కడ నిల్చొని వుంది. ఏదో మాట్లాడాలని వచ్చి, తను పరాగ్గా వున్నందువల్ల పలకరించలేక పోయిందని గ్రహించిన మాధవ్—

"ఏమ్మా! ఏదైనా చెప్పాలా?" అన్నాడు యదార్థ స్థితికొచ్చి.

"నీవేదో యోచాలాకంగా వుంటే, పలకరించలేక వుండి పోయానురా!" అంది సౌమ్యంగా వైదేహమ్మ.

"చెప్పమ్మా?"

"రాఘవయ్య అన్నయ్యగారి సంసారం ఒక రేవున పడబోతున్నది. సౌదకు పెళ్ళయింది. శ్రీధర్‌కు నౌకరి కుదిరింది. ఎట్నొచ్చీ నివేదకు కూడా మూడుముళ్ళు పడితే వాళ్ళ బాధ్యతలు తీరినట్లే. నౌకరి చేస్తున్నదనే గాని పాపం రాధ బ్రతుకే అన్యాయమైంది. అంతమంచి మనసున్న పిల్లను దేముడు మంచిగా చూడలేకపోయినాడు. దానిదే నాకు అప్పుడప్పుడూ బాధగా వుంటుందిరా..." అంది జాలి గొంతుకతో.

అదే సమయమనుకున్న మాధవ్ తన మనసులోని మాట బైట పెట్టదలచుకున్నాడు.

"రాధకు మంచిరోజులు రావంటావా అమ్మా?" ఆశగా తల్లి ముఖంలోకి చూచాడు.

"ఎట్లా వస్తాయిరా? భర్తపోయిన దానైనా ఆదర్శం అంటూ చేసుకునేవారు ముందుకొస్తారుగాని, మొగుడు బ్రతికుంటే, పెండ్లి చేసుకోవడానికి ఎవరూ సాహసించరు..."

"ఎందుకని? విడాకులిచ్చుకున్నారుగా?"

"తప్పెవరిదో ఎవరికి తెలుసురా! మొదటి వాణ్ని వదిలింది. రెండోవాణ్ని వదిలిపెట్టడానికి మాత్రం జంకు తుందా...అనే సందేహం కలగొచ్చుగా?"

"అన్నీ తెలిసిన వాళ్ళే ముందంజ వేస్తే?"

"వెయ్యరు ... బోలెడు కట్నాలిచ్చి మేమంటే మేమని ముందుకొచ్చే వాళ్ళుంటే, భర్త వొదిలిన దాన్ని చేసుకుంటామని ముందుకొచ్చే త్యాగధను లెవరుంటా రంటావ్? అధవా వున్నా...తెగించి చేసుకున్నా ఎప్పటి కైనా ... వాడొచ్చి గలభా చేస్తాడని ఒక భయం. తెలిసిన వాళ్ళు హేళన చేస్తారని జంకు. వాడి జీవితమంతా చిత్ర హింసతో గడపడమే అవుతుంది."

అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు వివరించింది వైదేహమ్మ. "అన్నీ సహించి, సమాజానికి ఎదురు నిలిచి ముందంజవేసే వాడుంటే?" తల్లి ముఖంలోకి నిశితంగా చూచాడు మాధవ్.

"అతడు మహోన్నతుడనే చెప్పాలిరా! దాని జన్మ ధన్యమౌతుందిరా" సంతోషంగా ఆమె కనులు వెలిగాయి.

రాధ మీద అంత వాత్సల్యమున్నపుడు కాదనదనే ధైర్యంతో "నేను రాధను పెళ్ళి చేసుకుని, ఆమె జీవితాన్ని సార్థకం చేస్తానమ్మా!" అన్నాడు.

"ఒరే...నీకేమయినా మతిపోయిందా? లేక నన్ను

వుడికించడానికా ?...పిచ్చి సన్యాసీ...” మృదువుగా మంద లించి ఎగతాళిగా తీసుకుందా మాటను.

“నాకేం మతిపోలేదమ్మా! నిజంగానే అడుగు తున్నాను. నీ అంగీకారం తీసుకుని...నాన్నతో చెప్పి...”

“మా...ధ...వా !” బిగ్గరగా కేక పెట్టింది వైదే హమ్మ.

బిత్తరపోయి చూచాడు మాధవ్. ఆమె అపర కాళి కావతారం చూచి స్తంభించిపోయాడు.

అప్పటికి ఆమె నిజ స్వరూపం తెలుసుకున్నాడు.

అభిమానంవల్ల అన్నదేగాని, తనదాకా వస్తేమాత్రం ఆమోదించనంత సంకుచితత్వం వుందన్నమాట తల్లిలో ... అయితే తన చర్యను వ్యతిరేకిస్తారని భ్రమ పడింది ... ప్రస్తుతానికి మాట మార్చి తల్లిని ప్రసన్నురాలిని చేసుకోవాలని మనసులో పథకం పన్నసాగాడు.

“అదే నీ నిర్ణయమున్నట్రా! చెప్పు...చెప్పు — అదెక్కడ ? నువ్వెక్కడా ? నీకంటె పెద్ద వయసు...అందులో పెళ్ళయింది...అవ్వ...లక్షణంగా కన్నెపిల్లతో శాస్త్రోక్తంగా పెళ్ళి చెయ్యాలని మేము కోరుకుంటుంటే! ఇది నీకు పుట్టిన దుర్బుద్ధయితే, మనసులో వుంచుకో - దానితో అనేవు. అది నిప్పువంటి మనిషి. వెనుకటి కొకసారి...”

“నీ వింకేం చెప్పక్కర్లేదమ్మా! నేను చిన్న తమాషా చేస్తే నిజమనుకుని గాబరా పడిపోయావు. ఇదో చిన్న

'ట్రయల్'. మా స్నేహితుడొకడు ఈలాంటి కేసులో తగు ల్కొన్నాడు. తల్లిదండ్రులకు చెప్పాలంటే భయపడు తున్నాడు. అందుకని నేను 'శాంపిల్' చూచుకుని నీకు చెపు తారా అన్నాను. అది నీ మీద ప్రయోగించి చూచాను..." అన్నాడు మాధవ్...తన నిరుత్సాహాన్నీ బాధనూ లోన గర ళంలా దాచుకుని పైకి తేలిగ్గా మాట్లాడుతూ.

"హా...బ్బా...అదట్రా సంగతి. హడలిపోయాననుకో! ఎంత నాటక మాడావురా..." గుండెను చేత్తో నిమురు కుంటూ దీర్ఘ నిశ్వాస వదిలింది భారం దిగిపోయినంత హాయిగా.

మాధవ్ గొంతులో మాత్రం హాలాహాలంలా నిలిచి పోయింది ఆ పరిస్థితి.

యువతరం ముందంజ వేసి, సమాజపు కట్టుబాట్లను పటాపంచలు చేయాలంటూ ఒకవైపు. కని పెంచిన తల్లి దండ్రులకు కష్టం కలిగించకూడదంటూ రొకవైపు. దేనికి ప్రాముఖ్యం ఇవ్వాలి? యువకుల్లోని ఆదర్శాలు – పెద్దవారి సహకారం లేనిదే, ఆచరణకు రావేమో!

పెద్దల్ని ఎదిరించడమా! ఆదర్శం పాటించడమా!

అలా మాధవ్ మనసు సంఘర్షణతో వేగిపోగా రాత్రి పొద్దుపోయేదాకా...నిద్రలోకి జారలేకపోయాడు.

# 21

చక్రభ్రమణంలో కొన్ని నెలలు గిర్రున తిరిగాయి. సౌద దగ్గరనుంచి ఉత్తరాలు వస్తున్నాయి రాధకు. కాని తనూహిస్తున్నంత ఆనందంగా వున్నట్టు జాబుల్లో కనిపించనందుకు నిరుత్సాహపడింది రాధ.

ఎందుకంత 'డల్'గా వుంటున్నావని ఒకసారి నెల్లూరు వచ్చినప్పుడు అడిగితే, 'అవి ఒకరికి అర్ధమయ్యేవి కావు' అంది నిర్లిప్తంగా.

చెప్పమని నిర్బంధించడం సభ్యత కాదని వూరుకుంది రాధ. తల్లి గుచ్చి గుచ్చి అడిగినా చెప్పేదికాదు సౌద.

"నాకేమమ్మా! ఇంజనీరు భార్యను. మంచి హోదా, చీరెలూ, నగలూ, బంగారు చిలకనమ్మా! చిలకను..."సౌద నోటివెంట పేలవంగా వెలువడేవి మాటలు.

అర్ధాలు వెతుక్కోవడానికి వ్యర్థ ప్రయత్నం చేసేది జానకమ్మ. అర్ధమైనా చేసేదిలేక వ్యథ చెందేది రాధ.

ఒక్కొక్క సంఘటనే చెప్పి తన ఎదలోని బాధ తీరేలా ఏడ్చేద్దామనుకునేది సౌద. కాని, అతణ్ణి బాగు పరచుకోగలనేమో! ఇప్పుడు చెప్పి అందర్ని బాధ పెట్టడ

మెందుకని విరమించుకొంది. తెచ్చి పెట్టుకున్న సంతోషంతో వచ్చిన నాలుగు రోజులు గడిపింది.

ఒక్కొక్క సంఘటన సాదను విచలితను చేసేవి. ఆ పరిస్థితుల్ని చక్క బరుచుకోవాలంటే ఏం చెయ్యాలి? ఒక్కొక్కటీ చెప్పి నివారించుకోటం ఎలా?

అన్నీ వరసగా ఆమె మెదడులో రాట్నంలా గిరగిర తిరగసాగాయి.

సాద కాపరానికి వెళ్ళిన కొత్తల్లో యిరుగు పొరుగు అమ్మలక్కలు, పరిచయస్థులు వచ్చి వీరి హోదాను దృష్టిలో పెట్టుకుని, స్టీలు పాత్రలు ఏమేమి తెచ్చిందని ఒకరు, ఫర్నిచర్ - పరుపులు, నైలాన్ అల్లిన మంచాలు తెచ్చిందా అని ఒకరూ అడిగేవారు.

"మా ముఖానికి అంత మాత్రమా! అందగత్తె అందగత్తెని మురుస్తూ చేసుకున్నాడు ఒక అచ్చటా, ఒక ముచ్చటా? పండక్కొళ్ళిన అల్లుడికి ముష్టి వంద రూపాయల బట్టలు పెట్టేరు. మేం చెప్పిన మనువు చేసుకుని వుంటే, ఎంత మర్యాద జరిగేది...ఏం కథా! కారు యిస్తామన్న వాళ్ళ సంబంధం చేసుకోమంటే, పిల్ల నలుపన్నాడు. అందం కొరుక్కుతింటామా?" అని సాద ముఖాన్నే అత్తగారు అంటుంటే సాద ముఖం అవమానంతో, బాధతో ఎర్ర మందార మయ్యేది.

ఒక్కోసారి, అడిగేవాళ్ళనీ, చెప్పే అత్తగార్ని

దులుపేద్దామనుకునేది సౌధ. కాని తన వాళ్ళ పరిస్థితి...తన అసహాయత గుర్తుకు రాగానే ఇక్కిన పేనులా అయ్యేది.

తన వేదనంతా అశ్రుప్రవాహంలో సమ్మరించి, అన్ని అవహేళనలనూ చెప్పి, తనివి తీరా ఏడ్చి భారం తీర్చుకుందా మనుకునేది.

ముఖం కొంచెం బాధగా వుంటే, విసుక్కునేవాడు నిరంజనరావు.

“నీకు పట్టిన అదృష్టానికి, ఎంతో ఆనందంగా వుండడం పోయి ఎప్పుడూ ఏడుపు ముఖం నువ్వూనూ...ఛీ ఛీ” అనేవాడు.

మొదట కొన్ని రోజులు సినిమాలకని షికార్లకని తిప్పేవాడు. సినిమాకు వచ్చినప్పటినుంచీ సౌధ నెవరు చూస్తున్నారోనని నాలుగు ప్రక్కల చూడ్డం, సౌధ ఎవరి వైపయినా చూస్తున్నదేమోనని ఆమె వైపు పరికించి చూడ్డంతో సరిపోయేది.

అది తన మీద నమ్మకం లేకనో, లేక అతని మానసిక బలహీనతో తెలుసుకోలేక మథనపడేది సౌధ.

అతణ్ని చికాకునుంచి విముక్తుణ్ని చేద్దామని చక్కగా ముస్తాబయ్యేది.

“ఇది వేశ్యాగృహం కాదు. ఎప్పుడూ ‘టాయిలెట్’ చెరక్కుండా వుండడానికి” అనేవాడు.

అతడికి అలంకరణ గిట్టదని మామూలుగా వుంటే

"అందం లేని మొగవాడికి, ఈ మాత్రం అలంకరణ దాని నిర్లక్ష్యం కదూ ! అందాన్ని చూచుకుని నీకు గర్వం" అనే వాడు.

"మీకెలావుంటే యిష్టమో కరెక్టుగా చెప్పకూడదూ? యిలా సూటి పోటి మాటల్తో చిత్రవధ చెయ్యకపోతే !" అన్నది సౌద ఒకనాడు.

"మగవాడి అభిరుచి గమనించి నడచుకోవాల్సింది ఆడది... నే చెప్పాలట... అడగడానికైనా సిగ్గులేకపోతేసరి" అన్నాడు చీత్కారంగా.

అనవసరంగా ఎందుకంతంత మాటలంటున్నాడో, అనిపించుకోకుండా వుండాలంటే ఎలా ప్రవర్తించాలో, ఎంత తల బాదుకున్నా అర్థమయ్యేది కాదు సౌదకు.

క్షణక్షణం తన సౌందర్యాన్ని ప్రశంసిస్తూ అలరిస్తాడని ఆశపడింది. అవన్నీ అడియాసలు కాగా... ఆ వేదనే మిగులుతోంది.

సౌందర్యాన్ని ఆరాధించిన ప్రేమోపాసకుల చరిత్రలు తన కళ్ళ ముందు మెదిలినట్లయి... అలాంటి వుత్తముడే తనను వరిస్తాడని, తన సంసారమొక స్వర్గధామమవుతుందని కలలుకన్నది.

ఆ కలలన్నీ కల్లలు కాగా, కలతలే మిగిలాయి.

* * *

ఒకనాడు అర్ధరాత్రికి వచ్చేడు తూలిపోతూ. ఏదైనా జబ్బుచేసిందని భయపడింది మొదట ఆత్రుతగా దగ్గరకెళ్ళగానే గుప్పుమని బ్రాందీ వాసనకొట్టింది. దానితో సౌద తల తిరిగిపోయింది... కాళ్ళు తేలిపోయాయి... తను ఎలాంటి విషవలయంలో చిక్కుకుందో పూర్తిగా అర్థం చేసుకుంది. కాని చేయవలసిందేమిటో తోచేది కాదు.

"మీరెప్పుడూ తాగుతారా?" బెక్కుతూనే అడిగింది సౌద.

"ఎప్పుడూ... అంటే... అన్నం నీళ్ళు లేకుండ్రానా! అదేం కాదు...నీ...క...ణ్ణీ... చె...ప్పె...స్తా...ను...న్నే... గూడా... ఆడతాను... తెలుసుకో" నిషాలో అన్నాడు.

ఒక్కొక్కటే వింటుంటే సౌద నవనాడులూ క్రుంగిపోయాయి.

తన చాకచక్యంతో అతణ్ని మంచి దారిన పెట్టాలని, ఎంత శ్రమకైనా ఓర్చుకోవాలని నిర్ణయించుకుంది.

నిరంజనరావు ఫ్రెండ్స్ కొందరు పెళ్ళప్పుడు రావడానికి వీలుకానివాళ్ళు వచ్చారు. ఏవేవో ప్రజంటేషన్స్ తెచ్చి మీ శ్రీమతిని పిలవమన్నారు. అందర్లోకొస్తున్నపుడు కాస్త మంచి చీర కట్టుకోవాలనుకుని... జరీపువ్వుల బ్లూ కలర్ పట్టుచీరె కట్టుకుని... అదే సెట్టు నగలు పెట్టుకుంది.

తెల్లని శరీరం మీాద ఆ చీర ఎంతో అందంగా వుంది. కర్లింగ్ హెయిర్ కాబట్టి, తలంటి పోసుకున్న జుట్టు, చెవులను కప్పి వేసింది.

కాఫీ ట్రే తెచ్చి టేబుల్ మీాద పెట్టిన సమయంలో ఆమె శారుజడ ముందుకు పడింది అందంగా. అక్కడి సభ్యులు ఆమెను జూచి కళ్ళు త్రిప్పలేకపోయారు.

చిన్నగా రెప్పలు పైకెత్తి కలియజూచింది సౌద భర్తను. శరీరం మీాద చీమలు పారాడినంత అసహనంగా కదులుతూ, తనవైపు కోరగా చూస్తున్నాడు. అతడి అయిష్టత గమనించి ఇంట్లోకి వెళ్ళడానికి వెనక్కు మళ్ళింది.

"సిస్టర్! మీారూ కూర్చోండి" అన్నారెవరో.

పిలుపు వచ్చిన వైపు కనుకొలకుల చివర్లనుంచి చూచింది. అతడు జయప్రద భర్త- ఒక్కక్షణం తటపటాయించి లోనికి నడిచింది సౌద.

తలా ఒక ప్రక్క దెప్పిపొడవసాగారు నిరంజన రావును.

"ఏరా! గంటల తరబడి నావైఫ్‌తో హస్కు వేస్తావే? నీ భార్యకేమో గోషా వేస్తావా! పిలవరా ఫూల్"

"పరిచయం చెయ్యవోయ్. దిష్టి తగలదుగాని."

"అంతేరా! తనదాకా వస్తేగాని తెలీదన్నట్లు"

తలా ఒక మాటంటుంటే, గత్యంతరం లేక రూములో కొచ్చి రమ్మని పిలిచాడు నిరంజనరావు.

రానని తల వూపింది.

"చదువుకున్న దానివి. బిడియమైతే ఎలా!" అన్నాడు.

భయం భయంగా అడుగులు వేసుకుంటూ హాల్లో కొచ్చి నిలిచింది. అజంతా శిల్పాన్ని గుర్తుకు తెచ్చేలా వుందామె నిలబడిన తీరు.

ఏం చదివావని, ఏ గ్రూపని, 'హాబీ'లేమిటని తలా ఓ ప్రశ్న వేశారు. నెమ్మదిగా స్పష్టంగా సమాధానా లిచ్చింది.

ముళ్ళ మీద నిలుచున్నట్లు గడిపి...చిక్కంలో పిట్టలా దూసుకుపోయింది కొంతసేపటికి.

అక్కడి మాటలు స్పష్టంగా వినబడసాగాయి సౌదకు.

"మిస్టర్ నిరంజన్, గెలిచావురా! వండర్ఫుల్ లేడీ! గుడ్ లక్!" ఒకరి గొంతు.

"నిజంగా ఇంత అపురూప లావణ్యవతి అయిన నారీ తిలకం అబ్బుతుందనుకోలేదు" మరొకరి కంఠం.

"ఆనాడేమన్నార్రా మీరు? నల్లన్న ఏ ఆడపిల్ల వొప్పుకోదన్లేదూ? అందమైన అమ్మాయిని చేసుకు తీరుతా నంటే, మీసం తీసేస్తానని ఒకరు, చెవికోసుకుంటానని ఒకరు, తలా ఒకటని హేళన చేయలేదట్రా."

అయితే ఓ నగ్న సత్యం బయట పడింది.

అందమైన అమ్మాయి అతణ్ని ఒప్పుకోనందుకు పంతంగా సాధించుకున్నాడన్నమాట! అంతేగాని ఆదర్శంగా

ఓ బీదపిల్లను చేసుకోడం గాని, అందాన్ని ఆరాధించడం గాని కాదు. నిస్పృహ ఆవరించింది... ఛీ...ఛీ ఎంత స్వలాభ పరుడు! అణువణువూ పరాభవంతో, వ్యథతో దహించి వేసింది. దుఃఖం పెల్లుబికింది సాధకు. ఎంతపాపం చేసిందితను? బాధతో మెలికలు తిరిగి పోతున్న సాధ చెంప చెళ్ళుమంది.

ఆ హఠాత్పరిణామానికి అదిరిపోయింది సాధ. బాధను కూడా మరిచి ప్రాన్పడిపోయింది. కన్నీళ్ళు కూడా కద లాడ లేదు.

జ్యోతుల్లా నిప్పులు చిమ్మే కళ్ళతో తన ఎదటున్న భర్తవైపు చూడలేక రెండు చేతుల్తో కళ్ళు గట్టిగా మూసు కుంది.

"నేను లావణ్యవతినని ప్రదర్శించుకోడానికి పిలవంగానే వచ్చి ఫోజులు పెడుతూ నిలుచుని, బారెడు జడని ముందుకు విసురుకుని, లజ్జా బిడియం లేకుండా, అదీ చాలదన్నట్లు వాత్సాఖ్యానికి దిగావు. నీ అవధుల్లో నీ అంతస్తులో నీవుంటే బాగుంటుంది" అన్నాడు తీవ్రంగా నిరంజనరావు.

"మీరేగా రమ్మన్నారు! అవధులేం అతిక్రమించానని! అంతస్తు అని ప్రతిసారి అనడం ఎందుకూ? ముందే తెలుసుగా మేం పేదవారమనీ. అయినా యిప్పుడు మీ భార్యగా భాగ్యవంతురాల్ని కాదా! ఎందుకు నన్ను పరాయిదాన్నిగా భావిస్తారు!" ఆవేదన, ప్రాధేయత మేళవించాయి ఆమె కంఠాన.

"ఎదురు చెప్పేదానివయ్యావా ?" అని ముందుకు రాబోయాడు.

ఇంతలో ఎవరో పిలవగా... అక్కడి నుంచి వెళ్ళాడు నిరంజనరావు.

తను కావాలని చేసుకున్నందుకు, స్వయంకృతాప రాధం అనుభవించాలి. కళ్ళు కాలువలయ్యాయి. గుండెలవి సేలా ఏడ్చేప్పి ప్రక్కమీద వాలిపోయింది సౌద.

ఉద్యోగం చేసే వూళ్ళో కాపురం పెట్టాడు నిరంజన రావు. పుట్టింటి నుంచి కొత్త సంసారానికి కావలసిన పాత్ర సామాను ఫర్నిచర్ తెచ్చుకో మన్నారు అత్తగారింటివారు.

"ఇవ్వగలిగినవేవో నేనొచ్చేటప్పుడే ఇచ్చారు. ఇహ తేవలసినవి లేవు... వాళ్ళిస్తారన్న నమ్మకం లేదు" అని తెగేసి చెప్పింది సౌద.

విసుక్కుంటూ కొన్ని సామాన్లిచ్చింది అత్తగారు.

క్రొత్త కాపరమనే సరదా లేకుండా పోయింది సౌదా మినికి... భర్త చేసే అకృత్యాలు ఆమెకు జుగుప్స కలి గించేవి.

కంట్రాక్టర్ల దగ్గర లంచం తీసుకుని కంట్రాక్టు చేసిన

పని బాగున్నట్టు సర్టిఫికేట్లు ఇవ్వటం లాంటివి నచ్చేవికావు. ఆ అరాచకాన్ని అరికట్టాలని నచ్చచెప్పబోయేది.

"గవర్నమెంటు సొమ్ము తింటూ దానికి అన్యాయం చెయ్యడమెందుకండీ?... పని బాగుంటేనే చూచి యివ్వొచ్చుకదా ?" అని తప్పించాలని చూచేది.

"పది డబ్బులు వచ్చేటప్పుడు తీసుకొనకపోతే ఎలా ? రేపు పిల్లలు పుడితే కావద్దూ! డబ్బు చేదనేవాడు లోకంలో పనికిరాడు. డబ్బుతో పొందని సుఖాలేం వున్నాయి? ఆ డబ్బుకు ప్రలోభపడేగా నువ్వు చేసుకున్నదీనూ? నా అందానికన్నా ధనమే ముఖ్యమని నువ్వే రుజువు చేశావ్ ... డబ్బుకు లోకం దాసోహం ... హ్హా ... హ్హా..." విరగబడి నవ్వేడు.

అతడి నవ్వుకు అసహ్యం, ఆవేదన కలిగాయి సాదకు.

* * *

ఓసారి సాదను తనతో క్యాంపుకు తీసికెళ్ళాడు నిరంజనరావు. అక్కడ అందమైన తోటలు, కొండలు, సరస్సులు వున్నాయని, రమ్మని నిర్బంధించాడు.

ఎక్కడికి కెళ్ళినా ఏదో నెపంమీద నిందిస్తుంటాడు గనుక, వెళ్లాలని సరదా వున్నా రానంది సాద.

"మేరేజ్ కాకముందు సుందర దృశ్యాలు చూస్తుంటే, సౌందర్యవతైన భార్య ప్రక్కనుంటే బాగుండుననుకునే

వాణ్ణి...నాకోసం గాకపోతే నీ లావణ్యం ఏం చేసుకో డానికి ?" అన్నాడు నిష్ఠూరంగా.

అది షుమారైన పల్లెటూరు. అక్కడికి ఫలహారాలు చేయించుకుని తీసికెళ్ళాడు. బ్రాందీ బాటిల్సు తెచ్చుకున్నాడు.

ఆనాడు చీకటిపడి చినుకు లొస్తున్నందున - ఎక్కడికీ తీసికెళ్ళలేదు రాధను.

ఎవరెవరో వచ్చి మాట్లాడి పోతున్నారు. పాలు, పండ్లు పంపేరు. ఎవరింట్లోనో వంట చేయించి క్యారియర్ పంపేరు.

రాధ స్నానం చేసి తెల్లని పెద్ద రోజా పూల నైలెక్సు చీర కట్టుకుని మల్లెలు జడలో జారుగా తురుముకుంది.

అక్కడికో ముప్పై ఏళ్ళ వాడొకడొచ్చి కన్నార్పకుండా విచిత్రంగా చూడసాగాడు.

అతడి గమ్మత్తయిన వాలకం చూచి పలకరించింది.

"ఎవరు నువ్వు ? ఏమిటలా చూస్తున్నావ్ ?" అన్నది చిన్నగా నవ్వుతూ.

"అయ్యగారేరి ? మిమ్మల్ని వూరికాణ్ణుంచి తోడు కొచ్చింద్రా !" వెకిలిగా నవ్వుతూ అడిగాడు.

"వూర్నుంచంటే..." అన్నది ప్రశ్నార్థకంగా.

"ఈడనే మాట్లాడమనే వోర్లే నా పని తప్పిపోనాది. ఇహిహీ..." అన్నాడు వాడు.

సౌదకు అయోమయంగా తోచాయా మాటలు.

ఇంతలో బాత్ రూములో నుంచి నిరంజనరావు వచ్చేడు.

వాడు చేతులు నలువుకుంటూ నిలుచున్నాడు.

"నీవు భోజనానికన్నీ సర్దు టేబుల్ మీద" అని ఆదేశించి వరండాలోకి నడిచాడు.

సౌదకు అనుమానం తోచి, వెళ్ళినట్లు నటించి, కిటికీ చెక్కమాటున నిలబడి వినసాగింది.

"బాబయ్యా! అన్నీ వుండాయిగా. ఈసారి సరుకంతా బస్తీదే తెచ్చింగ్రదే!...ఏడకెళ్ళి ఎతక్కరానాని ఇచారం బట్టుకుంది...మీకేమో మంచి సరుకు కావాలాయా! పొద్దుగూకి ఏడకెల్లాల్నో అనుకుండా. సారాయయితే... పట్టిచ్చి కొత్తాగాని...ఆడపిల్ల దొరకదే ... అని మకా ... యిదై పోతుండా!"

"చిన్నగా మాట్లాడ్రా! సారా వద్దు...పిల్లవద్దు ... అన్నీవున్నాయి. ... అహాహో...హో ... ఆమె ... అమ్మగార్రా...పెళ్ళయింది తెలీదా? నువ్వు లేవుగా యిటీవల" అన్నాడు నిరంజనరావు.

అప్పటికి సర్వం అర్థమైపోయింది ... పెద్ద పెద్దవాళ్ళకుండవలసినవన్నీ వున్నాయన్నమాట...ఛీ ... ఛీ ... ఏం

మనిషి ! ఏవగింపు కలిగిందాతనిపైన. మనసంతా వికలమై పోయింది. అసహ్యం గూడు కట్టుకుంది ఆమెలో.

భోజనాల దగ్గరేం మాట్లాడలేకపోయింది సౌద.

ఆమె మోమున శ్రావణ మేఘాలు చోటు చేసుకున్నాయి. కళ్ళు వర్షించేలా వున్నాయి ... ఎలాగో నిగ్రహంగా భోంచెయ్యసాగింది.

"సరదాగా గడుపుదామని వెంటబెట్టుకొస్తే ... చిరాగ్గా ముఖం చిట్లించుకుని వుండడానికా ? అలంకరణంతా వూళ్ళోవాళ్ళు చూచి మెచ్చుకోడానికా ?...ఇంతకంటే ఏ 'మోడల్' అమ్మాయిగానో .... ఎగ్జిబిషన్‌లో 'డాన్సర్' గానో చేరితే శాపుండేట్టుంది నీకు .... ఎప్పుడో నీకా రాతే వుంది.. మీ అక్క వుందిగా... మొగుణ్ణొదిలి..."

"ఏమండీ ?" పెద్దగా అరిచింది ఆక్రోశంగా సౌద.

"ఏం ? వున్నమాటంటే వులుకెందుకూ ? దాని చెల్లెలివి గాదూ ?..."

"మీరేం చూచి ఆమె నంటున్నారు ? ఆమె నంటే కళ్ళు పోతాయి."

"అవునవును .... భర్త దగ్గరుంటే .... ఒక్కడితోనే వుండాలి .... లేకపోతే ఎందరితోనైనా తిరగచ్చు .... నిజం చెప్పు....ఆ మాధవ్‌తో ... మీ అక్కకు."

ఎగతాళిగా నవ్వేడు నిరంజనరావు.

చెవులు మూసుకుంది సౌద,

కొన్ని క్షణాలు మౌనం రాజ్యం చేసింది వారిద్దరి మధ్య.

"ఏమండీ? మిమ్మల్ని ఒకమాటడుగుతాను...నన్నేం దుకు...ఇలా చిత్రవధ చేస్తున్నారో చెప్పండి...ఇంతకంటే ఇంత విషం తెచ్చియ్యండి ... హాయిగా ఒక్కసారి చచ్చి పోతాను...క్షణ క్షణం చావలేను ..." బాధాతప్త హృద యాన్ని బయటపెట్టింది.

"నీవు...చావడమా? నా కోర్కె తీరందే! నీ లాంటి అందమైన బాబు పుట్టాలి...అప్పుడు..." అర్ధాంత రంగా మాట నిలిపాడు.

తను అనతలేమయినా ఫరవాలేదన్నమాట !..ఛీ..ఛీ... తననెంత నీచంగా చూస్తున్నాడో !

"మీరు చేస్తున్న ప్రతిపనికంటె ఆడ పిల్లల్ని తెమ్మనడ మంత నీచం మరొకటి లేదు. అమాయకపు ఆడపిల్లల్ని మీ కామానికి...ఛీ...ఛీ..."

"హ్హహ్హా !....అంతా విన్నావన్నమాట ... ఇంక దాచాల్సినవి లేవు...అవసరమైతే సరుకుల్ని నిర్భయంగా ఇంటికే తెచ్చుకోవచ్చు..." వెటకారంగా అన్నాడు.

సరుకులు అనే దగ్గర వత్తి పలకడంతో వళ్ళు మండింది సౌదకు. "చదువూ సంస్కారం వుండి పెద్ద మను షుల్లా తిరిగే మీకు ఈ బుద్ధు లేమిటీ? 'సారా' తాగడం,

బజారు ఆడవాళ్ళతో సరదా తీర్చుకోవడం ... ఛీ... ఛీ..." జుగుప్స నిండిన స్వరంతో అంది.

"మాంసం తింటున్నానని, శాకాహారం మంచిది కాదన్నట్టు, పాయసం తింటున్నానని 'సారా' మంచిది కాదన్నట్టు వుంది నీ వాదన. అనుభవించే అవకాశమున్నప్పుడు ఉపయోగించుకోవడమే పురుష లక్షణం."

అతడి విశృంఖలత్వపు మనస్తత్వానికి అసహ్యమేసి, చటుక్కున లేచి వెళ్ళి పడకమీద వాలింది సౌజ.

శరీరం కుతకుతలాడిపోయింది

చిన్నగా... వెళ్ళి బ్రాందీ సీసా తీసి రెండు పెగ్గులు వేసుకుని సౌజ మంచం మీదికి వచ్చాడు.

తన మనసేం బాగాలేదని, తన జోలికి రావద్దని అనునయంగా చెప్పి చూచింది, దావానలం మనసులో దాచుకుంటూ.

"మనసుతో నేనేం చేసుకుంటాను! శరీరం కదా నాకు కావలసింది." అంటూ మొరటుగా దగ్గరకు లాక్కుని, కబంధ హస్తాల్లో బిగించాడు.

అప్పటికే త్రాగిన నిషా ఎక్కుతూ వుంది. తను పెద్దరం చేస్తే తంతాడనుకుని, లొంగిపోయింది, బోయవాడి చేతి పిట్టలా గిలగిల్లాడిపోతూ.

# 22

ఝాన్సీ – పి. యు. సి. పాసైంది. శారదమ్మ పెండ్లి చెయ్యాలని చదువు చాలించమంది. రమణరావు బి. యస్. సి. లో చేర్చాలని పట్టుపట్టాడు. ఝాన్సీ వుద్దేశం చదవాలనే గనుక కాలేజీలో చేర్పించాడు.

రమణరావు ఫ్రెండ్ గోపాలరావును గుంటూరు ట్రాన్స్ఫర్ చెయ్యగా రమణరావు యింటి ఎదురింట్లోనే అద్దెకు చేరాడు. గోపాలరావు భార్య కామాక్షమ్మతో శారదమ్మకు దోస్తీ కుదిరింది. ఆ సన్నిహితం పురస్కరించుకొని కూతుర్ని కూడా వారింటికి పంపేది.

గోపాలరావుగారి అబ్బాయి మనోహర్ ఎం. బి. బి. యస్. పాసై యింట్లో వున్నాడు.

ఝాన్సీ వాళ్ళింటికెళ్ళినప్పుడు ఆప్యాయంగా పలకరించేవాడు.

అతడి పిలుపుకు సిగ్గుల మొగ్గయి అతి నెమ్మదిగా సమాధానమిచ్చేది ఝాన్సీ.

తన ప్రేమను పలకరింపుతో వ్యక్తం చేసేవాడు మనోహర్. తన అంగీకారాన్ని చిరుమందహాసంతో స్పష్టం చేసేది ఝాన్సీ.

ఇకపురి మూగగ్రేపిన గ్రహింపాగ పెద్దలు. మాటల ప్రస్తావనలో తన కూతుర్ని మనోహర్ కివ్వదలచి నట్టు బయట పెట్టాడు రమణారావు.

గోపాలరావు ఆశ్చర్యపోయాడు.

"నీ అంతస్తెక్కడ, నా పరిస్థితెక్కడ ? నేను దురాశా పరుణ్ణని పరీక్ష చెయ్యడానికి అడుగుతున్నావా? — వివాహ విషయాల్లో వేళాకోళం పనికి రాదురా ?" అన్నాడు గోపాలరావు కించపడిపోతూ.

"ఇదేం మామూలు విషయమట్రా, పరాచికమాడ్డానికి ?" తమాషా కాదని, నిజమేనని నొక్కి చెప్పాడు.

"వాడికి ఎం. డి. చదవాలని వుంది. నేనేం చెప్పించ గలనూ ? మెడిసన్ చెప్పించేసరికే నా పనైపోయింది."

"యం. డి. ఏమిట్రా, ఫారెన్ పంపించి చదివిస్తాను" భరోసా ఇచ్చాడు రమణరావు.

"నువ్వు మీ అమ్మాయి ఇష్టం కనుక్కో. నేను మా వాడి అభిప్రాయం అడుగుతాను. వాళ్ళిద్దరూ సమ్మతించిన మీదట తక్కిన సంగతులు మాట్లాడుకోవచ్చు" అన్నాడు గోపాలరావు- పెద్ద ఆఫీసరు, మిత్రుడూ అయిన రమణరావు వియ్యంకుడు కాబోతున్నందుకు, లక్ష్మిలాంటి అమ్మాయి కోడలౌతున్నందుకు, కొడుకు విదేశాల కెళ్ళి చదవబోతు న్నందుకు హర్షాతిరేకంతో పొంగిపోతూ.

"మనోహర్‌కు నిన్ను ఇవ్వాలనుకుంటున్నాను. నీ కిష్టం లేకపోతే నిర్బంధం లేదు. నిర్మొహమాటంగా చెప్పవచ్చు" అన్నాడు రమణరావు కూతురి వైపు సాదరణగా చూస్తూ.

"మీ యిష్టం నాన్నా. నా భవిష్యత్తు తీర్చి దిద్దేది మీరు..."

"అలా కాదమ్మా! మనస్ఫూర్తిగాయిష్టమైతేనే చెప్పు" రెట్టించాడు.

"సరే... నాన్నా!" లజ్జా భారంతో తల వంచుకుంది.

"ఏం శారదా! మనోహర్‌ని గురించి నీ అభిప్రాయం?" ఆమె కోరిన వాడికివ్వనందుకు భార్యకు బాధగానే వుంటుం దని అతడికి తెలుసు. అందుకే ముఖం వంక చూడలేక పోయాడు.

"వాడికి కానప్పుడు యింకెవరైనా ఒక్కటే" చిరు కోపం ధ్వనించిందామె స్వరాన.

అర్ధాంగీకారంగా భావించాడు రమణరావు.

కొడుకు ఆమోదం తెలిపినట్టు చెప్పాడు గోపాలరావు. మొహాన ఆనందం చిందగా.

తన వాళ్ళు అంగీకరించినందుకు తృప్తిగా వుందన్నాడు రమణరావు.

"మన స్నేహం బంధుత్వంతో మరింత బలపడు తున్నందుకు సంతోషంగా వుందిరా! మా అదృష్టం!!"

"ఇద్దరికీ!!" ముక్తకంఠంతో అనుకుంటూ ఆనందంగా నవ్వుకున్నారు స్నేహితులిద్దరూ.

"ఇంక మనోహర్ అమెరికా వెళ్ళటానికి ఏర్పాట్లను ట్రై చేస్తాను."

"మేరేజ్ ముందే చేద్దామా! తిరిగొచ్చిన తరువాత చేద్దామా?" ప్రశ్నార్థకంగా చూచాడు రమణరావు.

"నా కెలాగైనా అభ్యంతరం లేదు. అది వివాహం చేసుకునే వారికే వదిలేద్దాం!" సమాధాన మిచ్చాడు గోపాలరావు.

మధురమైన ఊహాలతో తేలిపోతూ... చల్లగాలికి మేడ వరండాలో పచార్లు చేస్తోంది ఝాన్సీ...

మెట్లమీద బూట్ల శబ్దమైతే చూచింది. మనోహర్... ఝాన్సీ గుండె వేగంగా కొట్టుకలాడసాగింది. పైకి రాబోతూ ఒక్క క్షణం నిలబడిపోయాడు మనోహర్... ఆమె అలంకరణని తిలకిస్తూ ... బ్రౌన్ కలర్ పరికిణి, గ్రీన్ కలర్ పొడవు చేతుల జాకెట్టు, అదే రంగు దుద్దులూ, జాకెట్ వేసుకుని రెండు జడలతో ఒక జడ ముందుకూ, రెండో జడ వెనక్కు పడి, పాలరాతి శిల్పంలా మెరిసిపోతూంది ఝాన్సీ. ఈ సౌందర్యమంతా తనదే అనుకుంటుంటేనే గర్వం పొంగులు వారింది మనోహర్ కి ... అక్కడే నిలబడి మనోహర్ ని రమ్మని కనులతోనే స్వాగతం పలికింది ఝాన్సీ.

"నాకై నేను తను దర్శనానికొచ్చి నప్పుడైనా కాస్త పలకరించ కూడదా ? ముత్యాలేరుకోంలే !"

చిరునవ్వు ఆమె పెదాలపై నర్తించింది.

మల్లె దొంతర్లాంటి పలువరస తళుక్కుమనగా మనోహరంగా నవ్వింది. సాయం సంధ్య అధరాలపై ప్రసరింపగా మరింత ఎరుపెక్కాయవి.

గులాబి రేకల్లా విచ్చుకున్న పెదాలపై ఓ ముద్దు కుంటేనో అనుకున్నాడు మనసులో.

"చూడండి ఝాన్సీ ! అసలు విషయాని కొద్దాం. మన పెద్దల నిర్ణయం విన్నావనుకుంటాను ... నేరుగా నీ అభిప్రాయం తెలుసుకుందామని వచ్చాను" అన్నాడు మనోహర్.

"కూర్చొని మాట్లాడండి...!" కుర్చీ చూపింది.

"మీరు కూర్చోండి...!!" తమాషాగా ఆమె స్టయిలు ననుసరించి అన్నాడు.

"మీరు బాగా ఇమిటేట్ చెయ్యగలరే" పరిహాసంలో మెచ్చుకోలు మేళవించింది.

చెక్కిట చెయ్యిజేర్చి విప్పారిన నేత్రాలతో తనని అవలోకిస్తున్న ఝాన్సీ కన్నులలోని నీలికాంతులు మనోహర్ మనసును అయస్కాంతం చేసాయి. అంత దగ్గరగా మును పెన్నడూ చూడలేదతడు. ఏదో గుర్తువచ్చినట్టుగా సంభాషణ మొదలు పెట్టాడు. "సారీ...ఏదో చెప్పబోతున్నాను కదూ ? - మీకు నన్ను మేరేజ్ చేసుకోవటం

ఇష్టమో, కాదో, చెప్పాలి. మొదట్నుంచీ మీ నాన మాధవ్‌గారి కివ్వాలనుకున్నారని విన్నాను. మీ కేమాత్రం అతన్ని చేసుకోవాలని వున్నా మీ మనసును మభ్యపెట్టుకో వద్దు. అందుకే మీ నోటివెంట మీ మనసులోని విషయాన్ని వినాలని... మీకు నన్ను చేసుకోవాలని లేకపోతే నా దౌర్భాగ్యమనుకుంటాను."

"...వుంటే ...?" కాస్త కొంటెతనం గోచరించిం దామె స్వరాన.

"నా అంత అదృష్టవంతుడు లేడనుకుంటాను. మీ ఇష్టం. నా ప్రాప్తం."

"మొత్తానికి వాక్చాతుర్యం వుంది మీలో."

"మీ ముగ్ధమోహన స్వరూపం నన్ను ఆకట్టు కొంటే..."

"కొంటే...?"

"ఆ హ్హ హ్హ హ్హ" ఇరువురి నవ్వులు కలిశాయి.

నాలుగు కళ్ళు ఒకే చూపుగా నిలిచాయి.

"చూడండి మిష్టర్ మనోహర్... మా బావను నే నెప్పుడూ పెళ్ళి చేసుకోవాలనే దృష్టితో చూళ్ళేదు..."

"అయితే నన్ను ?..." చిలిపిగా కళ్ళు చికిలించాడు.

గుండ్రని చిన్న కళ్ళయినా చురుగ్గా వున్నాయి. షేవ్ చేసిన చిరుగడ్డం, కొనదేలిన సన్నని నాసిక, నాజూకైన ముఖం అనుకుంది. నిశ్శబ్దంగా కొన్ని సెకండ్లు గడిచాయి.

మౌనభంగం చేస్తూ మనోహర్ సంభాషణ ప్రారం భించాడు.

"అమెరికా వెళ్ళేముందే మేరేజ్ చేసుకొని తమర్ని కూడా వెంట తీసికెళ్ళాలా ? లేక వచ్చిన తరువాత సరాసరి పెండ్లి చేసుకొని..."

"వచ్చిన తరువాత చేసుకోవచ్చు. నేను ఈ లోపల బి. యస్. సి. పూర్తిచేస్తాను."

"నీ బాల్యచాపల్యం వదలి వ్యక్తిత్వం పెరుగుతూంది. అందుకే నిన్ను కన్సల్ట్ చేసిగాని నాన్నకు చెప్పదలచు కోలేదు... వెరీగుడ్... నీది గుడ్ ఐడియా— యూన్నీ! ఈ శుభ సమయంలో కళ్ళెత్తి నిండుగా చూడవూ ?... మై స్వీట్ గర్ల్" ప్రాధేయతగా ఆమె నయనాలకేసి చూస్తూ... యూన్నీ గడ్డం పట్టుకొని పైకెత్తాడు.

మనసున గులాబీలు విచ్చుకోగా కనుల్లో ఆనంద జ్యోతులు వెలిగాయి. సన్నని మునివేళ్ళతో మృదువుగా అతడి చేయి తొలిగించుకుంది యూన్నీ.

ఆ స్పర్శ... లేత తమలపాకుల్లా తోచగా తొలగిస్తున్న ఆమె చేతిని తన చెక్కిలికేసి అదుముకున్నాడు. పల్చని చెంపల మీద, ఆమె వ్రేళ్ళు నెమ్మదిగా లాస్యం చేశాయి. వీణాతంత్రులు మీటినట్లు అతడి హృదయం మధురగానం ఆలపించగా, ఆమె మది పల్లవి పాడింది.

"ఈ ఆనంద సమయంలో ఈ ఆరాధకుడు చిరు

కానక సమర్పించుకుంటున్నాను"... అంటూ ప్యాంటు జేబులో నుంచి కార్డుసైజు తన ఫొటో తీసి ఆమె చేతిలో వుంచాడు మనోహర్.

"థ్యాంక్సు... నేనే అడగాలనుకున్నాను..." అన్నది దాన్ని అందుకుంటూ.

"మరి అమ్మాయిగారి ప్రతి రూపం... ప్రసాదించరా ?..."

"అలాగే" అంటూ తన గదిలోకి వెళ్ళి ఆల్బంలో నుంచి మంచి ఫోజులోవున్న ఫొటో తెచ్చియిచ్చింది. ఫొటో అందుకు నేనెపంతో రెండు చేతులూ అందుకొని హృదయానికి హత్తుకున్నాడు. బిడియంతో అవనత అయింది.

ఫొటోపై... ముద్దుల వర్షం కురిపించాడు. అది తనే అన్నంత అనుభూతి కల్గగా, బుగ్గల్లో నుంచి వెచ్చటి ఆవిర్లు రాగా- గులాబి రంగు దాల్చాయవి.

మేడ మీాదికి రమణరావు రాగా...

ఇద్దరూ పాదాభివందనం చేశారు.

"క్రిందకు రావోయ్, కాఫీ తీసుకుని వెళ్ళుదు గాని" అన్నాడు రమణరావు.

"అలాగేనండి" అన్నాడు మనోహర్.

అందరూ క్రిందికి దిగారు.

మనోహర్ అమెరికాలో రిసర్చికి వెళ్ళటానికి పాస్ పోర్టు సంపాదించాడు రమణరావు.

మనోహర్ అమెరికా వెళ్ళేటప్పుడు ప్లాట్‌ఫామ్ వరకు వెళ్ళి వీడ్కోలిచ్చి వచ్చారు రమణరావు, యామిని.

వీడ్కోలిస్తున్న యామిని వదనాన విచార రేఖలు ద్యోతకమైనాయి. కనుల్లో నీటిచక్రాలు కదలాడాయి... మనోహర్ వోరగా చూచాడు.

"తప్పదమా! నవ్వాలిమరి..." అన్నాడు పూలగుత్తి అందుకుంటూ అతి రహస్యంగా.

కనుకొలుకుల్లో నుంచి నీటిధారలు జాలు వారగా సెలయేరులా గలగల నవ్వింది.

తెల్లని పాలరాతి మీద... సన్నటి నీటిపాయ ప్రవహిస్తుంటే వాటిపై వెన్నెల రేఖలు ప్రసరించినట్లు గోచరించింది మనోహర్‌కి. ఆ కమనీయ దృశ్యాన్ని తన హృదయ ఫలకంపై ముద్రించుకున్నాడు.

## 23

కాలగమనం ఓ సంవత్సరాన్ని మ్రింగి కొన్ని నెలల్ని వెనక్కి నెట్టింది.

యామిని బి. ఎ. సెకండు క్లాసులో పాసవడం, రాధ బి. ఎ. కు ప్రయివేటుగా చదవటం జరిగిపోయాయి. శ్రీధర్ వెళ్ళిన తరువాత ప్రయివేటు లేకపోగా మాధవ్ తననోట్సులు తెచ్చి ఇచ్చేవాడు. బాగా చదవలేదు, పాసు కానేమోనని

హాట్‌గా వుండి పరీక్షకు రాసంతే బలవంతంగా పరీక్షలు వ్రాయించాడు మాధవ్. జనతా క్లాసులో పాసయింది. ఈ లోపల శ్రీధర్ ఒకమాటు వచ్చి వెళ్ళాడు.

మాధవ్ తమ్ముడు గోపి పి.యు.సి. ఫస్టుక్లాసులో పాస య్యాడు సైన్సు గ్రూపు కనక... మెడిసన్‌లో చేరాలని పట్టుబట్టాడు. సీటు గ్యారంటీగా వస్తుంది గనుక మెడిసిన్‌లో చేర్పనుంది రాధ.

"నేను...నిరుద్యోగడి పాత్ర మొంటు సభ్యత్వం కంటిన్యూ చేస్తూంటే వాడిని కాలేజీలో చేర్పి రెంటికి చెడ్డ రేవడిని చేయ టమే అవుతుంది. ఆశలు అందని మొక్కాలనుకుంటే, అదృష్టం చూడలు కాస్తుందంటారు" నిరుత్సాహంగా గాలి పీల్చు కున్నాడు మాధవ్.

"ఉద్యోగాన్వేషణలో వున్నారు కదూ! అదే వస్తుంది. నేనీ లోపల నాకు వీలైనంత డబ్బు కడుతాను. నేను బి.యిడి చదవాలనుకున్నాను. నీవు నౌకరీలో చేరి గోపికి డబ్బు సర్ద గలిగే దాకా నేను ఎమ్. ఏ. ప్రయివేట్‌గా కట్టి ఇంట్లో చదువుతుంటాను."

"ఎమ్.బి.బి.ఎస్ చదివించమంటే మాటలుగాదు. ఎంతో డబ్బుకావాలి. వాడితో కూడా ఈ మాట అని ఆశలు పెంచకు రాధా..."

"నీవేదో ఉపాయంతో డబ్బు సర్దుతానని చెప్పి... అతన్ని పంపి ఏర్పాటు చెయ్యకపోతే నేనే అప్పుగా ఇస్తున్నానని నమ్మించి చేర్పిస్తాను. డబ్బు చాలకపోతే వయలిన్ పాఠాలు కూడా చెప్పి ఇంకా సంపాదిస్తాను..." ఆవేశంగా చెప్పుకుపోతూంది రాధ.

"ఫుల్‌స్టాప్... నీవింకా ఎన్నో చేసి శ్రమపడ్డానికి నీదీ శరీరమే! ఒకరికి సహాకరించేటప్పుడు నిన్ను నీవే మరచిపోయి మైనపు వత్తివైపోతావు. ఆ వెలుగులో తాము బంగారు బాట ఏర్పరచుకున్నామని వారు మరచిపోవచ్చు—అయినా నీవింత మంచిదానవైపోయి.. నన్ను ఉక్కిరి బిక్కిరి చెయ్యకు రాధా!... నేను మానవ మాత్రుణ్ని... అన్ని వరాలను ఆకళింపు చేసుకోలేను సుమా!" ఆమె వైపు ఆరాధనగా చూస్తూ ఆమె హస్తద్వయాన్ని హృదయానికి హత్తుకున్నాడు.

అనిర్వచనీయమైన ఆనందంతో తన్మయంగా వుండిపోయింది రాధ.

ఆమె వ్రేళ్ళు అతడి ఎదను సున్నితంగా మీట సాగాయి. ఆ గిలిగింతలు శరీరమంతా ప్రాకి ఏదో మధుర వాంఛను రేకెత్తించింది మాధవ్‌లో.

పరువం పొంగులువారగా... ఆమెను తనలో ఐక్యం చేసుకోవాలనుకున్నాడు. ఆమె రెండు భుజాలను చేతులతో

నొక్కాడు ... పారవశ్యంతో లిప్త పాటు అతడి హృదయంలో తల దాచుకుంది.

ఏదో కర్తవ్యం గుర్తుకొచ్చినదానిలా వులిక్కిపడి ఛటుక్కున విడిపించుకుంది.

ఆమె సజల నయనాలకేసి చూచి చకితుడయ్యాడు మాధవ్. "సారీ ... రాధా ... వద్దనుకుంటూనే వద్దకు చేరుతున్నాను... ఎందుకో నీలో ఎన్నడూ లేని అందాలు సంతరించుకున్నాయి. నీ ఆకర్షణ నన్ను వివశుణ్ని చేసేస్తోంది. మనసులు దగ్గరైె కూడా మనమెందుకు దూరమవాలి? ఎవరికి తెలీకపోతేనేం — రిజిస్ట్రారాఫీసుకెళ్ళి చట్టరీత్యా పెండ్లి చేసుకుందాం ... అప్పుడే ఆటంకమూ వుండదుగా .." ఆశగా చూస్తూ బ్రతిమిలాడే ధోరణిలో అన్నాడు.

"మనమింకా ఓ స్థాయికి రాలేదు. పెద్దల సమ్మతి అందలేదు - నా మనసుతో ... మంచితనంతో అత్తయ్యను, మామయ్యను ఆకట్టుకొని వాళ్ళ నోటితో తమ కోడలు కమ్మని అడిగించుకోవాలని... ఆశిస్తున్నాను మాధవ్ ."

"అది పిచ్చిభ్రమ . . . ఆ కోరిక నెరవేరేది కాదు. మాటల సందర్భంలో అమ్మనడిగాను. నీ మీద వుచిత సానుభూతేగాని ... కార్యరూపంలో కాదు ..."

"అలాగా ..." నిస్పృహ ఆవరించింది రాధ మదిలో.

"అధైర్య పడవద్దు రాధా! నీ వెప్పుడు పెండ్లి చేసుకుందామంటే అప్పుడు నేను రెడీ. సందేహించకు ప్లీజ్ !..."

చటుక్కున ఆమె చూపు గులాబి కుండీ మీద పడింది. ఏదో గుర్తొచ్చి సంతోషాతిరేకంతో ఒక్క పరుగున వెళ్ళి ఆ మొక్కను చేతుల్లోకి తీసుకుంది.

గులాబి ముళ్ళు గ్రుచ్చుకునేదాకా ఆవేశం తగ్గలేదు.

“అ... బ్బా” అంది సన్నని బాధతో.

అరచేతులు కేసి చూచి గతుక్కుమన్నాడు.

“నీ వున్మాదం చూస్తుంటే నాకు మతిపోతూంది రాధా ఏమిటీ ఆవేశం ?”

“ఆవేశం కాదు మూర్ధన్ ! ఆనందం ! నేను మోడుగా వున్నప్పటికీ మోడే ... దానికి ‘పేడ’ ఆధారం చేసాను. బ్రతికింది. చివురించింది. మొగ్గతొడిగింది. ఇదిగో పూలతో ఎంత నిండుగా వుందో చూడు.” కన్నుల్లో వెయ్యి జ్యోతులు వెలుగ్గా చెట్టువైపు చూచింది రాధ

“నీవు ? మంచి సామ్యం. బాగానే వుంది. మరి దానిలా నీవూ పూలతో...”

“నేను గాకపోయినా నా మనస్సంతా మల్లెలై విరిశాయి. దేవుడు దయాస్వరూపుడమ్మా ఎప్పటికైనా మేలు చేస్తాడని నాన్న అంటే నమ్మేదాన్నికాదు.” పారవశ్యంగా ఆకాశం కేసి చూచి చేతులు జోడించింది.

“ఏమిటమ్మా ! సూర్యనమస్కారాలు చేస్తున్నావ్ ! భక్తి పుట్టుకొచ్చిందే” అన్నాడు అప్పుడే అక్కడికొచ్చిన రాఘవయ్య.

బిడియంగా తలవంచుకొని అక్కడి నుంచి జారిపోయింది రాధ.

వయొలిన్ నేర్పడానికి కొన్ని ప్రయివేట్లు కుదిరాయి. ఎమ్. ఎ. బుక్స్ తెచ్చుకుంది. రాధ- ఎంత శ్రమ పడినా ముఖంలో మచ్చుకైనా అలసట పొడచూపేది కాదు. ఇనుమడించిన ఉత్సాహంతో పన్లు చేసేది. మోమున కొత్త కాంతి సంతరించుకుంది. గొంతున మాధుర్యం రంగరించుకుంది. వస్త్రధారణలో, అలంకరణలో, ప్రత్యేకశ్రద్ధ వహించేది. నిరాడంబరంగా వుంటూ తెలుపుగా మెరిసే రాధను చూచి తలోవిధంగా అనుకునేవారు. చెవిన పడినా, సమయం వచ్చినప్పుడు వాళ్ళే నోళ్ళు కట్టుకుంటారనుకుంది. ప్రొద్దుట పూట స్కూలు పిల్లలకు చెప్పే ప్రయివేటు క్లాసు తనూ తీసుకొని చెప్పేవాడు మోహన్.

ప్రొద్దుటపూట రాఘవయ్యగారిల్లు ఓ కళాసదనంలా వుండేది. దేవుని మందిరం దగ్గర నుంచి రాఘవయ్యగారి గొంతు నుంచి భక్తిశ్లోకాలు వెలువడేవి. ఎంతటి నాస్తికుడి కైనా ఆస్తికుడుగా మారే భావస్ఫూర్తి వుండేది ఆ శ్లోకాలు చదివే తీరులో. వయొలిన్ వళ్ళో పెట్టుకొని కమాన్‌తో నాట్యం చేయిస్తున్న రాధ 'అపర వాణి'లా గోచరించేది. ఆమె గానలహరిలో కొంతసేపు లీనమయ్యే

వాడు మాధవ్. వాళ్ళిద్దరి తను ఆమెను భార్యగా గాక దేవతగా పూజించాలనే పూజ్య భావం జనించేది. అంతటి మహోన్నతవ్యక్తికి తను తగనని పించేది. తనకు సహకరించే మాధవ్ పట్ల గురించి గౌరవం పెరిగేది రాధకు. మాధవ్‌కు మించిన మహాపురుషులు ప్రపంచంలో లేరని భావించేది. అందానికి మించిన ఔన్నత్యం ఆమెను మరింత ఆకర్షించింది. అతడి సన్నిధి తనకు భగవత్ ప్రసాదితం అని పించేది.

నైదేహమ్మ వచ్చి ఏవేవో విషయాలు చెప్పింది. అలాగే చేస్తానని హామీ ఇచ్చిందిరాధ. తాను నైదేహమ్మకు చెప్పిన ప్రకారం అప్లికేషన్ వేయించింది... బ్యాంకు పరీక్షలు వ్రాయటానికి హైదరాబాద్ వెళ్ళాడు మాధవ్.

క్లర్కుగా ఆర్డర్సు వచ్చాయి... నాలుగు రోజుల్లో జాయిన్ అవ్వాల్సి వుంది.

అప్పుడే శంకారంలో పాలికిచ్చిన చేను మహాసూలు జరుపుతూ సోమశేఖరాన్ని రమ్మని చెప్పి వెళ్ళారు రైతులు. రెండు దినాలనుంచి కొద్ది కొద్దిగా టెంపరేచర్ వస్తున్న సోమశేఖరానికానాడు హై టెంపరేచర్ వచ్చింది. అందువల్ల మాధవ్ "మహాసూలు" చేయించటానికి శంకారం వెళ్ళాడు... రాఘవయ్యగారి వద్ద మహాసూలు గూడా జరుగుతున్నందు వల్ల ఇద్దరూ వెళ్ళారు. ఆనాడు సాయంకాలం రాధ మాధవ్‌కు, రాఘవయ్యకు భోజనం తెచ్చింది. ఎంతోసేపు సోమశేఖరం

గారి మోటబావి దగ్గర గడిపారు రాధా మాధవ్‌లు. బావి క్రింద రాగి పైరు వేసివుంది. ఇద్దరికి అవన్నీ చిరపరిచితాలే. రాగి కంకి కొరికి మాధవ్ కందిచ్చింది...

"ఎంగిలి ఛా... ఛా"

"నా ఎంగిలి తినం దెప్పంపో" వెటకారంగా ముఖం పెట్టి సరసమాడింది.

"దేవి ప్రసాదం" చేతిలో పందుకొని నోట్లో పెట్టుకొని సన్నని గింజలు పంటితో కొరకసాగాడు.

చీర మోకాళ్ళ వరకు దోపి, పిల్లకాలువ గట్టున కూర్చొని, ఏతాం నీళ్ళను కాళ్ళతో సరదాగా కొట్టుకుంటువున్న రాధను చూడగానే, పామర ప్రబంధనాయకి 'ఎంకి' రూపు మెదిలింది.

"ఏతం గట్టున నా ఎంకి" సన్నగా పాడాడు మాధవ్.

అలిసి బుగ్గన చిటికేసి బుంగమూతి పెట్టుకుంది. చేను దాటి వెలుపలి కొచ్చారు.

పశ్చిమాద్రిన ఆదిత్యుడు అస్తమిస్తున్నాడు. తన నొదలి వెళుతున్న సూర్యుణ్ణి చూచి ఆకాశం ముఖం ఎర్ర చేసుకుంది. వేడి తరిగిన కిరణాల కాంతికి అక్కడి పచ్చి మొక్కలు, విరగ బూసిన తంగేడు మొక్కలూ, కొనగట్లు వింత అందాన్ని సంతరించు కున్నాయి. అంబరాన కొంగలు బారులు తీరి పరుగు పరుగున రెక్కలు విదుపుకుంటూ వస్తుంటే, తోపురంగు మబ్బులు భూతాల్లో తరుము

మున్నాయి. ఆ ప్రకృతి కౌగిలిలో లీనమై పారవశ్యంలో మున్న మాధవ్ చెవిలో—

"ఓ కళా తపస్వీ! రాత్రి పడబోతూంది." అన్నది రాధ.

"గాయనీ మణీ! కవయిత్రీ! అబ్బబ్బ. అందమైన చిత్తరువు చెరిపేశావు" రాధ చెవి పట్టుకున్నాడు.

"హైదరాబాద్‌లో అంతకంటే అద్భుతమైన దృశ్యాలు. దొరుకుతాయి. వీటికే ప్రక్కమనుషుల్ని మరిచి నన్నింక అక్కడికి వెళ్ళితే నేనసలు జ్ఞాపకం వుండనేమో!" చిరుకోపం ప్రదర్శించింది.

"నీవు చెరిగే చిత్రానివి కావు. మనసనే కేన్వాసు మీద గీచుకో బడ్డావు. మనో ఆకాశానికి చందమామవు!"

"ఆకాశంలో జాబిల్లితోపాటు తారకలు, కారు మేఘాలుంటాయని మరిచి పోతున్నావు. చందమామను సహితం కప్పివేసే నల్లని మబ్బులుండ వచ్చు..." రాధలోని కలవరం గ్రహించాడు మాధవ్.

"ఏమైనా జాబిల్లి వినువను అధిగమించ లేవుగా!— అయినా నీకు కవిత్వం వంటబట్టినట్టుందేమిటీ? కొంపదీసి కథలు రాస్తావా?"

"గంధపు చెక్క రాపిడికి సానకు సుగంధం అంటినంత మాత్రాన సానకు గంధపు చెక్క పరిమళం శాశ్వతంగా వుంటుందా?"

ఆహ్లాదకరంగా చీకట్లో నవ్వుతున్నాడు రాధ మాటాడలేదు.

"బస్సుకు నెల్లూరెళతారా? లేక శంకారం ఊళ్లో కెళ్ళే ఎడ్లబండుంటదట కరణంగారింటికి కెళతారా అడగ మన్నాడు నాన్నగారు..." అన్నాడు వో రైతు.

"బస్సుకు నెల్లూరు వెళతానని జెప్పు" అంది.

శంకారం ఊళ్లో కనగానే ముఖం వివర్ణమై పోవడం చీకట్లో గమనించ లేదు మాధవ్.

మధ్యాహ్నం కారియర్లు తీసుకుని ఇద్దర్నీ తను తెచ్చిన అన్నం పెట్టుకు తినమని చెప్పి, బస్సు ఆగే చోటు దగ్గరికొచ్చి నిలుచుంది.

అక్కడ తను చిన్నప్పుడు అందరి ఆదరాభిమానాలు, అవహేళనలు, సానుభూతులు ఒక్కొక్కటి గమనానికి వచ్చి మనసు గతంలోకి లాగింది.

పెండ్లి చేసుకొని వెళ్ళింది మొదలు రానందుకు శేషన్ని తిట్టిపోసి, తనపై జాలి చూపేవారు. వచ్చిన తరువాత ఎక్కువ మంది కలిసి కాపురం చెయ్యమని బోధించేవారు, చాలా తక్కువ మంది మాత్రం నిలకడ లేనివాడి పొందు పనికిరాదని విడిచి పొమ్మని సలహా ఇచ్చారు. విడాకుల విషయంలో, పెండ్లిలో తను నిమిత్తమాత్రురాలైనా దాని ప్రభావం తన మీదనే చూపేవారు.

మొగుడుతో కాపురం చెయ్యని మొండిదానిగా పొగరుబోతుగా చిత్రించారు పతివ్రతా లక్షణాలు కావన్నారు. తండ్రి నందరూ దుయ్యబట్టారు. "ఆధ్యాత్మిక చింత వున్న సదాచారుడివి, అవసరమంటూ ఆడపిల్లను ఇంట్లో పెట్టుకోవడం ఏమిటని" విమర్శించారు.

తనెంత మంచిగా వుండబోయినా దాన్ని బూటకమని తప్పు కప్పిపుచ్చుకోవటానికని అనేవాళ్ళు. తమ పిల్లలు తనతో స్నేహం చేస్తే చెడిపోతారని ఎవర్నీ మాట్లాడనిచ్చే వారు కారు. వెలివేసినట్లు అక్కడ వుండలేనని తండ్రితో మొరపెట్టుకుంది... కాలం కలిసొచ్చి తనకు ఉద్యోగం రావటంతో బస్తీ కాపురం పెట్టినందువల్ల మనసుకు కాస్త తెరిపి చిక్కింది

బస్సొచ్చి హారన్ కొట్టిందాకా గతావలోకనం చేసుకోసాగింది రాధ.

వైదేహమ్మ రెండుజతల బట్టలూ, ఏదో ఫలహారాలు తెచ్చి మాధవ్ కిచ్చింది.

"వస్తూ కరణంగారి దొడ్లో పాత రేయించమని చెప్పాను. రాత్రికి పనైపోయినా వాళ్ళింట్లో రాత్రికి వుండి తనకు ఉద్యోగం వచ్చిన సంగతి చెప్పి రమ్మను. అన్నట్లు నౌకరీ వచ్చింది కదా ఇప్పుడు చెపితే ఏమని మనం జరిపిన తతంగం చెప్పలేదు గదా! కొంపదీసి రమణరావే తెలిసిన వాళ్ళతో మాట్లాడి వేయించాడని తెలిస్తే ఉద్యోగమైనా మాను

కుంటాను..." అన్నది వైదేహమ్మ- రాధ చెప్పిందేమోనని ఖంగారు పడుతూ.

"నేనెందుకు చెప్తానత్తయ్యా... మీ మంచిచెడ్డలు నావి కావూ?" ఆ మాట రాధ అంటే కాస్త అర్థమయినా కానట్లు చూచింది వైదేహమ్మ!

దేవుడి గదిలో కెళ్ళి చెంపలు వేసుకుని తీర్థం తీసుకుని ఇంటికెళ్ళింది.

"పూజయినాసరే నీవు కాస్త విశ్రాంతి తీసుకొనిరా, నాన్నా... నేనీ రోజు స్కూలుకు శలవు పెట్టాను. మధ్యాహ్నం దాకా చేలోనే వుంటాను. నీవు భోంచేసి కాస్త అన్నం క్యారియర్లో పెట్టించుకునిరా. నేనీలోపల ఈ టిఫిన్ మాధవ్ కిస్తాను..." అంటూ చీర మార్చుకుని గుడ్డల బ్యాగ్, టిఫిన్ డబ్బా, ఫ్లాస్కు తీసుకుని బయలుదేరింది.

రాధ కుప్పల దగ్గరకు వెళ్ళేసరికి తమ వడ్ల కళ్ళంలో వడ్ల రాసి ఒకవైపు వుంది. రెండోకయ్యలో గడ్డి పరిచి వుంది. ఓ ముసలి రైతు కునికిపాట్లు పడుతూ నుసిగట్టిన పొగాకు చుట్టను అప్పుడప్పుడు పీల్చుతున్నాడు.

"సుబ్బయ్యా! కూలీవాళ్ళెవరూ కనబడరేం?" అంది రాధ.

"ఊళ్లోకి పోయిండ్రమ్మా! కుప్ప తొక్కించడానికి గొడ్ల దోలక రావడానికెల్లిండ్రు" అన్నాడు.

మాధవ్ గారివి సగం మహాసూలైనాయి. మరికొన్ని

వోదెలు (వెన్నులో వున్న ఎండిన పైరు) చెక్కబల్ల దగ్గరికి మోస్తున్నారు కొందరు. మాధవ్ ఓ ఈతపుల్లతో పండ్లు తోముకుంటూ ప్రత్యక్షమైనాడు.

"ఉషా కిన్నెరకు సుస్వాగతం" తమాషాగా చేతు లూపాడు. నోటిలో పందుంపుల్ల యిరికించి వుంది. రాత్రి నిద్రలేమితో కళ్ళు కాస్త ఎర్రదనాన్ని పులుముకున్నాయి. ముఖం కొద్దిగా వాడి వున్నా అదో అందంగా వుంది. కను రెప్పలు కొద్దిగా వుబ్బి ఏదో మత్తుగా, గమ్మత్తుగా వున్నాయి. రింగుల వెంట్రుకలు చెరిగి చందమామను ముద్దాడే నల్ల మబ్బుల్లా దోబూచులాడుతున్నాయి. అలా ఒక్కసారి తనివిదీర ముద్దుపెట్టుకుంటే బావుండునను కుంది రాధ. కళ్ళు వెడల్పుచేసి అలాగే చూడసాగింది.

"దిష్టి పెట్టకండి దేవిగారూ ?" అని మాధవ్ పలకరించే సరికి ఉలిక్కిపడి సర్దుకొని కళ్ళు వాల్చుకుంది.

"కానీయండి ఏమేమి తెచ్చారో !... ఆకలి రాక్షసుడు ఆవురావు రంటున్నాడు" అన్నాడు అక్కడున్న టిఫిన్ డబ్బా కేసి చూస్తూ.

"ముఖం కడుక్కో మరి. ఆ గుంటలో నీళ్ళు తెస్తాను" అంటూ స్టీల్ మరచెంబు పట్టుకొని కాస్త దూరంలో వున్న గుంటవైపు నడిచింది.

ఆ నడకలోని హొయలు చూస్తూ తానూ వెంబ డించాడు మాధవ్ మంత్ర ముగ్ధుళ్ళా, వెనక మాధవ్ వస్తు

న్నట్లు గమనించలేకపోయింది రాధ. ముందు నీళ్ళు బురదగా వుంటాయని కాస్త గుంటలోపలికి దిగింది. తేటనీళ్ళు ముంచుకొని టిఫిన్ పెట్టటానికి రెండు తామరాకుల్ని తుంచుకుంది. ఆకులు, నీళ్ళ చెంబు ఎడం చేత్తో పట్టుకొని ఒక్కడుగు ముందుకేసి ఓ తామరపువ్వు త్రుంచబోయింది. పువ్వు చేతికందింది గాని అక్కడ కాలు దిగబడి నీళ్ళలోకి పడిపోయి కెవ్వున కేకేసింది. చెంబు, ఆకులు పట్టు దప్పి నీళ్ళలో పడిపోయాయి. చెంబు కోసం వెదుకుతుండగా నీళ్ళలో నిలబడిన మాధవ్ – చెంబు చేత బట్టుకొని వున్నాడు. ఎంత పైకి లాగినా ఓ కాలు బురదలో కూరుకుపోయి పైకి రావటంలేదు. చేయందిచ్చాడు మాధవ్. ఆసరాతో పైకి లేచింది రాధ. కాని బట్టలన్నీ బురదతో అసహ్యంగా వున్నాయి.

"ఎట్లాగూ తడిశావ్! బాగా స్నానమన్నా చెయ్" అంటూ మరో ప్రక్కకి లాక్కుపోయి వదిలాడు.

చల్లని నీళ్ళలో వణికిపోతూ కాస్త పైకి లేచింది. ప్రభాకరుని కరుకు కిరణాలు నులివెచ్చగా తగిలాయి. ఓ మునక మునగడం కాస్త ఎండ తాకిడికి ఆగడంలోని ఆనందం అనుభవిస్తూ పరిసరాలు మరిచింది రాధ.

ముడుచుకునే కలువల మధ్య, పరుచుకున్న తామ రాకుల నడుమ విచ్చుకుంటున్న పద్మాల మధ్య తానొక తామర పద్మమై నిలిచినట్టుంది రాధ.

సూర్యకిరణాల లేత ఎండకు బంగారుపోతలా వున్న

అపరంజిరంగు నీళ్ళలో ... జలకన్యలా ... పూలబాలలా వుంది. ముఖాన పడిన నీటి బొట్లు కిరణాల కాంతికి మెరుస్తుంటే తామర పుష్పంలా వుంది రాధ వదనం.

మాధవ్ కూడా 'కొలను' లోకి దిగాడు. కాస్త ముడుచుకుపోతూ గుండెల వరకు మునిగి కూర్చుంది సిగ్గు ముంచుకు రాగా. సరాసరి లోనికి వచ్చిన మాధవ్ ఆమె వదనాన్ని దోసిట్లోకి తీసికొని "అన్ని పుష్పాలకంటే ఇదెంతో బావుంది" అని దగ్గరకు తీసుకోబోయాడు.

"ఛీ... నీకొక్కమా చెప్పేది" అంటూ దోసెడు నీళ్ళు తీసుకొని విసిరింది అతడి తలపైన.

"ఓహ్హో! ఏదీ ఇంకో రెండు దోసిళ్ళు పొయ్యి..." వంగాడు.

నవ్వుకుంటూ కాస్త వెనక్కు జరగబోయి నీళ్ళలో పడిపోయింది.

"అరెరెరె." అంటూ రెండు రెక్కలూ అందుకొని "నీ చేతులెక్కడ రాధా! తామరతూళ్ళు దొరికాయి, నీ చేతులేవి ?"

"ఇవిగో" అని అక్కడున్న తూళ్ళు అతడి చేతి కందిచ్చింది.

"ఆహా... అవా. సరే, పూలు తుంచాలి వుండు" అంటూ ఆమె వ్రేళ్ళందుకున్నాడు.

"అబ్బా... ఏమిటిది. మెలిపెడుతున్నావూ..."

ఆ ప్రూవుకు తూలి అతనిపై పడిపోయింది.

అతడెన్నడూ ఎరగని వింత స్పర్శలేవో ... అతన్ని వెర్రివాణ్ని చేశాయి.

శిఖరాల కెగిరిన అతడి కోర్కెలు అంచులు చూడా లనిపించింది.

కొన్ని క్షణాలు సర్వం మరిచారిద్దరూ.

రాధ చటుక్కున విడిపించుకొని దూరంగా చేరింది.

తడిసిన చీరలో ఆమె వొంపు సొంపులన్నీ కనిపించ గనే ఉన్మత్తుడయ్యాడు మాధవ్. కొండెత్తాచులా గట్టు మీదికి లంఘించి ఆమె అణువణువునూ గాఢవాంఛతో వీక్షించసాగాడు. రెండు చేతుల్తో తన భుజాలను, ఎదను దాచుకుంటూ ప్రక్కకు తిరిగి నేలమీద కూర్చొని "ప్లీజ్! మాధవ్ నీవి రెండు జతల గుడ్డలున్నాయి. నాకోటి తెచ్చి వ్వవూ ?"

"ఆజ్ఞ." అంటూ చెయ్యి సలాం చేసినట్టు పెట్టి కొద్దిగా వంగి అన్నాడు. తడిసిన గళ్ళలుంగీ, తడిసిన చాక్లెట్ రంగు టవలు అతడి సౌందర్యాన్ని కప్పలేక పోయాయి. ఆ హృదయం తన సామ్రాజ్యం. కలకాలం తనదై పోవాలి. రాధ మనసంతా ఆనంద తరంగితమైంది.

పైజమా, లాల్చీ, బనీను తెచ్చిచ్చాడు.

అక్కడే వున్న "పోలేరమ్మ గుడి" చాటుకు వెళ్ళి

గుడ్డలు మార్చుకుని, చీర అక్కడే గట్టుమీద ఆరేసింది. తడి తల అతడందిచ్చిన టవల్‌తో తుడుచుకోసాగింది.

ఆ వింత వస్త్రధారణ తమాషాగా తోచింది.

గుండెల మీద ఆచ్ఛాదన లేకపోవటం సిగ్గుగా వుండి టవల్ పమిటలా కప్పుకుంది.

"ఎన్ని రోజులు అందాలను దాచుకుంటావ్ రాధా! పంచభక్ష్య పరమాన్నాలు వడ్డించి ఈ భోజనం నీదేనంటూ ముట్టుకూడదంటే ఎలా వుండగలను? ఏమైనా అదిగో ఆ దేవత సాక్షిగా, పంచభూతముల సాక్షిగా గాంధర్వవివాహం చేసుకుందాం..." ఆవేశంగా అడుగులు ముందుకు వేశాడు మాధవ్.

"పంచభూతాలు, మంత్రాలు, దేవుళ్ళూ, సాక్షులూ వికటిపోయినప్పుడు అడ్డురాలేదు. అయినా మనస్సులే ముఖ్యం. కాదనలేను. నా అపరాధం లే నే ఎన్నో పరాభవాలుపడ్డాను. దాని పర్యవసానం నా మీదనే ప్రభావం చూపిస్తూంది."

"మాపించనీయ్. భయం లేదు— రిజిస్టర్ పెళ్ళి చేసుకుందాం. కలిసి కాపురం చేద్దాం - నేనింక నిన్ను దూరంగా వుంచలేను..." బలంగా దగ్గరకు లాక్కున్నాడు.

"వదులు. మాధవ్! తొందరపాటు పనికిరాదు. మన పరిస్థితులు చక్కబడగానే..."

అలా మాట్లాడుతూ వుంటే విచ్చుకున్న ఆమె పెదవుల్ని గాఢంగాచుంబించాడు.

బలంగా ఒక్క తోపు... తోసింది.

హఠాత్ పరిణామానికి స్తంభించిపోయిన మాధవ్ ఆవేగంలో అదుపుచేసుకుంటూ వెనక్కి తిరిగి పోసాగాడు.

తన పొరపాటు చటుక్కున తెలుసుకున్న రాధ... "మాధవ్... మాధవ్ నన్ను క్షమించు. నేనెందుకు నిన్ను వారించానో తెలుసా ? నా మీద కళంకమనే ముద్ర పడ కూడదని. లోకం చేత నిందలు పడ కూడదని, నేను కామ పిశాచిని కానని నిరూపించుకోడానికి నన్నర్థం చేసుకో మాధవ్. నేను పాషాణాన్ని కాను... నాకూ వాంఛ లున్నాయి. హృదయం వుంది కాని... కాని...నా పరిస్థితులు..." అంటూ అతడి రెండు పాదాలను గట్టిగా పట్టుకుంది. ఆమె కనులనుంచి ధారా వాహికంగా అశ్రువులు స్రవించసాగాయి.

"లే రాధా! లే... నీవేం తప్పు చేయలేదు. పాపం చేయబోయిన భక్తుణ్ణి... దేవత దండించింది... అంతే అంటూ కళ్ళు నీళ్ళతో నిండగా అతడి కంఠం గాద్గదమైంది.

అతణ్ని తోసిన చేతుల్ని నేలకేసి కసిగా కొట్టుకో సాగింది. 'శాస్తి కావాలి' అంటూ.

"వొద్దు రాధా వొద్దు ఏదీ ... ఇలా ఇవ్వు" అని ఆ చేతులు కళ్ళ కద్దుకున్నాడు.

"ఎన్నో సంఘటనలతో అలసిన మనసు నీది. ఏమీ తెలీని అవివేకిని నేను...మనకు ఎలాంటి పెళ్ళయినా అయితేనే

గాని నిన్ను ముట్టుకోనని ప్రమాణం చేస్తున్నాను– అయితే నీ శిరస్సు, నీ వ్రేళ్ళు ఒక్కసారి తాకడానికి అనుమతి ఇవ్వు.. నా దానివనే గుర్తుకైనా రాధా మాధవ్ డాలర్ వేసుకో రాధా." అంటూ ఏదో షాక్ తిన్నట్లయ్యాడు !

"ఏమిటది మాధవ్ ?" అంటూ విస్తుబోయి నాలుగు వైపులా చూడసాగింది. తన గుండెల వేపు చూడ్డం గమనించి ముందుకు చూచుకొని "సారీ మాధవ్!" అంటూ బనీనులో మంగళసూత్రాల్ని దాచుకుంది.

"చట్టం వేరు చేసినా ఆ బంధమేమిటి రాధా!"

"అదా... అది... అమ్మ ... ప్రమాణం ... ఆమె నమ్మకం- నన్ను చావనీయకుండా కొందరు, బ్రతకనీయకుండా కొందరు వుచ్చులో బిగించారు మాధవ్... నేను బంధాలకు బానిసను."

"ఇప్పుడు నీ మనసేం బాగు లేదు...నీవేం మాట్లాడొద్దు నా ప్రవర్తన మనస్సులో పెట్టుకొని అసహ్యించుకోకు రాధా !"

"నన్ను మన్నించానను మాధవ్."

నాలుగు కళ్ళలో మమత వెల్లువలు కాగా కొన్ని నిముషాలలా స్థంభించి పోయాయి.

"ఈ యబ్బాయెవరయ్యా ?! రాధమ్మేది" అన్నాడు వాళ్ళను వెదుక్కుంటూ వచ్చిన సుబ్బయ్య తాత.

"నేనే సుబ్బయ్యా, నీళ్ళలో పడి చీర తడిసి పోతేనూ..."

"అబ్బాయయిపోయింది" వాక్యం పూర్తి చేసాడు.

"అన్నా...హి హి హి" నోటిమీద చేయి వేసుకుని నవ్వుతూ వెళ్ళాడు. చీర ఆరిందేమో చూడ్డానికి రాధ వెళ్ళింది. మాధవ్ వడ్ల కళ్ళం దగ్గరకొచ్చాడు.

# 24

మాధవ్ హైదరాబాద్‌కు నౌకరిలో జాయిన్ కావటానికి వెళ్ళేరోజు 'నేను నీ దాన్నే మాధవ్' అని చెప్పినట్టుగా వుంటుందని అది అతడి మనసులో ప్రతిక్షణం మెదులుతుండాలని...అతడిచ్చిన మొదటి ప్రేమకానుకైన రాధా మాధవ్ ప్రతిమ "డాలర్" మెడలో ధరించాలనుకుంది. అది మంగళసూత్రం స్థానంలో తన హృదయంలో పదిలపరుచుకోవాలనుకుంది.

ఆనాడు పెండ్లి వేడుకల్లో సూత్రధారణ కూడా ఒక వేడుకే అనుకుంది గాని ఇద్దరి జీవితాలను పెనవేసే అనుబంధం అనుకోలేదు. అనుకోవాలని కూడా తెలీదు. తన మనసుకు ఏదీ తెలియని వయస్సులో ఆ తాళి కట్టబడింది. గుండెలమీద మణుగు బరువులా తోస్తుంది. ఒకరి మూఢ నమ్మకానికి తను ఓ పరికరంగా దాన్ని మోస్తూంది. పాత జ్ఞాపకాలను పైకి తోడుతూ క్షణక్షణం చిత్రహింస చేస్తున్న పెద్దలు కట్టించిన 'సూత్రం' అదే- మంగళ సూత్రం.

చట్ట సమ్మతమైన విడాకుల్ని తీసుకుని యింటికొచ్చిన రోజున... ఒక్కొక్క విషమ సంఘటన తన జీవితం మీద

గట్టిముద్రవేసి వదలిన వాటిల్లో యిదొకటి...ఆనాడు అమ్మ నాన్నను ఎంతో నిందించింది.

చివరకు తనే సాహసించి అన్నది.

"ఇప్పుడు అన్నీ జరిగిపోయిం తరువాత నీవు ఎన్ని అన్నా ప్రయోగం లేదు కదమ్మా! రోజూ ఒకచోట మెల గాల్సిన వాళ్ళం. మాకు మాత్రం ఎలా సహనం వుంటుం దమ్మా,ఇది ఎటూ నీ యిష్టానికి వ్యతిరేకంగా జరిగింది. ఇంక నీ వుద్దేశ్యప్రకారమే నడుచుకుంటాను. ఈ తప్పుకు మన్నిం చమ్మా!" అంటూ తల్లి రెండు చేతులూ పట్టుకుని ఏడ్చింది తను.

"నా మాట వినేదానివైతే, నా ఒక్కకోర్కె తీర్చి, నా నమ్మకాన్ని కాచు...అదే... మంగళసూత్రాన్ని మటుకు తీసెయ్యవాక..." కన్నీళ్ళతో అర్థించిందమ్మ.

తల్లిమాటల మధ్యలో అందుకున్నాడు తండ్రి-

"ఇప్పుడది కుమారి, దాని ఇంటిపేరు కూడా మనదే ఇంక ఆ... అది అనవసరం"

అమ్మ రెచ్చిపోయింది.

"అది పది మందిలో శాస్త్రోక్తంగా కట్టిన తాళి... పెధవ చట్టాలు వాళ్ళిద్దర్నీ వేరు చేసినా భగవంతుడు ముడే శాడు. ఎప్పటికైనా ఇద్దరూ కలుస్తారు అని నాకు నమ్మకం వున్నది... అది వాడి ప్రాణం. మనం ఇల్లు వెడల గొట్టినా భగవంతుడు వాణ్ని భూమిమీద వుంచి నన్నాళ్ళు అది నీమెడలో వుండాలమ్మా... వుండాలి... నీవది తీసేస్తే వాడి

ప్రాణాలు తీసినంత పట్టు. నా తమ్ముడి శుభం కోసం ఆ మాత్రమన్నా చెయ్యి ... తియ్యవు కదా, మంగళసూత్రం తీయవుకదూ!" అని ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది.

"అ ... మ్మా" అన్నది తను. చెయ్యలేనని పరోక్షంగా చెప్పింది.

"అయితే నీ ఎదట్నే బావిలో దూకుతాను. నీవు దాన్ని తీసిన మరుక్షణం నేను బ్రతకలేను. వాడెక్కడున్నా వాడిని సురక్షితంగా వుంచేది, నీ మంగళసూత్రం అనే నా నమ్మకాన్నే కాదన్నప్పుడు ఇక్కడ నాకేం స్థానం వుంటుంది?" అంటూ చెయ్యి చూపించిందామె.

ఒద్దని సైగ చేసేడు అన్నయ్య.

"దాన్నెందుకు చిత్రవధ చేస్తావే...నీ కడుపున పుట్టి, వాడిచేత తాళి కట్టించుకుని నేరంలేని శిక్షగా బ్రతికున్నన్ని రోజులు పడాలటే?" అన్నాడు నాన్న.

తన మొండి పట్టుదల వదల్లేదు అమ్మ.

"అలాగే వుంచుకుంటానమ్మా" అన్నది తనానాడు. రాధ చేతులు ఒకటి డాలర్ మీద, రెండవది తాళిబొట్టు మీద వున్నాయి. ఇటు తల్లికి పెట్టిన ఒట్టు– అటు ప్రియుడి కోరిక, తను ఏది చెయ్యాలి? ఏది వదులుకోవాలి? ఎప్పుడైనా మంగళసూత్రాలు లేనట్టు అమ్మ కంటబడితే తనను బ్రతకనివ్వదు.

భగవాన్ ఎందుకు నాకీ విషమ పరీక్ష?

రాధ హృదయం దహించి లావాలాంటి కన్నీరు స్రవించసాగింది. కొన్ని కన్నీటి బిందువులు మాధవ్ ప్రేమ కానుక డాలర్ని తడిపాయి. కొన్ని రక్త కణాల్లాంటి నీటిబొట్లు గుండెలు మోస్తున్న తాళిని తడిపాయి. కర్తవ్యం, ధర్మం, బోధపడక రాధ మనసు అగాధాస్వనాటి కడలి తీరుగా అయింది. యోచనల తరంగాల ధాటికి తట్టుకోలేక కొన్ని నిముషాలు ప్రతిమలా నిలబడిపోయింది.

మెరుపులాంటి యోచన రాగా ఆనందంతో గంతు లేసింది మనసు... పసుపుతాడు తెచ్చి మంగళసూత్రాలు గ్రుచ్చుకొని, ఆ గొలుసులో రాధా మాధవ్ డాలర్ గ్రుచ్చి కళ్ళకద్దుకొని మెడలో వేసుకుంది. తన చేతులే మాధవ్ చేతులుగా భావించి, ఆ బంధం వెయ్యి జన్మలది కావాలని భగవంతుని ఎదుట సాష్టాంగపడి అక్కడి పూజా పుష్పాలు, అక్షింతలు తీసి కళ్ళకద్దుకొని తలమీద వేసు కుంది. కొన్ని పూలు, అక్షింతలు చేతిగుడ్డన కట్టుకుంది.

దేవుని ఎదుట కూతురు ప్రణమిల్లడం చూచి ఆమెలో పరివర్తనకు రాఘవయ్య కళ్ళు చెమర్చాయి.

రైలు స్టేషన్‌లో పమిట మీద గొలుసులోని తన కానుక 'డాలర్ ఆమె వక్షం మీద కదలాడుతుంటే మాధవ్ కళ్ళు ఆనందంతో మెరిశాయి.

'ఆ కాంతిపుంజమే తనను ముందుకు నడిపేది' అనుకుంది రాధ. అక్షింతలు, పూలు చేతికిచ్చింది చాటుగా.

"నీకు వెయ్యనా ? నేను వేసుకోనా ?" అన్నాడు.

"నీవే వేసుకోవాలి. నేను వేసుకున్నాను" అన్నది చిన్నగా.

ఇద్దరి నైఖరి ఎవరూ చూడకుండా జాగ్రత్తపడ్డారు.

ఇంతలో రాధ మొహంవైపు పరిశీలనగా చూచిన మాధవ్ గతుక్కుమన్నాడు.

రాధ గమనించలేదు.

అతడి ముఖం రంగులు మారటం దిగులువల్ల అను కుంది. తననూ, తమవారినీ మొదటిసారిగా వదలి వెళ్ళు తున్నందుకు కాబోలు అనుకుంది

# 25

మాధవ్ హైదరాబాద్ వెళ్ళగానే హోటల్లో రూము తీసుకున్నాడు. బ్యాంకు వుద్యోగంలో జాయిన్ అయిన తర్వాత తోటి క్లర్కు సహాయంతో రూముకి అన్వే. షణ ప్రారంభించాడు.

హైదరాబాద్ నగరంలో చూడాల్సినవి కొన్ని చూచాడు. అన్నిటి గురించి వివరిస్తూ రాధకు లెటర్ వ్రాసాడు. ప్రతి ప్రదేశంలోనూ నీ రూపే ప్రతిఫలి స్తూందని, ఇంకా చాలాకాలం వియోగం భరించలేను కనుక వీలైనంత త్వరగా నీతో సహజీవనం గడపాలని వుందని వ్రాశాడు.

స్థిమితంగా రూము దొరికినాక వ్రాస్తానని మళ్ళీ వ్రాశాడు.

"ఇది ఆఫీసు అడ్రసు గనుక ఎవరైనా చూసే శావుండదని నేను సంక్షిప్తంగా ముగిస్తున్నాను ... లేకపోతే ప్రయివేటు స్కూలు వదులుకొని రీముల కాగితాలు వ్రాసే దాన్ని"...అని రాధ జవాబిచ్చింది.

* * *

పబ్లిక్ గార్డెన్‌లో ఓ పొద దగ్గర కూర్చున్న మాధవ్‌ను ఓ బడాశాల్తీ...పరిశీలించి చూడసాగాడు.

ఎక్కడో చూచిన ముఖం అనిపించి మాధవ్ తదేకంగా చూస్తూ జ్ఞాపకం చేసుకోసాగాడు.

"అవును...అతడే...సుధీర్..." మనసులో అనుకోబోయి పైకన్నాడు.

"గూడ్...సుధీర్నే...నీవు...మాధవ్ కదూ?"

ఒకరినొకరు చూచుకొని మూడు సంవత్సరాలు పైన అయింది. పి. యు. సి. చదువుతూ వదిలేసి ఇల్లుజేరిన తరువాత...మళ్ళీ కనిపించలేదు ఒకరి కొకరు. సుధీర్ వేషం మార్పు, మాధవ్‌లో వయసు మార్పువల్ల గుర్తుపట్టుకోలేక పోయారు.

"నీవు దేనికొచ్చావ్ హైదరాబాద్?" ప్రశ్నించాడు సుధీర్.

"వుద్యోగం బ్యాంకీలో, రూముకోసం..."

"అరెరెరే అలాగా, వెరీగూడ్, ఋంక ఇక్కడే వుంటా వన్నమాట. చాలా ఆనందంగా వుందోయ్!"

"సరే! నీ విక్కడేం చేస్తున్నావ్? ఏం సంగతీ..." అన్నాడు మాధవ్ ఆసక్తిగా.

"నాది బిజినెస్ లైన్ ... మా ఫాదరిల్లాకు సబ్బుల ఫ్యాక్టరీ వుంది. మేనేజర్ని, పార్ట్నర్ని గూడా."

"తెలుస్తూనే వుంది ఆ డాబు, దర్పం. మంచి ఛాన్సు కొట్టావన్న మాట? ... ఆల్రైట్ అలా వుండాలి. అటు తండ్రి భూస్వామి, కంట్రాక్టర్... ఇటు అత్తవారింటివాళ్ళు వ్యాపారస్థులూ, వడ్డించిన విస్తరోయ్ నీ జీవితం..."

"కాకపోయినా మనమే వడ్డించుకోవాలి మిస్టర్. కాలం తెలుసుకొని మెలగాలి...ఇంకేం నా పంజాలో పడ్డావుగా. జీవిత మాధుర్యం అంటే రుచిచూస్తావ్!" సూటిగా అతడి కళ్ళలోకి చూచి విలాసంగా బెల్టు లాక్కో సాగాడు.

సుధీర్ మాటలకు కాస్త ఖంగారు గలిగినా సరదా అయిన మన స్తత్వం అని సరిపెట్టుకున్నాడు మాధవ్. తనతో రూముకు తీసుకెళ్లాడు సుధీర్. ఓ హాలు, బాత్రూం, చిన్న రూము ఒకటి, వాకిలి ముందు చిన్న గార్డెన్ అన్ని హంగులూ వున్నాయి. ఫర్నిచర్ రెండు సింగల్ కాట్లు ... రేడియో ... అన్నీ వున్నాయి. సంసారం చేసే వంట సామానుతప్ప. నలుగు రైదుగురు ఫ్రెండ్సు వచ్చినా వాడు

కునే విధంగా వుంది. తను ఇంటి దగ్గరా ... ఆఫీసులో కాకుండా కాస్త రిలీఫ్ కోసం ఫ్రెండ్స్‌తో జాలీగా గడప డానికి ప్రత్యేకంగా కట్టించుకున్నానన్నాడు.

మాధవ్‌ను సామానూ తీసుకుని వచ్చి ఇక్కడే వుండి పొమ్మన్నాడు. మాధవ్ మొదట మొహమాట పడ్డాడు. ప్రస్తుతం అంతకంటే తెలిసిన వారెవరూ లేనందున గత్యం తరం లేక సమ్మతించాడు.

సాయంకాలానికి రూము ఖాళీచేసి సామానును సుధీర్ రూముకు చేర్చాడు మాధవ్.

హాల్లో ఎవరైనా బిజినెస్ విషయాలుగాని, తక్కిన విషయాలుగాని మాట్లాడుతున్నప్పుడు తను రూములో కూర్చొనేవాడు ... ఆ చిన్న గార్డెన్ పూలమొక్కలవద్ద కూర్చుని కథలు వ్రాయటం ప్రారంభించాడు మాధవ్.

ప్రతి కథా నాయికిలో రాధ సున్నిత మనస్తత్వం, మమతానురాగం గురించి వ్రాసేవాడు. సున్నితమైన శైలి... భావయుక్తమైన అతడి రచనలు విరివిగా ప్రచురితమవు తున్నాయి.

అచ్చయిన కథలు చదువుతుంటే రాధ మనసు ఆనం దంతో ఉయ్యలలూగేది.

మాధవ్ వెళ్ళిన తరువాత ప్రయివేటు వాళ్ళను చాలించుకోమంటే "మీరు చెబితే బాగా అర్థమౌతుంది టీచర్ ! మీాకు తీరినంతవరకే చెప్పండి." అనేవాళ్ళు పిల్లలు.

క్షణం తీరిక లేక శ్రమపడేది రాధ. ఆమె శ్రమ మాధవ్ లేఖలో సేదదీరేది. ఆనాటి లెటర్ ఆమెను మరింత అలరించింది. ఎన్నిసార్లు చదువుకున్నా తనివితీరలేదు. మళ్ళీ చేతికి తీసుకొని చదవసాగింది రాధ.

"ఎన్నినాళ్లు నాకీ వియోగం? ప్రతి దృశ్యంలో నీ రూపే, ప్రతి ధ్వనిలో నీ స్వరమే. నీవు నాదాని వనుకున్నప్పటి నుంచి నిన్ను చూస్తూ వచ్చిన ప్రతి రూపం కనులముందు కదలాడుతూ కలవర పెడుతూంది. ఎప్పుడు నిన్ను కలుసుకొని నీ గాన లహరిలో తేలిపోదామా! నీ అనురాగ జలధిలో మునిగి పోదామా, నీ ప్రేమ ప్రవాహంలో కొట్టుకుపోదామా, నీ చూపుల వెలుగులో లీనమౌదామా, నీ వెచ్చని ఎదపై కరిగిపోదామా, నీ మధుర భాషణలోని మధువు జుర్రుకుందామా, అని పరితపించే నా మది, నీ సన్నిధిన సేదదీరాలని ఉవ్విళ్ళూరుతోంది.

సమాజం, మనుషులు అన్నీ త్యజించి మనమిద్దరం ఏ పర్వత శిఖరాలమీదనో విహరించాలని, ఆనందపుటంచుల వరకూ పయనించాలని, వీడని కౌగిలిలో ఇమిడిపోవాలని, నీ అధరామృతంతో దాహం తీర్చుకోవాలని, గాలిలో తేలుతూ, తారకల్ని తాకుతూ అలా అలా దూర తీరాలకు ఎగిరిపోవాలనీ, ఇంకా ఏదో ఏదో...

రాధా! ఈసారైనా నన్ను కరుణిస్తావా? నీవు అందంగా, ఆనందంగా అప్సరలా సాక్షాత్కరించాలి, అందుకే అంతగా శ్రమపడ వద్దంటున్నాను. నువ్వు ఎమ్. ఎ. కు చదవ

వద్దు. మనవి శరీరాలు. అవి శ్రమను ఓర్చలేక జబ్బున పడ వచ్చు. నేను అతి త్వరలో నెల్లూరు రావాలనుకుంటున్నాను. హైదరాబాద్ నీళ్ళు నాకు బాగా వంట బట్టాయి. చాలా లావయ్యాను. నన్ను చూసి నీవు కంట్రోలు తప్పవచ్చు. ఎలా నిగ్రహించుకుంటావో చూస్తాను.

మరొక ముఖ్య విషయం: గోపీ చదువుకు సుధీర్ అప్పిస్తానన్నాడు...నీవు కొన్ని ప్రయివేట్లు తగ్గించుకో. అంత కష్టపడక్కర్లేదు.

ఇంతే, ము...ద్దు...లు."

ఆ లేఖ హృదయానికి హత్తుకుంది. ఉత్తరంపై ముద్దుల వర్షం కురిపించింది. మాధవ్...నా మాధవ్ .. ఎన్ని సార్లు ఆ నామం జపించిందో అంతే లేదు. అంతకంటే ఆహ్లాదం కలిగిస్తూ తను ప్రత్యుత్తరం ఇవ్వాలనుకుని లెటర్ పాడ్ అందుకుంది.

పోస్టుమేన్ నుంచి కవరందుకొని చూచాడు సుధీర్. ముత్యాలకోవలాంటి చిరపరిచితమైన అక్షరాలు కవరుమీద అడ్రస్‌లో కనిపించాయి. అది మాధవ్ పేర తన కేరాఫ్‌లో వుంది.తన అనుమాన నివృత్తి కోసం కవరు చిరక్కుండా,చింపి కాగితం బయటకు తీసాడు. చదవసాగాడు.

"నా మాధవ్ !

నీ ప్రేమలేఖ అందింది. నీవు మగవాడివి. మనసు విప్పి చెప్పుకోగలవు. దేనికైనా సాహసించ గలవు. ఆడదానికి అన్నీ

ఆంక్షలు, కట్టుబాట్లు ఆ కంచెని దాటిరావాలంటే ఎన్నో కంటకాలు. నాకూ నీతో సహజీవనం గడపాలని ఆతృతిగానే వుంది. మాధవ్! నీ ఎదుట నోరు తెరచి చెప్పలేకపెన్నో మనసులో దాచుకున్నాను.

బండబారిపోయిన నా మనస్సుకు ప్రాణాన్ని పోసి, మోడులాంటి నా బ్రతుకులో ఆశలు చిగురింప జేసేవు. ఆనందమయమైన క్రొత్త జీవితాన్ని ప్రసాదించావు. మనో మందిరాన ప్రతిష్ఠింపబడ్డ నీవే నా ఆరాధ్య దైవానివి. నీ కల యిక పరమాత్ముడి వరప్రసాదం. మధువులు నింపుకున్న మన జీవితాలు కలకాలం పున్నమి వెన్నెలలుగా నిలిచిపోవాలి.

చూడు మాధవ్! నీ ధోరణి చూస్తే భయంగావుంది. సుమా! యిఎక కోర్కెలే అధికంగా వెలుపరిస్తున్నావు. మన బాధ్యతలు, కర్తవ్యం విస్మరిస్తున్నావు. మనవాళ్ళు మనకు వేసిన కంచెను బాధ తగలకుండా దాటాలి. బిగించిన వుచ్చుల్ని తిన్నగా తొలగించుకోవాలి, నెమ్మదిగా సడలించు కోవాలి. మొదట నా ప్రమేయం లేక జరిగిన వాటికే నేను విమర్శింపబడుతున్నాను. ఇప్పుడు తెలిసి మరొక పొరపాటు చేయలేను.

మరొక మాట, సుధీర్ స్నేహం ఎంత త్వరగా వదులు కుంటే అంత మంచిది. అతడిచేత అప్పు ఇప్పించుకోకు. వాళ్ళ నాన్నకు పొలాలు అడుమానం పెట్టించుకుని అప్పులివ్వడం రివాజు. వారి పొలం ప్రక్కనే మా మాగాణి. అది కాజేయ టానికిదో ఎత్తు కావచ్చు. అతడు తేనెబూసిన కత్తి, నివురు

గప్పిన నిశ్వం. నీవింకా సన్నిహితమైనావంటే నీ పతనం అంతు జూచేదాకా వదలడు. నీవు సింహాపు గుహాలో అడుగు పెట్టావు మాధవ్. నా మాట నమ్ము. నీకింకా అతణ్ని గురించి బాగా తెలీదు. నీవు వచ్చినప్పుడు వివరంగా చెప్తాను. ప్లీజ్! దయవుంచి అతడి స్నేహం వదలి, కబంధహస్తం నుండి బయటపడు. అంతకంటే ప్రస్తుతం వ్రాయలేను.

సదా నీ శ్రేయస్సు అభిలషించే
నీ రాధ."

ఉత్తరం చదువుతున్నంతసేపూ సుధీర్ పండ్లు నూరుతూనే వున్నాడు క్రోధంతో. శరీరం దహించి పోతూంది. పాత జ్ఞాపకాలేవో గుర్తుకురాగా సుధీర్ గుండెలలో అగ్ని జ్వాల ప్రజ్వరిల్లింది. విసం గ్రక్కే క్రోడైత్రాచులా తల విసురుకున్నాడు. మాధవ్ గ్రహించకుండా కవర్లో కాగితం వుంచి కవరు జాగ్రత్తగా మడిచి పెట్టాడు.

మాధవ్ వచ్చేసరికి తనకేం తెలీనట్టు తన కవర్లకంటే అడుగున వుంచాడా కవర్ని. మాధవ్ వుత్తరం చదువుతున్నంతసేపూ అతడి ముఖ కవళికల్ని గమనిస్తూనే వున్నాడు. రెండవ అంశం చదివేటప్పుడు మాధవ్ ముఖం రంగులు మారి, అయోమయంగా తయారైంది. ఏమీ తెలీనట్టు మరో ప్రక్కకు తిరిగి కూర్చున్నాడు సుధీర్.

# 26

జానకమ్మ ఆరోగ్యం బాగలేనందువల్ల సౌదకు సీమంతం చేసి తీసుకు రావడానికి రాధ వెళ్ళాల్సొచ్చింది. నివేదను వెంట తీసుకుని వెళ్ళింది. పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరిగాయి. గర్భవతిగా వున్నప్పుడు కలిగే సంతోషం సౌదలో కానరావడం లేదు.

"టానిక్ తీసుకున్నావా! పళ్ళరసం తీసుకున్నావా! నీకోసం కాకపోయినా మన బేబి బాగా పెరగాలి." అనే నిరంజనరావు హెచ్చరిక సౌద మీద కంటే బిడ్డమీద శ్రద్ధ ఎక్కువగా కనిపించడంతో రాధ మనస్సు కలుక్కుమనేది. ఆ యింట్లో ఆదరణ కంటే ఆడంబరం ఎక్కువగా కానరాసాగింది. సౌద నిర్లిప్తంగా పూటుగా పేలవంగా మెలగడం రాధ మనసును కలిచివేసింది. అక్కడి ఒక్కొక్కరిమాట వారి హోదాను, తమ లేమిని ఎత్తి చూపించినట్లయ్యేది.

తమ అంతస్తుకు మించిన సారె తీసుకెళ్ళింది రాధ. పూల జడతో, జరిపువ్వుల ఎర్రని పట్టుచీరతో, వంటి నిండా నగలతో, పువ్వుల మండపం మధ్యన కూర్చున్న చెల్లెలు లక్ష్మీదేవిని మరిపిస్తుంటే తృప్తిగా చూస్తూ కూర్చుంది రాధ.

"పుట్టింటి సారె ముందు పెట్టండి" అన్నదో ముత్తై

దువు. నంటకాల డబ్బాలు, పండ్ల బుట్టలు ఇచ్చినప్పుడు ఆమె అసంతృప్తిగా మూతి విరుస్తూ-

"అవేం చాల్తాయ్! అక్కడే వుంచు ... తెచ్చినట్టూ పెట్టినట్టూ" అంది అత్తగారు. ఎర్రని జరీ హంసల బార్డర్ కంచికట్టు తెల్లచీర తెచ్చి అక్కడుంచింది రాధ.

"అయ్యో! ఈ ముష్టిచీర కట్టుకుని అందర్లో ఎట్లా కూర్చుంటుంది? ముందుగా చూపించివుంటే మరొకటైనా తెప్పించే వాళ్ళంగా! అదెందుకు పెట్టెలో పెట్టుకోండి... బజారు నుంచి తెప్పిస్తాను" అంది అత్తగారు.

"ఈ సందర్భంలో పుట్టింటి వారిది పెట్టకుండా వుండ కూడదు. ఏదోవకటి తెచ్చిందే పెట్టండి" సమర్థించిందో కష్టసుఖాల తెలిసిన ఇల్లాలు.

కాస్త కుదుట పడింది రాధ గుండె.

గాజులు తొడిగే వేడుక సమయంలో తను చేయించి తెచ్చిన 'ప్లైన్' బంగారు గాజుల జత అక్కడుంచింది రాధ.

"రాళ్ళ గాజులా? ఎన్ని జతలూ? ఏవీ" అంటూ సాగదీసిందో రవ్వల నగలు దిగేసుకున్న కోటీశ్వరుని భార్య.

"అక్కర్లేండి. ఇవిగో, పట్టి బంగారువే అయినా ఒక్కటే... జత..." ఈసడింపుగా చేత్తో తీసుకుని జనం వైపు చూపింది- సౌద అత్తగారు సౌభాగ్యమ్మ.

సౌద అక్కవైపు జాలిగా చూచింది.

రాధ వదనం పాలిపోయి వుంది.

"మీ అమ్మగారు రాలేదేం?"

"హనీమూన్ !"

"మీ వారు, నీవు వచ్చారా ?"

"మీ వారే వూళ్ళో వుంటారు ?"

"మీవారికేం వుద్యోగం ?"

"ఇంకా పిల్లలు పుట్టలేదా ?"

ఒక్కొక్కరూ ఈవిల్లా ప్రశ్నిస్తుంటే సహనంగా చెప్పగలిగినంతవరకూ సమాధానాలిస్తూ ఇవ్వలేని వాటికి మౌనంగా వుండిపోయింది రాధ. కొందరు మెడకేసి చూడ సాగారు. చూచిన వాళ్ళను సంగతేమని సంజ్ఞ చేస్తున్నారు మరి కొందరు.

ఆ వాతావరణం భరించలేక హాల్లో నుంచి సౌద రూములో కెళ్ళింది రాధ.

"ఆ అమ్మాయినేం అడుగుతారు పాపం" అంటూ సౌద అత్తగారు సమయం కోసం వేచివున్న దానిలా చెప్పడం ప్రారంభించింది.

"ఆ అమ్మాయికి చిన్నప్పుడే పెండ్లయింది. అతడు తనకు ఇష్టం లేదన్నడట. అందుకని అతగాడికి పిచ్చి పట్టింది. పిచ్చాసుపత్రిలో వున్నాడట... ఈమె ఉద్యోగం చేస్తుంది." వ్యంగ్య ధోరణిలో చెప్పసాగింది.

"ఆడదాని అదృష్టం ఒక్కొక్కర్ని చేసుకున్న వేళ అధోగతి పాలౌతుంటాడు మొగవాడు."

"ఎంత మనసు పాడుగాకపోతే వున్మత్తుడౌతా డంటారు ?"

నా భర్త ... అతడు కాదు ... నాకు తెలిసి పెళ్ళి చేసుకోలేదు. పిచ్చిపట్టి ఆసుపత్రిలోలేడు. దురలవాట్లకు లోనై దేశ దిమ్మరిగా తిరుగుతున్నాడు!

నా భర్త మాధవ్! ... అని ఎలుగెత్తి చెప్పాలని, అందరిచేత వాళ్ళన్నది తప్పనని చెంపలేయించాలని, అనుకుంది. కాని చేయలేకపోయింది. సభ్యత అడ్డురాగా ... ఆ దావానలం తనలోనే ఇముడ్చుకుంది రాధ.

ఇంకా ఏమైనా వినాల్సొస్తే సహనం నశిస్తుందేమోనని భయంవేసి పెరట్లోకి వెళ్ళి తులసిచెట్టు అరుగుమీద కూర్చుంది మోకాళ్ళ మీద తల ఆన్చుకొని. ఆక్రోశం అంతా ఆవిరికాగా... నీళ్ళ రూపంలో కనులనుంచి ప్రవహించసాగింది.

బాత్‌రూం నుంచి వస్తున్న నిరంజనరావు అలా కూర్చున్న రాధను చూచి గతుక్కుమన్నాడు.

"ఏమండీ రాధగారూ? ఏమిటలా వున్నారు? మీకు సౌద లాంటి పరిస్థితి ఏర్పడలేదని బాధగా వుంది కదూ! మీరు కోరుకుంటే ... మీరు హి ... హి..." వెకిలిగా వినిపించింది అతడినవ్వు.

అతడి నిజరూపం బైటపడగా రాధ మనసు జుగుప్సతో నిండిపోయింది. తీవ్రంగా అతడివైపు చూస్తూ, "సార్, నిరంజనరావు గారు! మీరు అందర్నీ రంగు కళ్ళద్దాలతో చూస్తారు గనుక ఇతరులలో కల్మషం కనిపిస్తుంది. మాకు

కుచ్ఛితపు బుద్ధులు లేవు" అంది అసహ్యంగా చూస్తూ-విసురుగా.

"నాకేం తెలియదనా? బుకాయించకండి మేడమ్! ఎవరితో ఎలా మాట్లాడాలో నాకు బాగా తెలుసు" అంటూ అక్కడనుంచి హడావుడిగా వెళ్ళిపోయాడు.

నివేద వెంటరాగా సౌద చిన్నగా నడుచుకుంటూ అక్క సమీపానికొచ్చింది.

రాధను కౌగలించుకొని "నీవెందుకొచ్చావక్కా ఈ రాబందుల దగ్గరికి! ... నా కోసం వచ్చి ఎన్ని మాటలు తిన్నావక్కయ్యా! నాకు తప్పదు. నా వాళ్ళకు..." ఎవరో వస్తున్న అలికిడికాగా ఎవరికి వాళ్ళు సంభాషణ ఆపుచేశారు.

సౌద అత్తగారు-కన్నెళ్ళు వత్తుకుంటూన్న అక్కచెల్లెళ్ళను చూచి బుగ్గలు నొక్కుకుంటూ "మీ కష్ట సుఖాలు మీ ఇంటి దగ్గర చెప్పుకొని ఏడవాలి గాని నిండినింట్లో కంట తడిబెడతారా?"

వివేకంలేని మనిషితో మాటలెందుకని మౌనం వహించారు అక్కచెల్లెళ్ళు.

మరునాడు సౌదను తీసుకెళ్ళటానికి మంచిరోజు కాదన్నందువల్ల గత్యంతరంలేక ఆగవలసి వచ్చింది. రాధ ముళ్ళ మీద వున్నట్లు గడపసాగింది అక్కడ.

ఆ వూళ్ళోనే వున్న శారదమ్మగారింటికెళ్ళింది. అక్కడి విషయాల్ని మననం చేసుకోసాగింది రాధ.

ఝాన్సీ... తను నిలువుటద్దాల్లో ఒకేమారు కనిపించి

నవుడు... వెయ్యి క్యాండిల్సు బల్బు దగ్గర గుడ్డి దీపంలా వుంది తను. ఊర్వశిలా మెరిసిపోయే... ఝాన్సీని తన కిచ్చి నన్నప్పుడు మాధవ్ బాధపడాల్సిందిబోయి మామూలుగా వుండిపోయి... తన ఆకర్షణకు లోబడి ప్రేమించాడంటే అది తన అదృష్టమే !... అనుకుంటూ వుండగానే ఏదో తనను గురించిన సంభాషణ... ఆసక్తిగా వినసాగింది.

"టికెట్లు రిజర్వ్ చేయించాను. రెడీకావాలి మీ సిస్టర్స్. కాస్త ముందుగా వెళితే వూరు చూచినట్లుంటుంది" అది నిరంజనరావు గొంతుక.

"అక్కయ్యా, నివేదా మరెవ్వరితోనూ సినిమాకు రారండీ" అది సౌద స్వరం.

"ఏం, ఆ మాధవ్ గాడికంటే తీసిపొయ్యానా? మహా పతివ్రతలైనట్టు...నటన ..."

"ఉష్ .... అక్కయ్య వింటే బాధపడుతుందండీ! మీకు పుణ్యం వుంటుంది. కాస్త నెమ్మదిగా మాట్లాడండీ ప్లీజ్ !"

"చెయ్యగా లేంది అంటే వచ్చిందా? రేపు నువ్వు మాత్రం అక్కడికెళ్ళి వాడితో కులకవూ! సరే నువ్వాయినా వస్తావా? రావా?" అధికారం, ఆజ్ఞ ధ్వనించాయా పిలుపులో.

"రేవు ఊరికెళుతున్నా కదా! కాస్త సరదాగా గడుపుదామండీ. నాకు నడుం నొప్పిగా కూడా వుంది" అభ్యర్థించింది.

"టికెట్లు తీసి వుంచమని, వెళ్ళిపోతే నాకు 'షేక్' కదా!" అని ఏదో వాగాడు.

అతడి మొరటు మాటలు, ప్రవర్తనా నేరుగా చూడటం తరువాత చెల్లెలెందుకు బాధపడుతూందో బోధపడింది రాధకు.

# 27

రమణరావు-కాబోయే అల్లుడికి అమెరికా డబ్బు పంపాల్సి, కూతురు పెండ్లి ఘనంగా చెయ్యాలనే తలంపుతో బాగా లంచాలు తీసుకోవటం ప్రారంభించాడు. సైడు బిజినెస్‌గా భార్య పేర ఫర్నిచర్ షాపు నడుపుతూ వచ్చాడు... సి. ఐ. డీలు ఇన్‌ఫర్‌మేషన్ లాగి లంచం తీసుకున్నందుకు కేసు పెట్టినందువల్ల వుద్యోగం సస్పెండ్ చేసేరు. ఎటునుండి ఎటొచ్చినా మనోహర్ చదువుకు ఆటంకం రాకూడదని షాపు అమ్మేసి కొన్ని వేలు గోపాలరావు చేతికిచ్చాడు.

తనకుమాలిన ధర్మం పనికిరాదని "నీ విషమ పరిస్థితుల కంటే వాడి చదువు ఎక్కువేం కాదని నీ దగ్గరే వుంచుకో" మన్నాడు గోపాలరావు.

తనేమైనా తన కూతురికి పెట్టిన ఆశలు అడియాసలు కారాదని... అతడి పేర బ్యాంకిలో వేసుకోమని నిర్బంధించాడు రమణరావు.

అమెరికా నుంచి మనోహర్ వ్రాసే జాబుల్లో "నీవు

సరదాగా లెటర్లు రాస్తుంటే ఆ వుత్సాహంతో త్వరగా రిసెర్చి ముగించుకొని వస్తా" నని వ్రాసేవాడు. కొన్ని రోజులు బిడియంగా వున్నా క్రమేణా అతడితో దీటుగా వ్రాయగలి గేది యూస్సి. తను ప్రేమలేఖలు డ్రైండ్ చేసుకుంది. అతగాడు వ్రాసినదానికి సరైన జవాబో కాదో అని ఫెయిర్ చేసి ఆ లెటర్ వెంబడే పెట్టుకునేది. ఇంటి పరిస్థితులు తారుమారై మనసు వికలంగా వున్నందువల్ల ఆహ్లాదంగా వ్రాయలేక పోతోంది.

ఒకొక్కటీ ముందుంచుకొని చదవసాగింది.

"యూస్సీ!

ఇంత సిరికిదానివి నీకా పేరు తగదు సుమా! ఇక్కడి స్త్రీలను చూస్తుంటే కృత్రిమ అందం తప్ప అసలందం కనిపిం చదు. పాశ్చాత్య పద్ధతులు ముఖ్యంగా క్రమశిక్షణ, నీట్ నెస్, ఇండిపెండెంట్‌గా వుండడం. అలాటివే కొన్ని మంచి పద్ధతులు నేర్చుకోవలసినదే కాని విదేశాలకు వెళ్ళిరాగానే మన సంస్కృతి ఎందుకు విస్మరిస్తారో అర్థం కాదు. మన దేశంలో పాశ్చాత్య పద్ధతు లవలంబించే లేడీసంటే నాకిష్టం లేదు. అందుకే...నీ హిందూ సంప్రదాయక లక్షణాలు, అమాయకత్వం ముగ్ధమోహన సౌందర్యం నన్ను ఆకట్టు కున్నాయి. నువ్వు ఇక్కడికొస్తే మన సంప్రదాయ ప్రతీకవని చెప్పనవసరం వుండదు."

తనేం వ్రాసిందో వెదికింది.

"మనోహర్!

మీ నిమ్మళ్ళమ్మ స్వగ్గా సన్మానించింది. అక్కడి నాగరికత చూస్తూ కూడా నా సనాతన అలంకరణ మెచ్చు కున్నారంటే... నేనెంతో ధన్యురాల్ని."

నాన్నగారు పైకి రాగానే లెటర్లన్నీ సర్ది, లేచి నిలుచుంది.

# 28

మాధవ్ హైదరాబాద్ నుండి వచ్చాడని తెలిసిన నాడే. .నొప్పులు పడుతున్నందువలన హాస్పిటల్‌కు తీసు కెళ్ళింది రాధ. కొంచెం కష్టమైన కాన్పు కాబట్టి ఆ సమ యంలో మాధవ్ రాకను గమనించలేకపోయేది. హాస్పిటల్ కొచ్చినపుడు ముక్తసరిగా సమాధానం ఇచ్చేది తనివి తీరా మాట్లాడాలని ఎంత ఉత్సాహం వున్నా సమయం దొరికేది కాదు. ప్రసవించిందని టెలిగ్రాం ఇవ్వగానే నిరంజనరావు వచ్చి ఆ వూర్లో వుండిపోయిన కారణంగా అతడి మనసు తెలుసు గనుక అతడెదుట మాధవ్‌తో మాట్లాడటానికి జంకేది.

నిరంజనరావు రాగానే ముందు బిడ్డ ఎవరి పోలికో చూచుకున్నాడు. మగపిల్లవాడు కానందుకు కొంచెం కష్టపడినా అచ్చం సొంత పోలికలతో బొద్దుగా, ముద్దుగా వున్న పాపను జూచి తృప్తిపడ్డాడు.

మాధవ్ రాధ సమీపానికి రానందుకు బాధపడినా

తన ముఖం వంక పరిశీలించి తను సిగరెట్లు త్రాగుతున్నట్టు పసిగట్టనందుకు సంతోషించాడు.

'తను తాకకూడదని ఆంక్షలు పెట్టినా హాయిగా కొంతసేపు మాట్లాడుతుంది కదా' అనుకుంటే అదిలేకపోగా శుభ్రంగా మంచి చీరయినా కట్టుకుని ఎదుట పడలేదు. నిరుత్సాహం, నిస్పృహ ఆవరించాయి మాధవ్‌కు. గుంటూరు వెళ్ళేనాడు...ఇంటికెళితే రాధ అక్కడ లేకపోయే సరికి ఆసుపత్రికి వచ్చాడు.

అప్పుడే పాపకు పౌడర్ అద్దుతూ కనిపించింది...పసి పాప సేవలో స్త్రీ ఎంత ఆనందాన్ని అనుభవిస్తుందో మొదటిసారిగా రాధలో మాతృమూర్తిని చూచాడు మాధవ్.

"రా, మాధవ్! నీవు వస్తే ఏకంగా నీ వున్నన్ని రోజులూ స్కూలుకు శెలవుపెట్టి, ప్రయివేటు పిల్లలకు శెలవులిచ్చి, నీతోనే గడపాలనుకున్నాను." పశ్చాత్తాపంగా వుందా ధోరణి. మన్నించమనే ప్రార్థనుందా చూపులో. పాపను సొద ప్రక్క ఉయ్యాల్లో వుంచి వరండాలో కొచ్చి నిలుచుంది.

"ఎంతో ఆశతో వచ్చిన నేను అసంతృప్తిగా వెళు తున్నాను. ఈసారి అన్నీ వదలి నాతో గడుపుతావను కున్నాను. అవున్లే, నీకు మాతో ఏం పనీ, చెల్లెలి సంతానాన్ని చూచుకొని... శేష జీవితం గడుపుతావు" తమాషాగా రాధ వైపు చూస్తూ అన్నాడు.

"ఓ...హో...హో...అదా! అవునవును. సాక్షాత్తూ నీ పెళ్ళి జరిగిన సందర్భంలో అన్నాను కదూ! ఈసారి నిన్ను నిస్పృహతో పంపుతున్నాను." జాలిగా చూచింది. గొంతు గాఢంగా ధ్వనించింది.

"ప్రస్తుతం నాకు హక్కున్న నీ వ్రేళ్ళనైనా ఇలా ఇవ్వు....తలమీద చెయ్యి వెయ్యటానికైనా అవకాశం లేదు. ఇక్కడందరూ తిరుగుతున్నారు." వరండా అడ్డ గోడపై ఉంచిన రాధ చేతి వ్రేళ్ళను మృదువుగా నొక్కాడు. అతడి నేత్రాల్లోనికి నిశితంగా చూస్తూ, ఆ చేతిమీద తన చెయ్యి వేసి ఆప్యాయంగా నిమిరింది.

"అలా చూడకు రాధా. నేను పిచ్చివాణ్ణయిపోతాను. చెంప పెట్టు తినాల్సివస్తుంది" అన్నాడు చెంప నిమురుకుంటూ. చిలిపిగా, ఇరువురి కళ్ళు ఎన్నో ఆశల్ని నింపుకుంటూ కొన్ని నిముషాలు గడిచిపోయాయి.

ట్రైను టైమయిందంటూ మాధవ్ చిన్నతమ్ముడు రవి రాగానే, వెనక్కు తిరిగి రాధ వైపు పదే పదే చూస్తూ ముందుకుసాగాడు.

కనుచూపు అందినంత వరకు అలాగే చూస్తూ వుండిపోయింది రాధ —భారమైన మనస్సుతో.

సౌద కూతురు బారసాలనాటికి శ్రీధర్ కూడా వచ్చాడు. కార్యక్రమం ముగిసి చుట్టాలంతా వూరి కెళ్ళగానే అన్నతో బాస్కా వేసుకుకూర్చున్నారు-సౌద, రాధ.

అక్కడి ప్రాముఖ్యమైన ప్రదేశాలు, మైసూరు గురించి అన్నీ చెప్పేటప్పుడు "బృందావన్ గార్డెన్‌కు జోత్స్న, కిరణ నన్ను వేధించి తీసుకెళ్ళారు" అన్నాడు అదోక రకమైన సంతోషాన్ని ప్రకటిస్తూ.

"అది సరే, ఇద్దర్లో ఎవరు మా వదినౌతుందో నిర్ణయించుకున్నావా ?" ఆతృతగా అడిగింది రాధ.

"చెప్పన్నయ్యా" తొందరచేసింది సౌద.

"నన్నో అమ్మాయి ఆకట్టుకుంది. నన్నింకో అమ్మాయి ఆరాధిస్తోంది. ఎవర్ని కాదనాలో అర్థం కావటంలేదు. నీవే ఈ జటిల సమస్య పరిష్కరించాలి."

"నీవు కోరే అమ్మాయిని చేసుకుంటే నీ మనసు తృప్తిగా వుంటుంది. నిన్ను అభిలషించే అమ్మాయి అయితే నిన్ను అపురూపంగా చూచుకుంటుంది. గనుక నీ జీవితం స్వర్గధామం అవుతుంది. ఇంకా కొంతకాలం వ్యవధి వుంది గనుక వాళ్ళ మనసు బాగా తెలుసుకోవచ్చు..."

"అయితే ఆ భారం నా మీదనే మోపేవన్నమాట!... అందరి పెళ్ళిళ్ళకోసం తాపత్రయపడే నీవు...ఇంకా లేట్ చేసుకోవట మెందుకమ్మా ?"

"అంటే నీకు..."

"అంతా తెలుసు రాధా!...నీకా రోజు మాధవ్

డాలర్ ఇవ్వటం...నువ్వు..." ఆమె ముఖంవైపు సాదరంగా చూచి చిర్నవ్వు నవ్వేడు.

లజ్జా భారంతో క్రిందికి చూస్తూ చిరుకోపం నటిస్తూ, "అయితే నీ అభిప్రాయం చెప్పవిదెందుకో...." అంది.

"అదా! సమయం కోసం వేచివున్నాను... అంటే" సౌదవైపు బిడియంగా చూచింది, ఏదో తప్పు చేసిన దానిలా. చెప్పమన్నట్లు సైగ చేశాడు శ్రీధర్ చిర్నవ్వుతో.

"అక్కయ్యా! ఆరోజు నేను వద్దన్నానని కోప్పడ్డావు కదూ! కారణం చెప్పనా ? నాకు పెండ్లి స్థిరకరచుకోడానికి ముందు—మాధవ్‌కు నీకు జరిగిన సంభాషణ విన్నాను. అంటే... నిన్ను మాధవ్ ప్రేమిస్తున్నట్లు గ్రహించాను. నీకలాంటి అవకాశాన్ని పోగొట్టడమెందుకని నీకు వివరించే సాహసం లేక... పరోక్షంగా నీకు సహకరిద్దామనుకున్నాను."

"నా కోసం... అంత మంచి మాధవ్‌ను వదులుకొని ఇవుడీ నీచుడిచేత" రాధ కనులో నీటిపొరలు కదలాడగా అమాంతం చెల్లెలి బుజాలు పట్టుకొని శిరస్సున ముద్దెట్టుకుంది. రాధ కన్నీటి బిందువులు సౌద తలను తడిపాయి. రాధ గుండెల్లో తలదాచుకొని "త్యాగం... నీ దగ్గర్నే నేర్చుకున్నానక్కా" అంది సౌద, రాధ చేతులు తన చుట్టూ పెన వేసుకుంటూ.

ఇద్దరి చెల్లెళ్ళ అనురాగం చూచి శ్రీధర్ మనసు హర్ష పులకితమైంది.

కొంతసేపు పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నంతలో ఉయ్యాల్లో పాప ఏడవగా లేచిపోయింది సౌద.

మాటల సందర్భంలో అక్కడి నౌకరి గురించి మాట్లాడుతూ—"మిషన్స్ పని చెయించేటప్పుడు ఒక్కోసారి ప్రమాదం జరుగుతుంది. అలా జరిగి మరణిస్తే... నేను లేను గదా అని నా ప్రమాణం వుపసంహరించుకోవద్దు. ఏ సందర్భంలోనూ నా కోసం కాకపోయినా దేనికైతే ప్రపంచానికి వుపయోగపడతావో అంతవరకు వుపయోగపడు. అదే నాకు ఆత్మశాంతినిస్తుంది."

"అన్నయ్యా!" అని గబుక్కున వెళ్ళి నోరు మూసింది రాధ.

"ఏవిట్రా అపభ్రంశంపు మాటలు! చావులూ నీవునూ! నా పెద్దతనంలో నీవు చేసే ఘనకార్యం ఇదా! ఎదిగిన పిల్లలు పోతే ఏ తల్లిదండ్రులైన బ్రతికుంటారట్రా!..." రాఘవయ్య గొంతు గాద్గదికమైంది.

"నాన్నా! మీరు మాత్రం ఎందుకు నాన్నా అలా అనుకోవటం! నాకెందుకో భయంగా వుంది. అలా అనకండి మీరిద్దరూ!" తండ్రి చేతులు గట్టిగా పట్టుకుంది రాధ.

"పిచ్చితల్లీ... మాటవరసకు అనుకోగానే అంత భయమయితే..."

"మీకంతా స్వర్గద్వారాలు తెరిచున్నాయి. పోవాలనుకుంటున్నారు. నేనొక్కదాన్ని శిలగొట్టుకుని వుంటాను"

వాళ్ళలా అనుకుంటున్నందుకు రాధ నవ్వుతూ అలాంటి మాట లతో మందలించింది జానకిని.

శ్రీధర్ వూరికెళుతుంటే ఈసారి అందరికీ వెలితి బాధ కలిగింది.

# 29

సుధీర్ తన ఫ్రెండ్స్‌తో జాలీగా గడుపుతుంటే, మాధవ్ రూములో కూర్చొని చూచేవాడు. వాళ్ళు కొందరు నిర్బంధించి క్యారంబోర్డు ముందో, పేక ముందో కూచో బెట్టేవారు. తానొక్కడూ అందరికీ జవాబు చెప్ప లేక తన కిష్టంలేని పనైనా... ఆట దగ్గర కూర్చునేవాడు. మొదట సిగరెట్ వాసన కూడా గిట్టనివాడు– చలికి హాయిగా వుంటుంది; త్రాగమంటే... నోట్లో పెట్టుకోడానికి భయపడే వాడు. గాలి పీల్చి ఆ పొగకు వుక్కిరి బిక్కిరై వాంతి చేసు కునేవాడు. అందరూ గేలిచేస్తుంటే రోషంతో నిబ్బరించు కొని సిగరెట్ త్రాగటం నేర్చుకున్నాడు. ఇప్పుడు జల్సాగా త్రాగుతున్నాడు. అదే నెల్లూరు వచ్చినప్పుడు రాధ కను క్కొని మందలిస్తుందని బెదిరాడు.

ఓవరు వర్కు వుంటే చేసి వచ్చినా ప్రొద్దు గడిచేది కాదు. అక్కడ వాళ్ళు తెచ్చుకున్న పాకెట్‌సైజు పుస్త కాలు, డిటెక్టివ్‌లు, సెక్సు పుస్తకాలు కాలక్షేపానికి చదివే వాడు మొదట. కాలక్షేపం సంగతి పోయి అవే నిక్షేప మైనాయి. చదవందిగాని, సిగరెట్ కాల్చందిగాని, ఒకటో

అర్ధ పేకాటలు క్యారంబోర్డుగాని ఆడకపోతే తోచక వెర్రెక్కినంత పనయ్యేది. హైదరాబాద్ వచ్చిన క్రొత్తలో కథలుగాని, రాధకు లెటర్లుగాని వ్రాయటం తగ్గించి వేశాడు. ఆటల ధ్యాసలో పడి అన్నీ విస్మరించే స్థితి ఏర్పడింది. సెక్సు పుస్తకాల మహిమో, యవ్వనోత్సాహం తెచ్చే మార్పో.. తనకో స్త్రీ కావాలనిపించేది. ఎంత త్వరగా పెండ్లి చేసుకొని రాధను తెచ్చుకోవాలన్నా, ఏదో ఆటంకాలు వస్తున్నాయి మాధవుకు. రెండు మూడు జవాబులు రాధ రాస్తే తను ఒకటే వ్రాస్తున్నాడు. వాటిల్లో... జీవితం సుఖపడాలంటే హాబీలు అవసరం అని.. సంసార బాధ్యతలు నెత్తినేసుకుంటే సరదా జీవితం జరగదనే భావన వచ్చేలా... వ్రాస్తున్నాడు. అవి చదివినప్పుడు రాధ ఎందుకో కలవరపడేది.

అతడి మీద పరిస్థితులు, మాటలు పనిచేస్తాయని వాటి ఆకర్షణకు లొంగుతాడని, ఆమెకు తెలుసు. అందుకే హెచ్చరిస్తూ వ్రాస్తుంటుంది. రాధ హెచ్చరికలు వెన్ను తట్టగా ఈ సుధీర్ బృందం నుంచి తప్పించుకోవాలనుకుంటాడు. తనకు ఈ మహా నగరంలో తెలిసినవాళ్ళు లేక, ఒంటరి జీవితం గడపలేక ఈ సాలెగూట్లో చిక్కుకున్నాడు. అప్పుడప్పుడు తను తప్పుదార్న పడుతున్నానని బాధ పడేవాడు.

మాధవ్‌కు రమణరావు చనిపోయినట్టు టెలిగ్రాం వచ్చింది. గుంటూరు వెళ్ళాడు.

నౌకరీ 'డిస్మిస్' చేసారనే వార్త విన్న రోజు రోడ్డు

మీద వేగంగా నడుస్తూ వస్తున్న వాహనం... లారీ మీద నుంచి పడిపోగా హాస్పిటల్లో చేర్చిన కొన్ని గంటలకే రమణారావు ప్రాణం పోయినట్లు విన్నాడు మాధవ్.

సోమశేఖరం, వైదేహమ్మ అప్పటికే వచ్చి వున్నారు. స్కూలుకు శలవు పెట్టించి రవిని కూడా వెంట తీసుకొచ్చారు.

గోపాలరావుగారి కుటుంబం ఎంతో సహాయంగా అన్నిట్లో పాల్గొని శారదమ్మనూ, ఝాన్సీని ఓదార్చేవాళ్ళు. అనిల్ తండ్రి కోసం ఎంతో దిగులుపడి అన్నం నీళ్ళు ముట్టక పోతే రవి బ్రతిమాలి తినిపించేవాడు. ఝాన్సీ పడకమీంచి నుంచి లేచేది గాదు. శారదమ్మ శోకానికి అంతేలేదు.

మాధవ్ క్యాజువల్ లీవ్ పెట్టి వచ్చాడు.

ఎన్నిరోజులు వీలైతే అన్నిరోజులు శలవుపెట్టి మళ్ళీ రమ్మన్నారు. రమణారావుకు ఆఫీసు తరఫున రావలసిన డబ్బు విషయాలు కనుక్కోవడానికి రమ్మన్నాడు సోమశేఖరం.

గుంటూరు వెళ్ళి మరికొన్ని రోజులు శలవు తీసుకొని వచ్చాడు మాధవ్. కర్మకాండలు ముగిశాయి. బొట్టులేని చెల్లెలి ముఖం చూడలేక పోయాడు సోమశేఖరం.

చిన్నప్పటి నుంచి తన దగ్గరుంచుకున్న మమకారంవల్ల శారదమ్మ కష్టాలు తనవిగా భావించి బ్రాధేయపడి ఆమెను ఓదార్చేది వైదేహమ్మ. పగలు- రావలసిన డబ్బు కోసం తిరగటం... సాయంకాలాలు ఝాన్సీ దిగులు మాసిపోవటం కోసం ఏవో విషయాలు చెపుతూ మరపించడంతో మాధవ్‌కు

సరిపోలేదు. ఝాన్సీతో సన్నిహితంగా వున్నప్పుడు ఆమె ఒంపుసొంపులు గమనించేవాడు. ఎన్నో పుస్తకాల ప్రభావం తనమీద పని చేస్తున్నందుకు వెంటనే పొరపాటు సర్దుకునే వాడు. ఝాన్సీ ఇవేం గమనించేదికాదు. తను బంధువు ... చిన్నప్పటి నుంచి తెలిసిన బావ; విచారం పోగొట్టటానికి తనను పలకరించి మనిషిని చేస్తున్నాడు అనుకునేది. కృతజ్ఞతా భావం మాత్రమే వుండేది. ఆ చనువును వుపయోగించుకొని చాలా దగ్గిరికి రావటానికి ప్రయత్నించేవాడు ... రాధతో చనువుగా ప్రవర్తించబోయిన సంఘటన గుర్తుకొచ్చి ఆమెకు చేసిన వాగ్దానాలు జ్ఞాపకానికొచ్చి... కళ తెలుసుకునేవాడు. రాధ చురుకైన కళ్ళతో మమత నిండిన వదనంతో తనకోసం చేతులు చాపుతున్నట్టు కనిపించగా ఝాన్సీ అమాయిక లేడి కళ్ళకేసి చూచి నిగ్రహించుకునేవాడు. ఉద్యోగంలో రమణా రావును డిస్మిస్ చేసిన కారణంగా కొంత గందరగోళం జరిగి నందువల్ల... అనుకున్న డబ్బు చేతికి రాలేదు. ప్రావిడెంట్ ఫండులో కొంత ముందుగానే అప్పు తీసుకున్నందున ... ఎంతో డబ్బు కొరవ పడింది. వచ్చిన డబ్బుకంటే బాకీల వాళ్ళు ఎక్కువైనారు.

"మనం ఒకరి రుణాన పోయినామనే పేరుండకూడదు. ఎవ్వరికి ఎంతివ్వాలో పైసలతో సహా ఇచ్చివేయ"మంది శారదమ్మ.

ఇల్లు అమ్మితేనేగాని సరిపోనంత బాకీ కొరవ పడింది.

కొన్ని పన్లు ముగించి మరోమారు వస్తానని చెప్పి హైదరా బాద్ వెళ్ళాడు మాధవ్.

అక్కడి నుంచి వచ్చిన వెంటనే జాబులకోసం అడి గాడు. రాధ వ్రాసినవేం లేవు.

తను జాప్యం చేసినా వెంటవెంటనే ఉత్తరాలు వ్రాసే రాధ ఎందుకు ఆలస్యం చేసిందబ్బా...అని ఆశ్చర్యపోయాడు మాధవ్. ఈసారి జాబులో రాధ డబ్బుకోసం శ్రమపడి ప్రయివేట్ పిల్లల్ని ఎక్కువ పెట్టుకోవద్దని తన వాళ్ళకు ఇష్టం లేకపోయినా తాము రిజిష్టర్డ్ మ్యారేజ్ అయినా చేసుకొని ఒకచోట గడపాలని ఖచ్చితంగా వ్రాసేయాలి... తమ జంట ఆదర్శప్రాయం కావాలి. మనసులో మననం చేసుకుంటూ బ్యాంకి కెళ్ళాడు.

## 30

పాపను అత్తగారింట్లో వదలి రావాలని ఆమెను పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి. చలిమిడి, చక్రాలు తయారుచేస్తున్నది జానకమ్మ. రాధ బజారు కెళ్ళి పాపకు రెడీమేడ్ గౌన్లు, సౌదకు చీరెలు తెచ్చింది. పాపను ముద్దాడుతూ, "నివ్వు వెళ్ళిపోతావ్ కదే, మాకేం తోస్తుంది చెప్పు ? ఇక్కడే వుండిపో నీతో ఆడుకుంటా..." అన్నది రాధ.

"స్కూలుకు వెళ్ళకుండా ప్రయివేట్లు చెప్పకుండా హైదరాబాద్‌కు లేఖలు వ్రాయకుండా..." అన్నది సౌద అక్క ముఖంలోకి చిర్నవ్వుతో చూస్తూ.

"నీవన్నది నిజమేనే... కసితో గడుపుతుంటే అన్నాహారాలు కూడా పట్టవనుకో. చిన్నప్పుడు నువ్వూ అచ్చు ఇలాగే వుండేదానివి..." అంటూ ఒక చెయ్యి పాపబుగ్గ మీద రాస్తూ రెండో చేత్తో చెల్లి బుగ్గ మీటింది.

పాప కేరింతలతో అక్కా చెల్లెళ్ళు నవ్వుకుంటుండగా, టాక్సీ హారన్ మ్రోత వినిపించింది. నివేదను వెళ్ళి చూసి రమ్మంది రాధ.

గుమ్మం దగ్గరికి వెళ్ళిన నివేద పెద్దగా ఏడుస్తూ లోపలి కొచ్చింది. అందరూ ఖంగారుగా వాకిలివైపు పరుగు తీసారు.

టాక్సీలో నుంచి యిద్దరమ్మాయిలు విషాద భరిత వదనాలతో నలిగిన బట్టలతో దిగారు. వారి వెంట శ్రీధర్ శరీరాన్ని టాక్సీ డ్రైవరు, మరో యిద్దరూ లోపలికి తీసుకొచ్చారు.

ఆ దృశ్యం చూచి ఇంటిల్లపాది దిగ్భ్రమ చెంది నోట మాటరాక శిలావిగ్రహాల్లా నిలిచిపోయారు.

రాఘవయ్య, "మావాడికేమయింది, నాయనా" అంటూ శ్రీధర్ చెయ్యిపట్టి చూచి "శ్రీ... ధ.. ర్" అంటూ వెర్రికేక బెట్టి విరుచుక పడిపోయాడు. శ్రీధర్ దగ్గరకు ఎవరు వెళ్ళాలి? తండ్రి దగ్గరకు ఎవరు వెళ్ళాలనేది

తెలీక... పిచ్చిగా [illegible] [illegible] తిరగసాగాడు — ఇంట్లో [illegible]

[illegible] హృదయవిదారకంగా ఘోషిస్తున్నా రెండో అమ్మాయి రాఘవయ్యకు ఉపచారాలు చెయ్యసాగింది.

దుఃఖాతిరేకంతో శ్రీధర్‌కేమైందో ఎవరూ అడగలేకపోయారు.

రాధ గుండె దిటవు చేసుకొని అడిగింది. "అన్నయ్యకేమైందండీ" అని.

"నిన్నటిరోజు మిల్లులో మిషన్ను బాగు చేస్తుండగా అక్కడెవరితోనో మాట్లాడుతూ ... అటువైపు వస్తున్న శ్రీధర్‌గారిపై మిషన్‌లో కొన్ని పార్ట్సు ఊడి, విసురుగా శ్రీధర్‌గారిపై పడ్డంతో గుండెకు బలమైన దెబ్బ తగిలింది. మరొకటి వీపుకు తగిలి రక్తం చిమ్మింది. వెంటనే స్పృహ కోల్పోయారు. అప్పుడే మీకు వైరిద్దామనుకున్నాం గాని, రక్తం ఎక్కించాలంటే సమయానికి లేక మా చిన్న అమ్మాయి రక్తం సూటైతే ఎక్కిస్తుండగానే ... ప్రా...ణం..." చెప్పలేక ఆగిపోయాడు మిల్లుమేనేజరు.

రాధ కిరణకేసి చూచింది. సర్వం కోల్పోయి విషాదం గూడుకట్టుకున్న శోకదేవతలా... శ్రీధర్ మృత కళేబరంవైపు గాజుకళ్ళతో చూస్తూ కూర్చుంది. అంతటివిచారంలో కిరణ-శ్రీధర్‌ని ఎంతగా ఆరాధించేదో అవగతం చేసుకుంది రాధ.

జానకమ్మ కంటికి మింటికి ఏకధారగా ఏడవటం తప్ప

పల్లెత్తి ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది. ఆమె దుఃఖ సముద్రంలో మునిగిపోయింది. ఎంతో బాధను అనుభవిస్తూకూడా రాధ అందరికీ సమాధానాలు చెప్పడం, జరగవలసినవి చేయించడంలో పాల్గొనక తప్పలేదు.

శ్రీధర్ దహన సంస్కారాలు అయినప్పటికీ రాఘవయ్య స్థితి విషమంగా వున్నందున సోమశేఖరం దంపతులు అక్కడే వుండి అందరికీ అన్నాహారాల ఏర్పాటుచేసి అందర్నీ బ్రతిమిలాడి కాస్త ఆహారం తినిపిస్తూ, ధైర్యం చెపుతూ వున్నారు.

శ్రీధర్ మరణానికి వో ప్రక్క దుఃఖిస్తూనే చావు బ్రతుకుల్లో వున్న రాఘవయ్యకు ఉపచర్యలు చేస్తూ మందులిస్తున్నారు.

కొంత సద్దుమణిగిన తరువాత రాఘవయ్యకు తెలివొచ్చి రాధను, భార్యను తన దగ్గరకు పిలిచాడు.

"అమ్మా! రాధా! నేనూ... వాడితో పోతున్నానమ్మా! మీ అమ్మను కనిపెట్టివుండు తల్లీ! తమ్ముడి మీద మమకారం... చిన్నప్పటినుంచి చెలాయించిన అధికారం దాన్నట్లా చేశాయిగాని మనసు మంచిదే. మనమే ద్వేషిస్తే... అదెక్కడికి పోతుంది... నిన్ను బాధిస్తూ..."

"నాన్నా నీవూ దూరమై, అన్నయ్యా లేక నేనెలా బ్రతికేది నాన్నా! కళ్ళలాగ కాపాడిన మీరిద్దరూ లేక నన్ను కబోదినిచేసి... నా కాళ్ళకు బంధాలు బిగించి జీవించ

మంటారా... నాన్నా!" దుఃఖోద్వేగంతో గొంతు పూడుక పోయింది రాధకు.

"అమ్మను బాగా చూచుకుంటానని మాటివ్వు తల్లీ! నేను తృప్తిగా కళ్ళుమూస్తా...ను." కంపించే హస్తాన్ని ముందుకు చాచాడు.

పెల్లుబికే ఏడ్పును అణచుకుంటూ నోట్లో పమిట చెరుగు తురుముకొని "అలాగే నాన్నా!" అంటూ అతడి రెండు చేతుల్లో తన చేతిని వుంచింది.

"దాన్ని వేధించనని మాటివ్వవే! మన చీకటి సంసారానికి వెలుగు నిచ్చే జ్యోతి అది. ఏదీ... చెప్పు, కష్ట పెట్టవు కదూ"...... భార్య కనుల్లోకి దైన్యంగా చూస్తూ అభ్యర్థన పూర్వకంగా అడిగాడు వణికే కంఠంతో.

హృదయ విదారకంగా ఏడ్చింది — సమాధానంగా జానకమ్మ.

"నువ్వు, నువ్వు రా... క్ష... సి... వే" అన్నాడు ఆవేశంగా.

ఇంతలో గుండెనొప్పి రాగా గుండెను రాసుకుంటూ గిలగిల్లాడి స్పృహ తప్పిపోయాడు. మళ్ళీ తెలివి రాలేదు. అంతే! ఆఖరు శ్వాస వదిలాడు.

ఆ హఠాత్పరిణామానికి జానకమ్మ దిగ్భ్రమ చెందింది. మరో ఘాతం తగిలింది ఆ కుటుంబానికి!

రాఘవయ్య మృతకళేబరం మీద పడి శోకాలు పెట్టి ఏడవసాగింది జానకమ్మ.

"దేముడా! ఎంత దయలేని వాడివయ్యా! తమ్ముణ్ణి దూరం చేసింది గాక చెట్టంత కొడుకును తీసుకపోయి నా కడుపులో చిచ్చు పెట్టావు. నెత్తిమీద గొడుగు వంటి భర్తను పొట్టన బెట్టుకొని నన్నెందుకు బ్రతికించావయ్యా!" అని గోడు గోడున రోదిస్తుంటే ఎవరూ వోదార్చ లేక పోయినారు. 'ఎవరికీ అలాంటి విషమ పరిస్థితి కలగరాదు' అనుకునేలా వుంది ఆ వాతావరణం.

తండ్రికి కర్మకాండలు చేయవలసిన కొడుకు ముందుగానే చితిలో కాలుతున్నాడు. అది ఆరక ముందే తండ్రి చితి అంటుకుంది !

ఆనాడు శ్రీధర్ 'మిషన్స్‌లో ప్రమాదాలు అధికం. ఏ సందర్భంలోనైనా నేను చనిపోతే...' అన్న మాటలూ; 'ఎదిగినబిడ్డలు పోతే ఏ తల్లి దండ్రులు జీవించి వుండగల్రా' అన్న తండ్రి మాటలు తలచుకొని గుండెలవిసేలా విలపించ సాగారు అక్క చెల్లెళ్ళు.

భర్తను, ఎదిగిన కొడుకును కోల్పోయిన తల్లి బాధను రెట్టింపు చెయ్యకూడదనే అభిప్రాయంతో, తనకంటే చిన్నవాళ్ళ దిగులు తగ్గించాలనే వుద్దేశంతో తన దుఃఖాన్ని అణుచుకొని నిగ్రహంతో మసలసాగింది రాధ. జరగ వలసిన క్రతువులు... సక్రమంగా నెరవేర్చడానికి ఎంతో నిబ్బరించుకొని తిరిగిన రాధ... తండ్రి శవం తరలించగానే చలన రహితంగా పడిపోయింది. ఆమెదొక విషమ పరిస్థితి. అందరి కోసం తన దుఃఖాన్ని గాని, సంతోషాన్ని గాని పైకి అనుభ

వించకూడదు. [illegible] రాధ ఓ పట్టు కొమ్మ. [illegible] రావు. చలించకూడదు.

ఆ పరిస్థితిలో వెళ్ళలేను అనీ...ఎన్నో ధైర్యవచనాలు గరిపి ఉద్యోగధర్మం కోసం రాధతో వెళ్ళారు శ్రీధర్ మిల్లు మేనేజరు.

'శెలవు లేదు గనుక నాలుగు రోజులుండి కాస్త వాళ్ళు కోలుకోగానే' రమ్మని కూతుళ్ళతో చెప్పి వెళ్ళారు మేనేజరు.

జోత్స్న, కిరణ వూరికి ప్రయాణమైనారు.

"మీకు మా వల్ల ఏ సహాయం కావాలన్నా తెల్పండి" అన్నారు అక్క చెల్లెళ్ళు.

"ఇంకా మాకేం కావాలి!...మీలో ఒకరు మా ఇంటి కోడలుగా వస్తారని ఆశించాము. కాని అన్నయ్యతో పసుపు గుడ్డలతో గాక...రక్తపు గుడ్డలతో ...." దుఃఖాతిరేకంతో గొంతు బిగుసుకుపోయింది రాధకు.

"శ్రీధర్ గారు నేను కాలేజీనుంచి రావటం ఆలస్యమైతే కారు తీసుకొని నేరుగా వచ్చేవారు...అతనీ...అభిమానానికి ఆశ్చర్యం కలిగేది నాకు..." కన్నీటి చక్రాలు గిర్రున తిరిగాయి జోత్స్నకు.

"మీ పెళ్ళికి పిలవటం మరవకండి...అన్నయ్య తరపున నేను ... ఆశీర్వదించాలి ..." అంది రాధ విషాదంగా నవ్వుతూ.

జ్యోత్స్న మౌనంగా వుండిపోయింది.

"మీరు రావలసిన పనిలేదు. అక్కడికి మీరు రాలేరు. నేనెంత అర్జంటుగా వెళ్ళితే, అంత అర్జంటుగా స్వర్గంలోనే మా పెళ్ళి..." రుమాలు నోట్లో కుక్కుకుంది కిరణ.

"అంత మాటనకండి కిరణా, మీ జీవితం వృథా చేసుకోకండి. అన్నయ్యకు ఆత్మశాంతుండదు సుమా!"

"హూఁ..." దీర్ఘ నిశ్వాస వదిలింది కిరణ.

# 31

వంగదిక్కులేని కొంపగా తయారైంది — రాఘవయ్యగారిల్లు. శ్రీధర్ వరండాలో కూర్చుని ప్రయివేటు పిల్లలతో మాట్లాడినట్లుండేది. దేవుని గది పాడుబడిపోయింది. ఎన్ని కష్టాల్లోనూ రాఘవయ్య పూజను మానేసింది లేదు. ప్రొద్దున లేవగానే సుప్రభాతాలు గాని కొంచెం ప్రొద్దెక్కగానే హారతి ఇస్తున్న గంటగాని వినిపించక వొకరి కొకరు ఎదన్నా జ్ఞాపకం తెచ్చుకుని మాట్లాడుకోవాలన్నా దుఃఖం కట్టలు త్రెంచుకొంటుందని...ఎవరికి వారు మూగబాధతో ముక్తసరి మాటలతో గడుపుతున్నారు.

సౌద అత్తగారింటివాళ్ళు కర్మకాండలకు వచ్చి వెళ్లారు. సౌదను తీసుకు రమ్మని వుత్తరాలు వ్రాయటం మొదలు పెట్టారు.

మాధవ్ గుంటూరులో వున్న రోజుల్లో విషాద సంఘటనలు జరిగిపోయాయి. హైదరాబాద్‌కు మాధవ్ వచ్చాడని తెలిసి సోమశేఖరం రాఘవయ్యగారింటి విష యాలు తెల్పాడు.

మాధవ్ రాధతో ఎంత త్వరగా కలిసి సహజీవనం చెయ్యాలని ఉవ్విళ్ళూరుతున్నాడో ... అంత దూరమవు తూంది, అతడి ఆకాంక్ష.

ఉత్తరం చేరగానే నెల్లూరు వచ్చాడు.

శోక దేవతకు ప్రతిరూపంలా, దుఃఖానికి ప్రతీకగా వున్న రాధను ఏమని పలకరించాలో అర్థం కాలేదు మాధవ్‌కు. మేఘావృతమైన ఆకాశానికి చల్లని గాలి తగిలి వర్షించ బోయేలా వుంది రాధ వదనం. విచారంగా అందరివైపు చూస్తూ గడిపాడు కొన్ని క్షణాలు.

"మీ ... ప్రయివేట్ మాస్టర్, మీ మామయ్య— ఇక లేరు మాధవ్... లేరు. నన్ను కంటికి రెప్పలా కాపాడే నాన్న లేను. తోడుగా ధైర్యం చెప్పే అన్న లేడు. నేను... దురదృష్టవంతురాల్ని... మాధవ్" భోరున ముఖానికి చేతులు అడ్డుపెట్టుకొని ఏడ్చింది రాధ.

"వారిద్దరి భారం నేను భరిస్తాను రాధా! నీ వేదనకు... నా శక్తివంచన లేక మీ కుటుంబానికి తోడుంటాను..." మాధవ్ మాటలు పూర్తిగాక ముందే జానకమ్మ అక్కడి

నుంచి విసురుగా లేచి వెళ్ళింది. వివేద, సౌద ఆమె ననుస రించారు.

రాధ తల మీాద ఆదరంగా నిమిరి ఆమె రెండు అర చేతులు గట్టిగా పట్టుకొని... ఎన్నో విధాల వోదార్చాడు మాధవ్.

సెలవు లేదని రెండవ నాడే హైదరాబాద్ వెళ్ళాడు మాధవ్.

సౌదను అత్తగారింటికి ప్రయాణం చేసింది రాధ.

"నిన్ను ఈ స్థితిలో వంటరిగా వదిలి వెళ్ళనక్కా... నేను అప్పుడు నేను నేర్చుకున్న మైపును ఇప్పుడు ఉపయో గించుకుంటాను. ఎక్కడన్నా వుద్యోగంలో చేరుతాను. లేక పోతే ఇంకా కొన్ని ప్రయివేట్లు కుదిరించు, నేనూ చెప్తాను. నన్ను కూడా నీ వెంట వుండి, బరువు మొయ్యనీయక్కా! నేను ఇన్ని నాళ్ళు యిక్కడే తిని బ్రతికాను. నాకు ఆ హక్కు లేదంటావా ?"

"నీ పుట్టింటి అభిమానానికి నాకు గర్వంగా వుంది సౌదా...కాని నీవు కలవారింటి కోడలివి...నీకేం ఖర్మ... నీవైనా సుఖంగా వున్నావంటే మాకు ప్రస్తుతం అదే సంతోషం. పిచ్చి మమకారాలను పెంచుకుని నీ కాపరం చెడగొట్టు కోకు..." అని నచ్చజెప్పబోయింది రాధ.

"నేనెంత సుఖపడుతున్నానో నీకూ తెలీదా అక్కా! కేవలం ఓ విలాస వస్తువుగా, ప్రాణంలేని బొమ్మగా నేనింక అక్కడ కాపురం చేయలేను. ఎంత ఓర్చుకున్నా అన్నీ

గ్రహించి మెలిగినా, అంత నీచంగా చూస్తుంటే ఎలా భరించ గలనక్కా — కేవలం పేద ఇంట్లో పుట్టడం, భాగ్యవంతులింటికి కోడల్ని కావటం, అందంగా వుండడం, అనాకారైన భర్తను చేసుకోవటం, అనే ... నా తప్పులు. అవి నా అపరాధాలంటే నేనేం చెయ్యాలో చెప్పక్కా — ! అందం నా పాలిటి వరప్రసాదమని, అదృష్టమని అనుకున్నాను. కాని మా సంసారానికి పరమ శత్రువుగా పరిణమిస్తుందనుకో లేకపోయాను."

"నీ తెలివి తేటల్తో నయాన భయాన చెప్పుకుని నేర్పుగా సంసారం చేసుకోవాలిగాని, చెడగొట్టుకుంటారా?" మనసులో వ్యధను దాచుకుంటూ చెప్పబోయింది చెల్లెలికి.

"కొన్ని పరిస్థితులవల్ల చెడ్డలవాళ్లు పట్టుబడితే మార్చ డానికి ప్రయత్నిస్తే ఫలిస్తుంది. అదైనా తనూ పరివర్తన చెందాలని యోచించి, మనసు మార్చుకోడానికి ప్రయత్నిస్తే మాత్రమే బాగుపడతారు. తాను చేసేవన్నీ చెడ్డవి కావని జీవితాన్ని సరదాగా అనుభవించాలనుకున్న వాళ్ళనెవరు మార్చగలరు! నే బ్రతికుండగా మారరు ... ఇలానే చిత్ర హింసపడుతూ జీవచ్ఛవంలా నేను జీవించలేను ... నన్ను నీ నీడలో బ్రతకనియ్యక్కా" అంటూ భోరున ఏడ్చింది సౌద.

"పెండ్లయిన ఆడపిల్ల పుట్టింట్లో వున్నంత పాపం మరొకటి లేదు...నీవు కొంత నా స్థితిని గమనించే వుంటావు. కన్నవారు చావనీయరు. ఇతరులు బ్రతుకనీయరు. భగవంతుడు చేసినదానికి కూడా వాళ్ళ మీదనే నిందవేసి తరిమి తరిమి

కొట్టడం సమాజానికి పరిపాటి. ఎదిరించి నిలబడిన వాళ్ళు ఏ కొందరో వుంటారు. అత్తగారింట్లో నానా అగచాట్లు పడి...చచ్చినా ... సానుభూతి మిగులుతుంది గాని, తమ బ్రతుకు తాము బ్రతుకుతామని బయటపడితే ... ప్రజలు మాటలతో చేతలతో కుళ్ళబొడిచి వదులుతారు. నేను మాటలతూట్లతో బండబారిపోయినా, అప్పుడప్పుడు మంటలు రేగుతుంటాయి. అందుకే నీవు ఏ పరిస్థితిలోనూ పుట్టిల్లు నీది చేసుకోరాదు... ఇక్కడ నీకు స్థానం లేదమ్మా ... స్థానం లేదు..." దహించే దావానలం దాచుకుని, చల్లని మాటలతో చెప్పి వొప్పించింది రాధ.

నివేదను తోడిచ్చి, మాధవ్ తమ్ముడు రవి వెంట సౌదను గుంటూరుకు పంపింది.

# 32

గోపాలరావు కొడుక్కి రమణరావు మరణవిషయం చాలా దినాలవరకూ వ్రాయలేదు. మనోహర్‌కు డబ్బు పంపేవాడు. అతడికి తెల్పితే రిసెర్చి మానుకుని వస్తాడని తండ్రి భయం కావచ్చు.

ఉత్తరాలు ఎందుకు రావటం లేదో తెల్పమంటూ మనోహర్ వ్రాయటంతో వూపిరాడక...వివరాలన్నింటినీ క్లుప్తంగా వ్రాసేడు గోపాలరావు.

చాలా బాధపడుతూ ఝాన్సీని వోదార్చుతూ ధైర్యం

గడుపుతూ లేఖలు వ్రాసేవాడు మనోహర్. తను మాత్రం ఉత్సాహంగా జవాబివ్వలేకపోయేది యూనీ!

వీలైనంత త్వరగా చదువు పూర్తిచేసుకొని వస్తానంటూ వ్రాస్తుండేవాడు. కాని ఫలానప్పుడని ఖచ్చితంగా వ్రాయలేకపోయేవాడు.

ఇంట్లో వుంటే దిగులుగా వుంటుందని, శారదమ్మ నిర్బంధిస్తే కాలేజీకి వెళ్ళేది యూనీ. మనస్సెప్పుడూ పరాగ్గానే వుండేది. కారణం...తండ్రి మీద విచారమయినప్పటికి హేతువు మరొకటుంది. గోపాలరావుగారింటికి మనోహర్ కి పిల్లనివ్వటానికి పెళ్ళి సంబంధాలు వచ్చేవి. గోపాలరావు పట్టించుకోనకపోయినా, భార్య మాత్రం వచ్చిన మనువును, వృధాపోకుండా ఎంత కట్నం ఇవ్వగలరో, అంతు కనుక్కొని, అబ్బాయివస్తే మాట్లాడదామని, వాళ్ళు సంబంధం వేరే చూచుకోకుండా వుల్ల వేసి పెట్టేది.

ఎదురిల్లే గనుక. .అన్నీ తెలుస్తుండేవి శారదమ్మకు.

ఉండబట్టలేక కామాక్షమ్మను అడిగిందో నాడు శారదమ్మ.

"వదినగారూ! అబ్బాయికి మనువు మాట్లాడుతున్నారే! మా అమ్మాయిని అన్యాయం చేస్తారా! చదువుకు డబ్బు కూడా ముందే ఇచ్చారు గదా!" అని.

"అయ్యో! ఇవ్వలేదని ఎవరన్నారు? మీ పిల్లను చేసుకుంటే మీ బాకీ తీర్చలేం గనుక మావాడికి వేరే పిల్లను చూచి వాళ్ళిచ్చే కట్నంతో మీ డబ్బిచ్చేస్తే మీకు దేని

కయినా కలిసొస్తుంది. కష్టంలో వున్నారు కనుక సహాయం చెయ్యాలనే వుద్దేశ్యంతో ... అట్లా చేస్తున్నాము ... మీ పిల్లకేం అన్యాయం? మీకు డబ్బుకు డబ్బు వస్తుంది. మీ మేనల్లుడికి కిచ్చుకుంటే ... డబ్బు మిగులుతుంది. అది మీకు మేలు చెయ్యడమా? చెడపడమా?" అని తన చర్యను సమర్థించుకుంది. చేసుకోనకపోతే డబ్బు రావటం 'కల్లోన సంగతి తెలుసు శారదమ్మకు, అందుకే అడిగి చూచింది

మనోహర్ చేసుకోని పక్షంలో మేనల్లుడు, అన్న, వదిన కళ్ళకద్దుకొని చేసుకుంటారనే నమ్మకం వుంది. ఏదీ అనుకున్నట్లు జరగదు కనుక విధి మీద భారం వేసి రోజులు గడుపుకొస్తూంది శారదమ్మ. మనోహర్ దగ్గర నుంచి లేఖలు రాకపోవడంతో యూస్సీ అనుమానం మరింత పెరిగింది. ఆందోళన అధికమైంది.

రాఘవ్ కు సుధీర్ బృందంలో సన్నిహితం మరింత పెరిగింది. రాధకు వుల్లాసంగా వుత్తరాలు వ్రాయటానికి లేక, అనుకున్న రకంగా అనుకూలం లేక మనసు వికలంగా వుండేది ఒకవైపు మేనత్తగారి స్థితి, మరొకవైపు రాఘవయ్య కుటుంబ పరిస్థితి, ఇద్దరి సన్నిహితుల దుఃఖం తనమీద ప్రభావం చూపింది. అలసిన మనసుకు విశ్రాంతి, ఉత్సాహం

కానానికి చేది [illegible] ...ంచి [illegible] ...లో [illegible] సరిపెట్టుకో లేక 'ఏదో కావాలి, ఏదో చెయ్యాలి' అనిపించేది. కథలు వ్రాయడానికి స్థిమితం కుదిరేది కాదు.

సుధీర్ అతని ఫ్రెండ్సు తనని ఓ అసమర్థుడి క్రింద, ఓ చేతగాని వాడి క్రింద జమకట్టి మాట్లాడుతుంటే యువక రక్తం...ఉబికిపోయి పౌరుషం పెరిగేది. కాని తన సంస్కారం ...రాధ ఆదేశాలు, తనను వెనకంజ వేయించేవి. ఎగ రాల్సిన గాలిపటానికి తాడును లాగితే గింజుకున్నట్లుగా వుండేది. సంఘర్షణతో వేగిపోయేవాడు.

సుధీర్ ప్రయివేటు రూంలో...యువకుడికి కావలసిన అవసరాలన్నీ తీర్చుకోడానికి అన్ని వసతులూ కల్పించబడేవి. ఆనందాన్ని సృష్టించుకోగల వాతావరణమది. కాని తను దూరం కావటానికి ప్రయత్నించేవాడు. ఒక్కొక్కసారి ఆ పరిసరాల నుంచి పారిపోవాలనిపించేది. కాని, ఎక్కడికి? అనే ప్రశ్న భూతంలా వెంటాడేది. [illegible] స్వప్నాలలో స్వేచ్ఛగా బ్రతకలేక ... సాలెగూడులాంటి ఆ రూములోనే గడపక తప్పడంలేదు మాధవ్ కు.

# 34

శ్రీధర్ ప్రమాదంలో మరణించాడు కనుక మిల్లు వాళ్ళు కొంత డబ్బు సహాయం చేశారు. అతడి జీతంతో

అప్పు తీర్చుకోవాలన్న రాఘవయ్య కోర్కె తీరకపోయినా ఇద్దరూ గతించిన తరువాత ఆ డబ్బు అప్పుకు వుపయోగ పడింది. అయినా ఇంకా కొంత అప్పు మిగిలే వుంది.

"పొలం అమ్మి బాకీ తీర్చి వేదకు పెండ్లి చెయ్యి" మంది జానకమ్మ. అలాగే మాగాణి అమ్మి, అప్పుతీర్చి, తక్కిన డబ్బు బ్యాంకులో వేసింది రాధ. ఇంక శంకారంలో కొద్ది పొలం మాత్రమే మిగిలింది. అదైనా సరిగా తిండి గింజలకు సరిపోయే మాత్రం కూడా పండదు.

అన్ని గొడవల్లో పడి తన ఆరోగ్యం అశ్రద్ధచేసింది. రాధ. అప్పుడప్పుడు జ్వరం-వస్తూ, కొద్దిగా తగ్గుతుండేది. ఏదో ఉపశాంతికి మాత్రమే మందులు వాడేది.

"రాధా! ఏమిటే అట్లా దగ్గుతున్నావ్! మా అన్నా, నాన్న పోగానే నీకంత విరక్తి అయితే ఎట్లానే! నీ జీవానికి నేను, నీ చెల్లెళ్ళు బ్రతికే వున్నామే! ఆసుపత్రికిపోయి మందు తీసుకో. నన్నెందుకు సాధిస్తావ్!" నిష్టూరం, ఆజ్ఞ మిళితమైన తల్లి ధోరణికి విషాదంగా నవ్వుకుంది రాధ. నివేద ఎంతో ప్రాధేయపడి గవర్నమెంటు హాస్పటల్‌కు తీసికెళ్ళింది. "టి. బి. అని అనుమానంగా వుంది. కనుక టి.బి. హాస్పటల్లో చూపించ" మన్నారు డాక్టర్లు.

అన్ని పరీక్షలు చేసి టి. బి. యే నని నిర్ధారణచేశారు హాస్పటల్ వాళ్ళు. సోమశేఖరం జానకమ్మకు, నివేదకు ధైర్యం చెప్పి రాధను టి. బి. హాస్పటల్లో అడ్మిట్ చేయించాడు. ఆ విషయం మాధవ్‌కు కూడా వ్రాసేడు.

# 35

టి. బి. హాస్పటల్లో ఎముకల గూడులా బెడ్ మీద వున్న రాధను చూచి మాధవ్‌కు ఎంతో దుఃఖం కలిగింది. ఆమె ఎదుట బాధపడితే మరీ దిగులు పడుతుందని నిబ్బరంగా మాట్లాడ్డానికి ప్రయత్నించాడు కట్టలు త్రెంచుకునే కన్నీళ్ళు ఆపుకుంటూ.

"ఎప్పుడొచ్చావ్ మాధవ్. అలా కూర్చో. మరీ దగ్గరకు రాకు... నీకు వ్రాయొద్దని చెప్పానే మామయ్యకు. ఎందుకు తెలిపాడు? నీవు కష్టాలు, బాధలు భరించలేవు. అందుకే నాకు బాగా నయమైన తరువాత తెల్పాలనుకున్నాను... "

"నీ కష్టాల్లో నాకు భాగం లేదంటావా ... నేనంత పరాయివాడినన్న మాట!... " నిష్ఠూరం ధ్వనించిం దాతడి గొంతులో.

"చూడు మాధవ్! ఈ తామరపువ్వం ... తొడిమలు; తూడులు లేవు. ముళ్ళగుట్టను నీ కర్పించలేను. నా జీవితానికి ఎన్నో ప్రతిబంధకాలు, విడరాని సమస్యలు పెనవేసుకొని వున్నాయి. నాతో పాటు నీ వెందుకు కష్టాలు పడాలి? నీ వెక్కడున్నా నీ శ్రేయస్సునే నే కోరేది ...

అందుకే నీవు ఎవ్వర్నయినా పెళ్ళి..." బాధను లోలోన అదిమి పట్టింది.

"రాధా! నన్ను నీచుడిగా చిత్రిస్తున్నావా? నేనంత స్వార్థపరుణ్నని నీ వుద్దేశమా! నన్ను పరీక్షిస్తున్నావా? నీ వెప్పుడూ అలా తలచకు రాధా. నాకోసం నీవు త్వరగా నయం చేసుకోవాలి. నా మీద ప్రేమాభిమానాలుంటే శ్రద్ధగా మందు తీసుకో!..." వేళ్ళతో రాధ తల సున్నితంగా నిమరసాగాడు. మాధవ్ కన్నీటి బిందువులు ... ఎండిన రాధ గుండెల మీద పడి చిందిపోయాయి.

"మాధవ్! ఏడుస్తున్నావా! నిన్నెంత బాధ పెట్టాను పాపిష్టిదాన్ని! నీ మనస్సు కనుక్కోడానికి కాదు... నీ సుఖం చూడ్డానికి... నాతో కష్టాలు పడకుండా వుండటానికి ... మాత్రమే అలా అన్నాను. నాకోసం వేచివుండే సహనమే నీకుంటే, నేను యమధర్మరాజుతో పోరాడి బ్రతికి వస్తాను. మందుల కంటే, ఆహారాని కంటే నీమాటలే నన్ను అమృతం పోసి బ్రతికిస్తాయి. నీకోసమే నేను ఈ నా శరీరాన్ని, మనసును పదిలంగా నీకు సమర్పిస్తాను మాధవ్" అంటుంటే రాధ సొట్టలు పడ్డ చెక్కిళ్ళు, పాలిపోయిన వదనంలో కూడా నీరసించిన కళ్ళు తళుకులీనాయి. మరో ప్రక్కనుంచి కన్నీరు చిప్పిలింది. తల మీద వున్న అతడి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని కళ్ళకద్దుకుంది.

"ఏడుస్తున్నావా రాధా! తప్పుకదూ..." అంటూ కన్నీళ్ళు తుడిచాడు.

"అది కన్నీరు కాదు మాధవ్... పన్నీరు. అవి ఆనంద బాష్పాలు." ఎండ పొడల మధ్య సన్నని జల్లులా వుందామె కనుదోయి.

హడావుడిగా వచ్చిన నర్సు "అందరూ బైటకు వెళ్ళాలి... డాక్టరుగారు వార్డులోకి వస్తున్నారు..." అంది తొందరచేస్తూ.

విధిలేక లేచి వెళ్ళాడు మాధవ్.

రాధ హృదయం ఆనందంతో నిండిపోయింది. తృప్తిగా గాలి పీల్చుకుంది.

హైదరాబాద్ వెళ్ళిన తరువాత మాధవ్, రాధకు తరచుగా ఉత్తరాలు రాస్తూ వుండేవాడు. ఒకవైపు బాధ, మరొకవైపు నిస్పృహతో వేగిపోయేవాడు. మనసుకు ఆహ్లాదం కావాలనిపించేది. కాలం బరువుగా కదిలినట్లయ్యేది. ఇంతలో గుంటూరు రమ్మనీ అప్పుడు మిగిలిన ఆఫీసు పన్లు చేసి వెళ్ళవలసిందనీ గుంటూరు నుంచి శారదమ్మ ఉత్తరం వ్రాయగా, మళ్ళీ కొన్ని నాళ్ళు సెలవు పెట్టాడు గుంటూరు వెళ్ళడానికి మాధవ్.

# 37

ఆరోజు బ్యాంకికి సెలవు గనక సుధీర్ బృందంతో కాలక్షేపం చేశాడు మాధవ్. సినిమా ప్రోగ్రాం వేసు కున్నారు ఫ్రెండ్సంతా ... తనేదో కథ వ్రాసుకోవాలని రానన్నాడు మాధవ్.

కాగితాలు ముందేసుకొని ఆలోచిస్తూ వాక్యాలు సుదుర్చుకుంటున్నాడు. తలుపు నెట్టుకొని ఓ అపరిచిత వ్యక్తి లోపలికొచ్చాడు. ఎప్పుడో, ఎక్కడో చూచినట్లు గుర్తే గాని స్పష్టంగా... ఫలానా అని తెలుసుకోలేక పోతున్నాడు మాధవ్.

"మీరూ... మి... మ్మ... ల్ని" ఏమడగాలో తెలీక తడబడ్డాడు మాధవ్.

"నీవు... మాధవుడివే కదూ!" నిశితంగా చూస్తూ అన్నాడా ఆగంతకుడు.

ఎందుకో అతగాణ్ని చూస్తే మంచి భావన కలగటం లేదు. రూపంలో కూడా క్రూరత్వం కూడు కట్టుకొని వుంది. సినిమాలో విలన్‌లా వున్నాడు. ఎర్రని జీరల కళ్ళు, నిర్లక్ష్యంగా చూచే చూపు.

"నేను మీకేం తెలుసు?..." నాన్చుతూ అన్నాడు మాధవ్.

"నీవు నాకు బాగా తెలుసు నేనెవర్నో గుర్తురాక

పోతే చెబుతాను... నీ ప్రియురాలు రాధ మొగుణ్ని... నీ పాలిటి యముణ్ని..." కటువుగా వెలువడ్డాయి మాటలు.

గొంతు తడారిపోగా, "ఆ ... లాగా! నాతో ఏం పనీ?" కంగారు నణచుకుంటూ, తడబడే గొంతుకతో అడిగాడు మాధవ్.

"నీతో ముఖ్య విషయం మాట్లాడ్డానికే వచ్చాను. మొదట్నుంచీ నా సంసారానికి నీవే కారుచిచ్చువు. ఆరోజు నీవు, రాధతో మాట్లాడుతున్న నన్ను శ్రీధర్ చేత కొట్టించి, నన్ను పట్టివ్వక పోతే, నాకీ శ్రమ వుండేది కాదు. ఇప్పుడైనా మునిగిపోయింది లేదు. ఎప్పటికైనా రాధ నా భార్య. చట్టం కాదన్నా నేను తాళిగట్టిన మొగుణ్ని. నాకా అధికారం వుంది. ఆమె జీవితం నుంచి నువ్వా తప్పుకుంటే ఆమె నాకు సునాయాసంగా దక్కుతుంది. ఏ వుపాయంతో ఆమెను వదిలించుకుంటావో ఆలోచించుకో!..." పళ్ళు కొరికాడా వ్యక్తి.

"శేఖర్ గారు! మీరు నన్ను, నా పరిస్థితిని అర్థం చేసుకోండి. మీరీ ప్రాంతాల్లో వుంటే ఎలా ఉండేదో? నాకు రాధ మీద అభిమానం ఆమెను ఉద్ధరిద్దామనే ఉద్దేశం నన్ను వివాహానికి పురికొల్పాయి. నన్ను నమ్ముకుంది, ఆశలు పెంచుకుంది. నాకోసమే బ్రతుకుతూంది. అటువంటి రాధను నేనెలా అన్యాయం చెయ్యను? అందునా ఇప్పుడు ఆమె ఆరోగ్యం బాగులేదు. ఆమెను వేధించకండి. మిమ్మల్ని

వేడుకుంటాను" అన్నాడు సౌమ్యంగా... దుష్టుణ్ని జూచి దూరంగా వుండాలన్న సూక్తిని పాటిస్తూ.

"అహహహహహ హాహాహా ఎంత ప్రేమ! ఎంత జాలి! అందుకే హాయిగా నౌకరి చేసుకుంటూ ఇక్కడ కూర్చొని, అక్కడ రోగిష్టి మనిషి గతీ స్థితీ ఆలోచించలేని నీకు అభిమానమా! ఏదో తేరగా వుంది. కాలం జరిగిపోతుందని ప్లానేశావ్!" వెటకారం ధ్వనించిం దతడి మాటల్లో...వ్యంగ్యంగా చేతులు తిప్పసాగాడు.

"నే నంత నీచుణ్ని కాదు. ఆ తలంపుతో నేనెపుడూ చూడలేదు. పెండ్లి చేసుకొని భార్యగా చూడాలనుకున్నాను, చేసుకుంటాను..."

"అది ముమ్మాటికీ జరగదు. నీవు... అంతగా తెగిస్తే నీవో, అదో మిగులుతారు జాగ్రత్త... నాకేం దేశాలు తిరగటం క్రొత్తకాదు. ఎక్కడైనా వుండగలను గనుక జైల్లో వుంటాను... రాధ నాది కానప్పుడు... నీదీ కాకూడదు. మరెవ్వరిదీ కాకూడదు. ఆమె చావే నీవు కోరితే నీ పనిలో నీవుండు. నా పనిలో నేనుంటాను. ప్రతిక్షణం కనిపెట్టే వుంటాను. నీ ప్రతి కదలికా చెప్పడానికి మనుషులున్నారు. ఇదే నా మొదటి హెచ్చరిక; ఆఖరిమాట అంతే" కఠినంగా ధ్వనించిం దతడి గొంతు.

మాధవ్‌కు ముచ్చెమటలు పోసాయి. రాధను తన నుంచి కర్కశంగా లాక్కుపోతున్న రాక్షసుడిలా శేఖర్; హృదయ విదారకంగా విలపించే అబల రాధ- కళ్ళముందు

మెదిలాడు 'నా పట్టుదలకు, ప్రేమకు, ఆమె బలి కాకూడదు. భగవాన్, ఏమిటి అడుగడుగునా మాకీ విషమ పరీక్షలు...?' మాధవ్ మనస్సు ఆక్రోశించింది. అగ్నిజ్వాల రగల సాగింది. అగాధంలో కొట్టుకు పోతున్నట్టు వూగి పోయాడు అతను.

"రాధ నేమీ చేయకండి శేఖర్ గారు! రాధ... రాధ..."

"ఏమిటయ్యా ఆ జపం ఆమెను గురించి జోక్యం కలగ జేసుకోవుగా...!" నిలదీసి అడిగాడు శేఖర్.

"సారీ... శేఖర్ గారు! నన్నిప్పుడేమీ నిర్బంధించకండి... ప్రస్తుతం రాధ ఆరోగ్యం బాగుపడాలి..."

"అది నీవేం చెప్పక్కర్లేదులే! అక్కడన్ని ఏర్పాట్లూ చూచే వచ్చాను. రాధను స్పెషల్ వార్డులో చేర్పించాను. పరిచర్యలు చేస్తున్నాను. నేరుగా ఇంటికే మకాం మార్చాను. ఇంకేం కావాలో చెప్పు..." అనేసి, మరోసారి హెచ్చరించి గుమ్మం దాటాడు శేఖర్.

ఆ హాల్లో జడివాన కురిసి వెలిసినట్లయింది. దాని తాలూకు బీభత్సం మనసులో గందరగోళం చేస్తోంది. అసహనంగా తిరగసాగాడు. ఏమీ చేయటానికి తోచడంలేదు. ఒక్క ఆలోచనా కుదురుగా నిలవటంలేదు.

హోటల్ కెళ్ళి భోజనం చేసి రాలేదు. సినిమాకు వెళ్ళతానన్న సుధీర్... కొంత సేపటికి వచ్చాడు.

"కరెంటు పోయింది. విసుగ్గా వుంటే వచ్చేశాను -

మేము వెళుతున్నప్పుడు వచ్చిన వ్యక్తి...మీకేమవుతాడు?" అన్నాడు సుధీర్ ... సూటిగా మాధవ్ వైపు చూస్తూ ముఖం అదోలా పెట్టి.

"మిస్టర్ సుధీర్ ... నన్నిప్పుడేం అడక్కు. చెప్ప నందుకు క్షమించు. నా మనసేం బాగులేదు." ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు మాధవ్.

"సారీ, నీకు బాధ కలిగించాను. అయినా అంత వ్యధ కల్గించేది నీకేం వుంటుందబ్బా ... ! పసివాడివి." అంటూ ఈజీఛైర్లో మేను వాల్చాడు సుధీర్. మాధవ్‌కు తెల్లవార్లూ నిద్రపట్టలేదు. బలవంతం మీద కాఫీ తెప్పించి ఇచ్చాడు సుధీర్.

మర్నాడు కూడా నిద్ర పట్టకపోతే నిద్రమాత్రలు వేసుకొనిపడుకున్నాడు మాధవ్. వేసుకుంటున్నపుడు చూచిన సుధీర్ వాటివల్ల ఆరోగ్యానికి ప్రమాదమని తనో మందిస్తా నన్నాడు. రేపు చూద్దామని...పడుకున్నాడు. కాని నిద్ర పోలేక పోయాడు.

"నిద్రమాత్రలు ప్రమాదం చేస్తాయని చెబుతే విన కుండా వేసుకున్నావ్. అయినా ఫలితం లేక పోయింది. నేనిచ్చే మందు తీసుకుని చూడు. అదీ అంతే అయితే తర్వాత చూద్దాం - రోజూ నిద్ర లేకపోతే ఆరోగ్యం పాడవు తుంది. నా మాట విను" అంటూ ఓ ఔన్సు మందు

గ్లాసులోవేసి కొంత కూల్‌డ్రింక్ కలిపి మాధవ్ చేతి కందిచ్చాడు-సుధీర్. మాధవ్ ఒక్కొక్క గుక్క నోట్లో పోసుకోగానే గొంతు మంటలేసింది. డోకు వచ్చినట్లయి పొరలు పొరలుగా దగ్గు వచ్చి, వుక్కిరి బిక్కిరయ్యాడు, నాలిక తిమ్మిరెక్కగా.

"ఇదేం మందయ్యా బాబూ, ప్రాణం తోడేసేలా వుంది. నీ మందుకో నమస్కారం, నీకో నమస్కారం" చేతులు జోడించాడు.

"ఇపుడే మందు బాగా పని చెయ్యదు. ఇంకా రెండు రోజులైనా తీసుకోండే...నిద్ర బాగా రాదు"

"కొంపదీసి బ్రాందీ కాదుకదా?"

"ఛ...చ్ఛ ..నీ కెందుకొచ్చిందా అనుమానం? ఆ సంకోచాలేవీ పెట్టుకోబోకు .. తీసుకోమరి..." అంటూ రెండు ఔన్సుల మందులో అరగ్లాసు నీళ్ళు కలిపి త్రాగించాడు సుధీర్.

నాలుగు గుక్కల్లో త్రాగేశాడు మాధవ్. రెండవసారి ఇచ్చిన మందుకు కనురెప్పలు మూత పడుతుంటే శరీర మంతా తిమ్మిరెక్కి, మొద్దుబారి నట్లయింది. కాళ్ళూ చేతులూ తేలిపోసాగాయి. బలవంతంగా కళ్ళు తెరిచి చూచి నపుడు అక్కడి వస్తువులన్నీ రెండేసిగా, కనపడసాగాయి. సుధీర్ మాధవ్ చెయ్యి పట్టుకొని అతడిని పడకవైపు నడిపించి పడుకోబెట్టాడు. ఆ రాత్రి గాఢంగా నిద్రపట్టింది.

"నిన్నటి మందే మళ్ళీ యివ్వండి" అని ప్రాధేయ పడ్డాడు మాధవ్.

"రోజూ వాడకూడదు, అంతగా నిద్ర పట్టకపోతే చూచుకోవచ్చు వెళ్ళిపడుకో" అంటూ మాధవ్ వీపు తట్టాడు సుధీర్.

కాసేపు మంచం మీద అటు ఇటు దొర్లాడి, లేచొచ్చి మందివ్వమని బ్రతిమాలాడు. మళ్ళీ రెండో రోజు కూడా త్రాగాడు.

మూడోనాడూ అడిగేసరికి అసలు విషయం బైట పెట్టే వుద్దేశంతో "నీ కిస్తున్న మందు ఇ...దీ..." అని సీసా చేత్తో పైకెత్తి చూపాడు.

సీసా మీద పేరు చూచి ప్రక్కలో బాంబు ప్రేలి నట్లు అదిరిపడి, "మైగాడ్...ఇదా! నాచేత త్రాగించావ్? సుధీర్..." రోషావేశంతో అన్నాడు.

"నే త్రాగించాలని త్రాగించలేదు మిష్టర్ మాధవ్. నీబాధ చూడలేకవిశ్రాంతిగా అన్నీమరచినిద్రిస్తావనిమందుగా ఇచ్చాను నన్నపార్థం చేసుకోకు.ము రెప్పుడూ దీన్ని ముట్టుకోకు ప్లీజ్!" అంటూ సీసా టేబుల్ సొరుగులో పెట్టాడు సుధీర్.

తప్పుచేసిన వాడిలా ఎంతో వేదన చెందాడు మాధవ్. ఎంతసేపు దొర్లినా నిద్ర పట్టలేదు. రాధ జబ్బు, శేఖర్ బెదిరింపు, అమావాస్యనాటి సాగరంలా అల్లకల్లోలం చేస్తు న్నాయి. వాటి ధాటికి తట్టుకోలేక ... 'ఇది దురలవాటుగా

కాదు కదా! ఓ ఔషధంలా వాడుకుంటే తప్పేమిటి' అను కున్నాడు. సీసా మూత తీసి గ్లాసులో పోసుకున్నాడు.

ఒక్కొక్క విషయమే సుధీర్ తెలుసుకుంటున్నాడు. ఒక్క విషయం కూడా దాచకుండా అడిగిన వన్నీ చెప్పే సాడు మాధవ్.

రెండవనాడు లేచి కుర్చీలో కూర్చుని టేబుల్ మీద అద్దంలో ముఖం చూచుకొని ఉలిక్కిపడ్డాడు. జ్యోతుల్లాంటి కళ్ళు, ఉబ్బిన రెప్పలూ, ముఖం భయంకరంగా తోచింది. బురదగుంటలో కూరుకుపోయానని గ్రహించుకున్నాడు. ఈ పొరపాటు అలవాటై గ్రహపాటుగా మారుతుందేమో! మరెన్నడూ త్రాగరాదు! ఎప్పుడూ లేనంత ఆకలి దహించి వెయ్యగా గబగబ...హోటలు కెళ్ళి ఎన్నో వెరైటీలు వేయించుకొని తిన్నాడు.

బ్యాంకికి వెళ్ళటానికి సిగ్గుపడిపోయాడు. అక్క డందరూ తనవైపు హేళనగా చూస్తున్నారని భ్రమపడి తనకు తానే ఏదో అయిపోతున్నాడు.

అతడి విచిత్ర ప్రవర్తనకు అందరూ సంశయాత్మ కంగా చూస్తుంటే బిడియపడిపోయాడు!

## 38

"మాధవ్! ఈ రోజు సెలవేగా అలా వస్తావా? నాకు తెలిసిన ఓ రచయిత వున్నాడు. నిన్ను పరిచయం

చెయ్యమని ఎన్నోసార్లడిగాడు, వీలైనప్పుడు తీసుకొస్తా నన్నాను...వస్తావా?" అడిగాడు సుధీర్. కాస్త మనసుకు రిలీఫ్‌గా వుంటుందని "సరే" నన్నాడు మాధవ్.

"వెరీగుడ్" అలా ఉండాలి. బ్రతుకంటే బాధ్యతల మాట,కర్తవ్యాల కంచెగా వుండకూడదోయ్! మనం గిరిగీచుకుని కూర్చుంటే సరదాలు వెదుక్కుంటూ రావు. వాటి వెంట మనం పోవాలి..." అంటూ గుమ్మం వైపు దారి తీశాడు...కారు స్టార్టు చెయ్యమని డ్రైవరుకు చెప్పాడు సుధీర్.

మాధవ్ అతణ్ణి అనుసరించాడు.

"ఆ చిన్న మేడ దగ్గర నిలువు" అని ఆగాక – డోరు తెరిచి వెలుపలికొచ్చాడు సుధీర్.

మాధవ్ కూడా దిగాడు.

సుధీర్ వెంట లోనికి నడిచాడు.

అక్కడో చిన్న పోర్షన్ వద్ద నిలబడి -

"శర్మగారున్నారా?" అన్నాడు లోపలికి చూస్తూ సుధీర్.

కర్టన్ తొలగించుకొని ఓ ముప్ఫై అయిదేళ్ళ స్త్రీ వెలుపలికొచ్చి "బాత్‌రూంలో ఉన్నారు కూర్చోండి" అంటూ అక్కడ రెండు కుర్చీలు చూపింది. ప్రశ్నార్థకంగా సుధీర్ వైపు చూచాడు మాధవ్ 'ఎవరనే' అర్థంతో. తర్వాత చెబుతా నన్నట్టు సైగచేశాడు సుధీర్.

ఇంతలో శర్మ లోపల్నుంచి వచ్చాడు.

"వీరే శర్మగారు..." మాధవ్‌కు పరిచయం చేశాడు సుధీర్.

"మాధవ్ అని చెప్పానే ఇతడే..." శర్మతో అన్నాడు.

"నమస్తే" అన్నాడు శర్మ.

"నమస్తే... నమస్తే."

చాలాసేపు సాహిత్యాన్ని గురించి ఎవరి అభిప్రాయాలు వారు చెప్పారు. ఎవరెవరి రచనలు ఎవరి కిష్టమో—ఎందుకిష్టమో రచయిత లిద్దరూ చెప్పుకున్నారు... దాన్లో పరిచయం లేని సుధీర్ కేవలం శ్రోతగా వినసాగాడు. అలా ఎంత సమయం గడిచిందో గ్రహించలేక పోయారు యిరువురూ.

మూడు కాఫీలు ట్రేలో పెట్టుకొచ్చింది- మొదట తమకు జవాబు చెప్పినావిడ. తీసుకొని వెలుపలికి వచ్చారు!

త్రోవలో తన అనుమానం తీర్చుకోవటానికి మాధవ్—

"ఆమె... అతడి అక్కా? పిన్నమ్మా? అతడికింకా మ్యారేజ్ కాలేదా! వైఫ్ వూర్లో లేదా?"

"అ హా హా హా" బిగ్గరగా నవ్వేడు సుధీర్. ఎందుకు నవ్వుతున్నాడో అర్థం కాలేదు మాధవ్‌కు.

"నన్నెన్నుతో చంపక చెప్పవయ్యా తండ్రీ" అన్నాడు తెలుసుకోవాలని తొందరపడుతూ.

"సావధానంగా విను... ఆమె శర్మగారి వైఫే!"

"ఓ మైగాడ్, నమ్మలేను."

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా అది మాత్రం

నిజం. కథల్లో ఆదర్శం గాక, ప్రాక్టికల్‌గా చెయ్యాలనే వుద్దేశం వుండేదట- తన సాహిత్యాన్ని ఆరాధించే ఆమె అతని రచనలు చదువుతుండేదట. క్రమేణా పరిచయం పెరిగిన తరువాత ప్రచురణ కాని వ్రాతకాగితాలు కూడా తీసుకుంటూ, వాటిని గురించి చర్చించుకుంటూ వుంటుంటే ఆమె భర్త అనుమానించి ఆమెకు విడాకులిచ్చాడట ... తనవల్ల ఆమె సంసారం చెడిపోయిందని ఆదర్శం పేరుతో ఆమెను, తను రిజిష్టర్డ్ మ్యారేజ్ చేసుకున్నాడు. ఆమెకో బిడ్డ కూడా వుంది తన జీవితం ఎలా వుందో గాని, యితర్ల చేత హేళనగా చూడబడుతుంటాడు .. ఒక్కొక్కరనే మాటలు చెప్పి బాధపడుతుంటాడు కూడా."

అని మాధవ్ వైపు నిశితంగా చూచాడు సుధీర్.

అంతరంగంలో ఏదో మథన పడుతున్నట్లు మాధవ్ ముఖం రంగులు మారటం గమనించి లోపలే తృప్తిపడ్డాడు సుధీర్.

గమ్యస్థానం చేరగానే ఎవరి పనుల్లో వారు నిమగ్నమైనారు.

శర్మ దాంపత్య జీవనం గురించి ఆలోచిస్తూ తను రాధతో గడపాల్సినపుడు ఎదుర్కోవల్సిన విషయాలు మెదడును తొలిచేస్తుంటే, అసహనంగా యేదీ తోచని స్థితిలో వున్నాడు—మర్చాడు కూడా మాధవ్.

"అలా కార్లో తిరిగొద్దాంరా మిస్టర్. కాస్త హాయిగా వుంటుంది, కమాన్." మాధవ్ జవాబుకు ఎదురుచూడ

కుండా చెయ్యి పట్టుకొని లాక్కుపోయి కార్లో కూర్చోపెట్టు కున్నాడు సుధీర్.

మంత్రముగ్ధుళ్ళా వెళ్ళి కూర్చున్నాడు మాధవ్.

కారు మెహాందీకి పోనియ్యమన్నాడు సుధీర్.

గానా బజానా వినవస్తున్న చోట కారు ఆపేడు డ్రైవర్.

'ఇక్కడ కెందుకు?' అని కళ్ళతోనే సైగచేశాడు మాధవ్.

"ఖుషీకి..." తమాషాగా నవ్వి చెయ్యి పట్టుకొని లోనికి పిలుచుకెళ్ళాడు. అక్కడో అందమైన అమ్మాయి నృత్యం చేస్తుంది. అక్కడ కూర్చున్న వాళ్ళందరూ ఆ వాద్యాల కనుగుణంగా తలలు త్రిప్పుతూ పరవశం చెందు తున్నారు. సుధీర్ కూడా వాళ్ళతో కలిసిపోయాడు. మాధవ్ ఇబ్బందిగా నిలబడిపోయాడు. బలవంతంగా అతణ్ని కూర్చోబెట్టాడు సుధీర్.

నాట్యం చేస్తున్న ఆమెలో రాధ కనిపించింది. జబ్బుతో బెడ్ మీద వున్న రాధ గుర్తుకొచ్చి ఒళ్ళు జలద రించింది. కొంతసేపటికి ఝూన్సీ సౌందర్యం ఆమెలో చూచి అతను పులకరించాడు. కోర్కెలేవో మేల్కొన్నాయి. ఆమె కాళ్ళ గజ్జలు ఘల్లుమన్నప్పుడు మాధవ్ గుండె ఝల్లుమన సాగింది.

కొంతసేపటికి నాట్యం ముగించి అందరి దగ్గరా చెయ్యి

చాపిందా యువతి. ఎవరికి తోచిన డబ్బులు వాళ్ళు వెయ్య సాగారు.

సుధీర్ ... ఓ పది రూపాయల నోటు వేసేడు. మాధవ్ అనాలోచనగానే పాంటు జేబులో చెయ్యిపెట్టి పర్సు తీసి, చేతికి ఐదు రూపాయల నోటురాగా వేసేడు. డబ్బులు వేసేటప్పుడు కొందరు కన్ను గీటుతుంటే సలాం చేస్తూ పోయింది. 'చూచి లెంపకాయ కొట్టదేం ఆ అమ్మాయి—ఆ రౌడీ మూకను ?' అనుకున్నాడు మాధవ్.

అతగాడి ముఖ కవళికలు అర్థం చేసుకున్న సుధీర్ తలపంకించి తనలో తను నవ్వుకున్నాడు.

నృత్య ప్రదర్శన ముగియగానే కొందరు ఎందుకో లోపలికి వెళ్ళసాగారు. అయోమయంగా ఇంద్రజాలం చూచినట్లు చూడసాగాడు మాధవ్.

"ఏం ! నీకూ వాళ్ళ దారి అనుసరించాలని వుంటే చెప్పు"

"నాకర్థం కావటం లేదు" విచిత్రంగా చూస్తూ అన్నాడు మాధవ్.

"అర్థం గాకుండా వెళ్ళితే పరమార్థం వుండదు భాయ్. పై పెచ్చు కథ రసాభాసం కావచ్చు, విషయం వివరిస్తాను. అవసరం కలిగితే ఉపయోగించుకోవచ్చు. ఇప్పటికి ఇంటి దారి పడదాం" అంటూ డ్రైవర్ని కేకేసి కారు దగ్గరికి నడిచాడు సుధీర్.

రూము చేరగానే అన్నీ వినాలని ఆత్రుత కనబరిచాడు మాధవ్.

"అక్కడ నాట్య ప్రదర్శన ఒక్కటే కాదు. ఆ విధంగా మనుషుల్ని ఆకర్షించుకుంటారు."

"ఛ... ఛ ... శరీరాన్ని అమ్ముకోవడం ? ఎంత నీచం" మాధవ్ ముఖం జుగుప్సతో నిండిపోయింది.

"డబ్బు పెట్టకుండా తేరగా దొరికే ప్రియురాళ్ళు అందరికీ దొరకొద్దూ ?" వెటకారం వుట్టిపడింది సుధీర్ వ్యాఖ్యానంలో.

"తేరగా ప్రియురాళ్ళు అంటే నీ ఉద్దేశం ?" రోషంతో ఎర్రబారింది మాధవ్ వదనం.

"మిష్టర్... ఇంకా నటించకు నా దగ్గర ! నీ విషయ మంతా నాకు తెలుసు. నీవు రాధతో కులుకుతున్నావు. అదే నే ననడం. అర్థమైందా ! అ హ్హా హ్హా" విషపు నవ్వు వెలువడింది సుధీర్ పెదాలపైన.

"షటప్... ఏమిటి నువ్వనేది ? రాధతో అక్రమ సంబంధం ? ఎంత మాటన్నావు ! నేను చేసుకోబోయే రాధ నిప్పుకణిక. ఆమె ననడానికి నీకు నోరెల్లావచ్చిందంటా ?" పళ్ళు నూరాడు. పిడికిళ్ళు బిగించి కసిదీరా అరచేతిలో కొట్టుకోసాగాడు.

"భార్యట భార్య. ఎంతమందికి భార్య ? శేఖర్‌కు భార్య ... నీకు... అ హా హా హా ఏం పతివ్రత ? తన

నెవరూ చేసుకోరని నిన్ను వల్లో వేసుకొని, ఆడిస్తుంటే నీవది ప్రేమనుకొని మురిసి పోతున్నావ్. ఆమె యవ్వనం దిగజారి నాక నిన్నప్పుడు తరిమేస్తుంది. చెల్లెల్నిచ్చి చేసి నిన్ను వల్లో వేసుకుందామనుకుంది. అది అడ్డం తిరిగే సరికి, ఈ ఎత్తు వేసింది, నక్కజిత్తులమారి."

"లేదు... సుధీర్ లేదు. ఆమెను గురించి నీ కేమీ తెలియదు. తనకు స్వార్థం లేదు. ఆమెకు ఆశల్ని పెంచింది నేను. ఆ రే జ్యోతికి చమురు పోసింది నేను. ఆమె దేవత!" రాధను తలుస్తున్నప్పుడు మాధవ్ కనులు గౌరవపూర్వకంగా మూసుకున్నాయి.

"ప్రస్తుతం దేవతే. తర్వాత ఏళ్ళు పైబడి దెయ్యంగా మారుతుంది. అప్పుడు శర్మకు పట్టిన గతే నీకూ పడుతుంది... ఫలాని వాడి భార్యను చేసుకున్నాడంటారు, గాని... నీ భార్య అనరు. అందరిచేత అవహేళన చేయించుకుంటూ, క్షణక్షణం నిస్పృహతో జీవించాల్సొస్తుంది. అన్ని బంధాలను లక్ష్యపెట్టక ఆదర్శం మాత్రమే ధ్యేయంగా పెట్టుకున్నవాడు మాత్రమే సమాజపు నోరు నొక్కగలడు. సంఘం కళ్ళు కప్పాలన్నా, మనం సుఖపడాలన్నా ఒకటే మార్గం. సమాజం సెభాష్ అని హర్షించేంలా పెండ్లి చేసుకోవాలి. చాటుమాటుగా మన సుఖాలను మన మనుభవించాలి. సుఖాల వెంట మనం పరుగుదియ్యాలి గాని, అవి మనల్ని వెతుక్కొని రావు, జీవితాన్ని అనుభవించాలి గాని వ్యర్థపుచ్చ గూడదు. యవ్వనం శాశ్వతం గాదు..." సుధీర్

ఉపన్యాసంలో సుగమంగా సుఖపడే మార్గాలెన్నో గోచరించాయి మాధవ్‌కు.

"అయితే ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు సుధీర్! అన్నీ నీకు చెప్పేనుకదా! రాధకెలా అన్యాయం చేసేది?"

సమస్యల సముద్రంలో కొట్టుకులాడుతూ పరిష్కారమనే తెప్పకొయ్య కోసం ప్రాకులాడే నల్లాతోంది మాధవ్ స్థితి.

"అలారా దారికి !- విషయం చెబితే తప్పించుకోడానికి నాటకంగా ఆమె భావిస్తుంది చెప్పకుండా చేసుకుంటే ప్రాణానికే ముప్పయినపుడు న్యాయమేం చేకూర్చగలవు ? ఒక్క వేటుకు రెండు పిట్టలు రాలేలా చెబుతాను. నివేదను చేసుకో, రాధను భర్తతో కాపురం చెయ్యమను. మీరిద్దరి మనసులూ ఒకటే గనుక, సంసారాలు వేరైనా ప్రేమగానే గడుస్తాయి మీ జీవితాలు. అంతకంటే గత్యంతరం లేదు. ఎలా ఉంది నా ఐడియా ?" కళ్ళు ఎగురవేశాడు సుధీర్, తాళంచెవి చెయిన్ విలాసంగా త్రిప్పుతూ.

"ఛీ...ఛీ అంత నీచానికి పాల్పడలేను. నాకు భార్య కావలసిన - రాధ- ప్రియురాలిగా ఇంపాజిబుల్, ఇంపాజిబుల్." బాధగా తల అడ్డం తిప్పాడు.

"నీలాంటి వాళ్లు ప్రపంచానికి పనికిరారు బ్రదర్. అసమర్థత, నిస్వార్థం, పిరికితనం వున్న వ్యక్తి సుఖపడలేని దౌర్భాగ్యుడు... అంతే... అంతే !" పెదవి వారగా పెట్టి చెయ్యి వ్యంగ్యంగా త్రిపాడు సుధీర్.

"శేఖర్ కిరాతకుడు. ఎలాగైనా పసిగట్టి రాధను పొట్టను బెట్టుకోగలడు. పరోక్షంగానైనా ఆమె మరణానికి కారకుణ్ని అవుతాను" జేలగా ముఖం పెట్టాడు మాధవ్.

"ఆమె బ్రతకటమే ముఖ్యమైతే నీ మీద ఆమెకు అసహ్యం పుట్టేలా ప్రవర్తించు. నీమీది ద్వేషంతో భర్తతో కాపురం చెయ్యగలదు" ఉపాయం సూచించాడు సుధీర్.

'మంచితనం, నిస్వార్థం, సున్నిత హృదయం చేత గాని తనానికి నిదర్శనాలా? పరిస్థితులకు బానిస చేతగాని వాడా?' అని ఇంకా యేవో అడగాలనుకున్నాడు మాధవ్ మళ్ళీ ఎంత వుపన్యాసం వినాల్సొస్తుందోనని, మనసులోనే అణుచుకున్నాడు.

సుధీర్ మాటలు తనెంతవరకు ఆచరించాల్సి వుందో, ఏవి యధార్థమో! అన్నీ మననం చేసుకుంటూ ప్రక్క మీద వాలేడు మాధవ్.

ఆఫీసు పనిమీద వెళ్ళి వచ్చి... తోచక పోవటం వల్ల ఏ సినిమాకో, షికారుకో ఝూన్సీని రమ్మనేవాడు మాధవ్-కాస్త రిలీఫ్ కోసం. బావ వెంట కదిలేది ఝూన్సీ. అప్పుడు ఝూన్సీని చిన్న పిల్లగా చూచేవాడు. ఇప్పుడు యుక్త వయసొచ్చిన జవ్వనిగా చూస్తున్నాడు. ఆమె సౌందర్యం మాధవును వెర్రెక్కించేదిగా వుంది. ఝూన్సీని చేసుకునే వాడి జన్మం ధన్యమౌతుంది అనిపించేది. ఆమె ప్రతి కదలికకూ

తనలో స్పందన కలిగేది. ఆమె మాట తనకు వేణుగానంలా తోచేది. వెంటనే రాధ జ్ఞాపకాలు మనసును మేల్కొలిపేవి!

ఝాన్సీ కాలేజికి వెళ్ళిన సమయంలో ఓ రోజు శారదమ్మ మాధవ్‌తో "ఝాన్సీ పెండ్లి విషయం వాళ్ళు చేసుకోవటం నమ్మకంగా లేదని- వాళ్ళు కాదంటే నీవు చేసుకునేది, ఖాయమే కదా ?" అని అడిగింది.

వెదక బోయిన తీగె కాలికి తగిలినట్లనిపించింది-

ఒకవైపు శిథిలావస్థలో వున్న పూరిగుడిసె తనను ఆప్యాయంగా ఆహ్వానిస్తుంది. ఓ అందాలభవనం నిర్లిప్తంగా వుంది- మరొక వైపు. రెండూ తనకు నివాస యోగ్యాలే. తనను కోరే పూరిపాకను పునరుద్ధరించి చల్లని నీడన సేద దీరాలా ? పాలరాతి భవనంలో స్వర్గసుఖాలనుభవించాలా ? తేల్చుకోలేక సతమతమౌతూ మౌనం వహించాడు మాధవ్.

అది అంగీకార సూచకంగా భావించింది శారదమ్మ.

"ఏరా ! అది తప్పిపోయినా నీవు కాదనవనే ధైర్యంతో వుండ మంటావా ?" రెట్టించింది శారదమ్మ.

అభిమానం, ఆప్యాయత కంటే అందం, ఆకర్షణ వంకే మొగ్గు చూపింది మాధవ్ మనసు.

"ఝాన్సీ ఉద్దేశం కనుక్కోవాలిగా ! – మనోహర్ మీద ఆశలు పెంచుకుందేమో ?" సందేహం వ్యక్తం చేసేడు మాధవ్.

"మొదట్నించీ నీవంటేనే దానికిష్టం. తండ్రి మాట దనలేక అతణ్ని వొప్పుకుందంతే. తల్లిని నాకు తెలీదూ దాని మనసు? ఆ అనుమానం నీకక్కర్లేదు. నీవు ఆమోదం తెల్పితేచాలు. తక్కిన వన్నీ నేను, అన్నయ్యా చూచుకుంటాం. అప్పుడప్పుడు జాబులు వ్రాసేవాడు మనోహర్ ఝాన్సికి. ఇప్పుడవీ రావటం లేదు." ఆశగా అతడి కళ్ళల్లోకి చూచింది.

మాధవ్ తల వంచాడు.

తప్పు చేస్తున్నానని మనసు బాధించింది కాని అవకాశాన్ని జారవిడుచుకోరాదని ఆత్మ బోధించింది... అంతర్గతం అతడిది తప్పని ఘోష పెడుతూంది. భావ సంఘర్షణ మధ్య నలిగిపోసాగాడు మాధవ్.

రాధకు టి. బి. నెమ్మదించిందని డిశ్చార్జి చేశారు. ఔట్ పేషెంటుగా వుండి, మందులు వాడుతూ అప్పుడప్పుడూ చెకప్ చేయించుకుంటూ వుండమని చెప్పారు డాక్టర్లు.

ఇంటికొచ్చిన రోజే మాధవును రమ్మని రాసింది రాధ. జాబు చూడగానే సెలవుపెట్టి వచ్చాడు మాధవ్. మాధవ్ ఇంటి లోపలి కడుగు పెట్టగానే, ఆనందంతో ఆహ్వానించింది

రాధ. ముఖం మాడ్చుకొని విసురుగా లోపలి జానకమ్మ.

నివేద రూంలోకెళ్ళి ఏదో పని చూచుకుంటూ కూర్చుంది.

రాధను చూడగానే మాధవ్ కెందుకో దుఃఖం పొంగుకొచ్చింది. చేతికి దొరికిన అమూల్య వజ్రాన్ని, నిర సించి విసిరి కొట్టబోతున్నట్లు బాధ పడ్డాడు.

"అదేమిటి మాధవ్! కన్నీరూ?" విస్మయంగా అడి గింది రాధ.

"అ... వి ..అ ...వి ఆనందబాష్పాలు రాధా!"

"ఓహో నాకే మాటలు వొప్పజెప్పతున్నావా? మాధవ్, భలే కొంటెవాడివై పోతున్నావు సుమా!" కళ్ళు చికిలించి తమాషాగా నవ్వింది రాధ.

"మందులు ఇంకా ఎంతకాలం వాడమన్నారు రాధా! ఇంకా ఎన్నిరోజులు పత్యం?" ఆలస్యాన్ని సహించలేనట్టు అడిగాడు మాధవ్.

"మందులు కొన్ని రోజులు, పత్యం బ్రతికినంత కాలం..." ఉడికిస్తూ అంది రాధ.

"అమ్మాయిగారికి చలాకీతనం ఎక్కువైందే! సరే గాని రాధా! నీ పాట విని చాలా రోజులైంది. ఒక్కపాట పాడవూ!" అభ్యర్థన గోచరించింది మాధవ్ స్వరంలో.

వయొలిన్ వాయిస్తూ పాడసాగింది రాధ. ఉరికంబా నికి ఎక్కించబోతూ ఆఖరు కోరిక తీర్చుకోమన్నట్లుగా

తోచింది మాధవుకు. తన ముఖంలో అశాంతి రాధ గమ నించకుండా జాగ్రత్త పడసాగాడు.

"రాధక్కా! నీ కసలు అలసట పనికిరాదని డాక్టర్లు చెప్పారుగా! ఆ మాట చెప్పకూడదూ! ఆయనతో!" అంది నివేద.

"సారీ, రాధా నీవు పాడకూడదని నాకు తెలీదు కదా! చెప్పకూడదూ?"

"ఎన్నని చెప్పను మాధవ్? రా! అలా సిమెంటు బెంచీమీద కూర్చొని మాట్లాడుకుందాం. ఎన్ని రోజు లయింది — మనం అక్కడ కూర్చొని?" అంటూ దారి తీసింది రాధ.

వెంట నడిచాడు మాధవ్.

తను ఆమెపై ఎలా అగ్నికణాలు కురిపించాలో తమ బంధం తెంచడానికి ఎలా ప్రయత్నించాలో, ఆమె ప్రాణం ఎలా కాపాడాలో ఆలోచిస్తున్నాడు మాధవ్.

దానికి అనుకూలత ఏర్పరచినట్లు రాధ – "చూడు మాధవ్, గోపీ చదువు ఇంకా రెండేళ్ళతో పూర్తవుతుంది. ఎలాగో కష్టపడితే అతడి కాళ్ళమీద అతడు నిలబడతాడు. మనం వున్న చోటికి రవిని తీసికెళ్ళి చదివిస్తే, అత్తయ్యా వాళ్ళకు భారం తగ్గుతుంది- ఎట్లాగో నివేద పెండ్లి చేస్తే నా కర్తవ్యం నెరవేరుతుంది. అమ్మ తన కిష్టమైన వారి దగ్గ రుంటుంది. మంచి పెండ్లి కొడుకును చూడు మాధవ్! నివేదకు

వివాహమైతే నాకు నిశ్చింతగా వుంటుంది" అంటూ మాధవ్ వైపు చూపు సారించింది రాధ.

అతడు ఏదో అవాంఛనీయమైన విషయం చెప్ప బోతున్నట్టు గంభీరంగా మారడం కనిపెట్టి కాస్తంత గాబరా పడసాగింది.

"చూడు రాధా నాలాంటివాడు పనికొస్తాడా?" ప్రక్కకు చూస్తూ అడిగాడు మాధవ్.

"నీలాంటి వాడా! దొరకడు. అది నాకే పరిమితం. మరొకడు నీలాంటివాడు వుండటం అసంభవం..."

"అయితే నేనే చేసుకుంటాను!" గబుక్కున అనే శాడు అతను.

"ఏయ్! పరాచికాలకైనా సమయం, సందర్భం వుండాలి. మరీ కొంటెవాడివై పోతున్నావు!"

"కాదు. సీరియస్‌గా చెబుతున్నాను. నేను- నేను - నిన్ను పెళ్ళి చేసుకోవడంలేదు. చేసుకోనంత మాత్రాన మన ప్రేమకేం లోటురాదు. మనం ఎప్పటిలా..."

మాధవ్ మాటల మధ్యలో అందుకుంది రాధ: "అంటే... అంటే... ప్రేమకు అర్థమేమిటి? పెళ్ళికాదా?"

"పెళ్ళయితే మొగుడౌతాడు. అలాంటి మొగుడు నీకున్నాడు. అందుకని అతడు తిరిగొచ్చాడు. నీవతనితో కాపురం చెయ్యి. మన పరిచయం మనసుకు సంబంధించింది గనుక మనసుతోనే వుండిపోదాం. రాధ మాధవుడి ప్రేయసిగానీ

భార్యకాదు. అంతమాత్రాన వారి ప్రేమకు లోటు లేదు. అయినా ఆడదానికి ఇన్నిసార్లు పెళ్ళేమిటి ?"

"మాధవ్ ! నీకేమైనా పిచ్చి పట్టిందా ? నేను... నేను నీ ప్రియురాలిగా...? ఛీ... ఛీ బుద్ధిలేదూ ?" అంటూ చెయ్యి పైకెత్తింది రాధ.

"దించుతావేం...? నా కలవాటేగా ! నీవిప్పుడు నన్ను దండించ దలుచుకుంటే, దండించు. నాకు లేని దురల వాటంటూ లేదు. సిగరెట్లు త్రాగుతున్నాను. పేక ఆడు తున్నాను. బ్రాందీ సేవిస్తున్నాను. దేనికి దండిస్తావ్ ? దేనికి వూరుకుంటావ్ ! నీ భర్తకున్న ప్రతి అలవాటూ నాకుందిపుడు. అందుకే అతడే 'మేలు' అంటున్నాను."

"నోర్ముయ్.... భర్త... భర్త...భర్త. ఎవరు భర్త ? వయసురాని చిన్నతనంలో బొమ్మలపెండ్లి చేసి భర్త అని చెబితే ఎలా నమ్మను! అది పెళ్ళా ? సరే నీ సంగతి చెప్పు. జబ్బు పడక మీదనే నిన్ను వేరే పెళ్ళిచేసుకోమని చెప్పానే- ఆనాడెందుకు శ్రీరంగనీతులు పలికావ్ ? నన్ను బ్రతికించి చిత్రవధ చెయ్యడానికా ? నేను నీకేం అపకారం చేశాను ? నేను ఏం పాపం చేశానని నన్ను వేధిస్తున్నావ్ ?" వెక్కి-వెక్కి ఏడుస్తూ ముఖానికి చేతులు అడ్డుపెట్టుకుంది రాధ.

"నే నన్నానని నీకెందుకు రోషం ? నీకు అది పెండ్లి కాదనిపిస్తే ఆ తాళి మెడలో ఎందుకుంచుకుంటావ్ ?" అని ఏదో అనబోతున్న మాధవ్ చేతిలో ఓ చీటీ పెట్టింది నివేద. కంపించే హస్తాలతో విప్పి చదువుకున్నాడు మాధవ్.

మాధవ్ గారూ !

అక్క మనసుకుగాని, శరీరానికిగాని అలసట కలిగితే జబ్బు తిరగబెడుతుందన్నారు డాక్టర్లు. మీరు దయవుంచి అక్కను పెళ్ళి చేసుకోనక పోయినా, ఆ మాట ఇవుడే ఖచ్చితంగా చెప్పి, ఆమెను బాధపెట్టి, అక్కను మాకు దక్కకుండా చెయ్యవద్దని ప్రార్థిస్తున్నాను.

ఆ చీటీ చదవగానే, చటుక్కున గొంతుమార్చి, రాధ మొహాన చేతులు తొలగించి చిరునవ్వుతో "చూడు రాధా! ఇదంతా నిజమనుకున్నావా ! ఛ...ఛ.. ఏడవడం తప్పు. ఏడవకు. నేచెప్పేది వినిపించుకోవాలి మరి" అన్నాడు మాధవ్. అది విని సంభ్రమాశ్చర్యాలతో చూచింది రాధ.

"ఇది నాటకం పోర్షన్. డైలాగులు నేనే విధంగా వ్రాసేనో! నీవేవిధంగా అంటావో చూచుకోవాలని; మా హీరోయిన్ ఇంత నేచురల్‌గా ఆక్టు చేస్తుందో లేదోనని ట్రయల్ చూచుకున్నాను. అయితే ఆమె బాగా చెయ్యలేక పోతున్నట్లు అర్థమైంది. రిహార్సల్ ఇంకా ఇవ్వాలి. నీ ఆక్షన్ ప్రకారం..." అంటూ లాలింపుగా రాధ ముంగురులు సవరించాడు మాధవ్.

"నీవనేది ఏమిటి మాధవ్ ? ఏది నాటకం, ఏది కాదు. నన్నెందుకింత వెర్రిదాన్ని చేసి ఆడిస్తున్నావ్ ? ఇదంతా అబద్దమా! ఎంత భయపడి పోయాను. అబ్బా మరెన్నడూ ఈలాంటి నాటకం ఆడకు మాధవ్! ఆడకు"— మాధవ్ హృదయం మీాద తలవుంచి తన్మయత్వంతో చెప్పింది రాధ.

"పిచ్చి రాధ! అబలవనిపించుకున్నావ్! ఎందుకంత హడలిపోయావ్ ?" అనురాగ పూరితంగా అన్నాడు నయనాలు సజలాలు కాగా.

మాధవ్, ఓ గులాబి గుత్తి తెచ్చి రాధ జడలో వుంచాడు. దేవతకు 'బలి' ఇవ్వబోయే మేకపిల్లను అలంకరించడం గుర్తుకు రాగా... సన్నగా వణికింది మాధవ్ శరీరం. గుప్పెడు సన్నజాజులు తెచ్చి మాధవ్ పాదాల మీద పోసి, నాలుగు పూలు కళ్ళకద్దుకొని జడలో తురుముకుంది రాధ.

మాధవుకు దుఃఖం పెల్లుబికింది. నిగ్రహించుకొని ఇంటిదారి పట్టాడు.

ఇంటికి వెళ్ళాలనిపించలేదు మాధవుకు. రిక్షా పిలిచి, రంగనాయకుల దేవాలయానికి పోనీయమన్నాడు. దేవాలయంలో ఏదో వుత్సవం జరుగుతూంది. అక్కడా స్థిమితంగా నిలవలేక దేవాలయం వెనకవైపు ద్వారం దాటి పెన్నవైపు దారి తీశాడు.

మాధవ్ విహ్వల మనస్సుతో ఒకొక్క చిన్నరాయి తీసుకొని నీళ్ళలోకి విసరసాగాడు. తనిప్పుడేం చేశాడో! ఏమి చెయ్యాలో, రాధను తన నుంచి ఎలా వేరు చెయ్యాలా ? చేస్తే హాయిగా బ్రతకలేడు, చెయ్యకపోతే శేఖర్ బ్రతకనివ్వడు 'ఎలా ? ఎలా ? భగవాన్ నాకెందుకీ విషమపరీక్ష ?' అనుకున్నాడు మాధవ్.

కాలం గడిచి పోయింది— ఏదో బలమైన చెయ్యి వీపు మీద పడగా, ఉలిక్కిపడి వెనుదిరిగి చూచాడు మాధవ్.

వెన్నెల్లోని మానవాకారాన్ని గుర్తుపట్టి వులిక్కి పడ్డాడు. చింత నిప్పులాంటి కళ్ళతో, మింగేసేలా చూస్తూ శేఖర్ కనిపించాడు.

"మీరా.., మీరూ నన్నెందు." చెయ్యి విడిపించుకోబోయాడు.

"రాస్కేల్... నేను వచ్చి ఇంట్లోవుంటే నీకెన్ని గుండెల్రా— రాధతో మాట్లాడటానికి ? దానికి పత్యం అన్నీ జబ్బు తిరగపెడుతుందని అలా వుంచాను గాని లేకపోతే యీ పాటికి... హు- ఇప్పుడిప్పుడే నన్నర్థం చేసుకుంటూ, నాతో సన్నిహితంగా వుంటున్న దాన్ని మళ్ళీ రేపెట్టి, నీ వల్లో వేసుకుందామనా ?"

"మిస్టర్ శేఖర్... వదులు. ఏమిటీ దౌర్జన్యం ?" చొక్కా విసురుగా లాక్కున్నాడు మాధవ్.

"నీ అంతు తేల్చి వదులుతాను. రాధను వదలి పోయిగా నీ బ్రతుకు నీవు బ్రతుకుతావా! లేక..."

"రాధకు అన్యాయం చెయ్యలేను. రాధ... రాధ" అంటూ వుండగానే మాధవ్ వీపుమీద రెండు దెబ్బలేశాడు శేఖర్.

"ఏలుకోను చేతగాక దేశం పట్టుకుపోయి మళ్ళీ..."

"ఏయ్, ఏం కూశావ్! ఈసారి రాధతో మాట్లాడటానికి వచ్చావంటే ఆమె శవమే నీకు కంటబడేది. గుర్తుం

చుకో. ఆ రోజు కాదు—గొడ్డ పలుపుతో పట్టివ్వడానికి! ఈ నాడు నీవు మొత్తుకున్నా నిన్ను రక్షించే నాథుడెవడో చూస్తాను"

డొక్కలో ఓ పోటు పొడిచాడు శేఖర్.

ఆ మొరటు దెబ్బకు ... 'అమ్మా', అని క్రిందపడి పోయాడు మాధవ్.

అపుడే కొందరుయువకులు అక్కడికొచ్చారు. చిన్నగా తప్పుకోపోయాడు శేఖర్.

"ఏమిటండీ! అతణ్ణలా కొట్టేస్తున్నారు?" గద్దించాడో యువకుడు.

"మా వ్యక్తిగత విషయాలు మీకెందుకోయ్!" నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు శేఖర్.

"మీ వ్యక్తిగత విషయాలైతే ఇంట్లో చూసుకోండి! బయటకొచ్చి కొడుతుంటే చూస్తూ ఎవరూ పూరుకోరు" అంటూ అతణ్ని అక్కడినుంచి నెట్టుకుని పోయారు ఇద్దరు కుర్రాళ్ళు.

మాధవును లేవనెత్తి, చిన్నగా నడిపించి రిక్షా మాట్లాడి ఇంటికి పంపారు తక్కినవాళ్ళు.

# 40

"రాధా! మనకు వేరే ఇల్లు అద్దెకు తీసుకున్నాను. వంట సామాగ్రి నువ్వు కొన్నవి చాలా? మరేవయినా తీసు

కుందామా ?" అన్నాడు శేఖర్, సాధారణ విషయం అడిగి నంత తేలిగ్గా.

"ఏంటి మావయ్యా! అద్దేంటీ? నీవు ప్రత్యేకంగా రూం తీసుకున్నావా? అయితే స్వయంపాకమన్నమాట..." చిన్నగా నవ్వింది రాధ.

"మావయ్య ఒంటరిగా ఎందుకుంటాడు? జంటగానే ఉంటాడు. నంగనాచి మాదిరి అడుగుతున్నావే?" అన్నది జానకమ్మ సహజ ధోరణిలో.

"మీరనేది నాకేం అర్థం కావటం లేదమ్మా! అక్కా, తమ్ముడూ ఏం నిర్ణయించుకున్నారో నాకు తెలీదు. నేను ఎప్పటిలా వున్నానంతే!" ఆందోళన వ్యక్తమైంది రాధ స్వరంలో; వింతగా చూడసాగింది ఇద్దరివైపు.

"నీవేదో దారిలో పడ్డావని సంతోషపడ్డాను కదే? మళ్ళీ మొదటికొచ్చావే? వాడంటే సుముఖంగా వుండడం, పాత్రసామానులు కొనడం అదీ నీ ఇష్టానికి నిదర్శనమను కున్నాను గాని... ఇదేం... దే?" బాధ ధ్వనించింది జాన కమ్మ గొంతులో.

"సామాను... నా సొంతానికి. మీ కనుకూలంగా పరిస్థితి నర్థం చేసుకుంటే నేనేం చెయ్యను? మావయ్య మీద నాకెప్పుడూ ద్వేషం లేదు. మేనమామగా, అతడి మేలు నేనెప్పుడూ అభిలషిస్తాను. కాని... మీరనుకునే దృష్టి నాకెన్నడూ లేదు, ఉండబోదు. నన్ను విసిగించి ప్రయో జనం లేదు" విసురుగా లేచిపోబోయింది రాధ.

"అవునే... నీకెందుకుంటుందీ? ఆ అబ్బాకు కూతురివి గాదూ? వాడి సొమ్ముతో అందర్నీ పోషిస్తూ వాణ్ని దేశ దిమ్మరి చేసేడు... నీవు అయినమటుకూ వాణ్ని ఉపయో గించుకొని ఇప్పుడు నాకేం సంబంధం లేదు అంటున్నావ్! ఏరుదాటి తెప్ప తగలేసిన చందాన చేస్తే ఎల్లకాలం నీ ఆటలు సాగవు. అప్పుడు మీ నాన్న, అన్న నీకు సపోర్టు. ఇపుడు నేను వాడికున్నాను. వాడికి పెళ్ళానివి, నాకు కూతు రివి... మా ఇష్టప్రకారం మసులుకుంటే సరే— లేదా ఎవరు అడ్డం వస్తారో చూస్తాను. ఇక్కడుంటే తప్పించుకుంటున్నావు. నిన్ను మొగుడు వదిలాడని, ఎందుకనుకోవాలే? అందుకనే కలసి కాపురముంటే అందరి ఆటలు కడతాయి. ఇతర్ల నోర్లు నొక్కుడుపడతాయి..." తనే తీర్మానించి విషయాన్ని తెలి పింది జానకమ్మ ఆజ్ఞ పాలించమనే మహారాజ్ఞిలా.

మాటలతో ప్రయోజనం లేదని మౌనమే శరణ్యం చేసుకుంది రాధ.

"అక్కయ్య చెప్పిన దానికి నీ జవాబేమిటి రాధా? అర్థాంతరంగా వుంటే ఇంక భరించేది లేదు. ఆ మాధవ్ గాడితో నువ్వు కులుకుతున్నా ఓర్చుకున్నాను. ఆ తప్పు కాచి ఏలుకోదలుచుకున్నాను. క్షయవ్యాధిదానివైనా చేర దియ్యాలనుకున్నాను. నీవు మీ నాన్నలాగా విశ్వాసఘాతకు రాలివే! ఛీ.. ఛీ... నాదే బుద్ధి తక్కువ నిన్ను ఆశించటం. ఒక్కటి గుర్తుపెట్టుకో— నువ్వు నాకు కానినాడు వాడిని నీ ఎదుటే చిత్రవధచేసి..." అంటూ పళ్ళు కొరికాడు శేఖర్.

"నీకు నమస్కారం చేస్తాను మావయ్యా. మాధవ్ నేమీా చెయ్యొద్దు. అతడి తప్పేం లేదు. నన్ను... నన్ను చంపేసెయ్- అంతేగాని... మాధవ్ మనసు విరిచి నాకు కాకుండా చేసినా సరే, నేను నీ వశం కాలేను. అది మాత్రం మరచిపోకు ..." జుగుప్సతో చూస్తూ కోపంతో వూగి పోయింది రాధ.

"చూస్తాను. ఎవడడ్డం వస్తాడో ? నీకు కొన్ని నెలలు రెస్ట్ అవసరమని చెప్పబట్టి, సరిపోయింది. లేకపోతే..." ఉక్రోషం వెళ్ళగక్కుతూ అక్కడ నుంచి కదిలాడు శేఖర్.

"ఛీ... ఛీ... నా కడుపున చెడబుట్టావే !" అంటూ విసుక్కుంది జానకమ్మ.

"నేనేం నేరం చేశానమ్మా ! ఎందుకు నాకీ శిక్ష ? నన్ను చంపినా సరే, నేను మావయ్యతో కాపురం చెయ్యను" ధృడ నిశ్చయంతో అంటూ విసురుగా లేచి వెళ్ళింది రాధ.

# 41

కాలం చురుగ్గా సాగిపోతున్నది. రాధకు ఆరోగ్యం బాగుపడింది. మాధవ్ దగ్గర నుంచి లేఖలు వస్తున్నాయి, తనూ, జవాబు వ్రాస్తూవుంది రాధ.

తనను పంజరంలో బిగించడానికి ప్రయత్నాలు జరుగు

తున్నా ఎగిరిపోయి తన గమ్యం చేరుకోవాలనే దృష్టితో ధైర్యంగా రోజులు దొర్లించసాగింది రాధ.

సెలవు పూర్తయి స్కూల్లో జాయిన్ అయింది.

నివేదను కూడా బి. ఏ. లో చేర్పించింది. తన జీతంలో ప్రస్తుతం గోపీకి పంపడం లేదు. ఆమె జబ్బున పడినప్పుడు గోపీ చదువుకు డబ్బిచ్చే ఆసామి సంవత్సరానికొకసారి లెక్కలు చూచుకుని జమకట్టొచ్చు అన్నాడని గోపీకి పంపే డబ్బు బ్యాంకిలో వేయసాగింది రాధ.

ఏదో వ్యాపారం చేస్తున్నానంటూ ఇంటికి వెచ్చాలు తెచ్చేవాడు శేఖర్.

సౌద దగ్గర నుంచి చాలా రోజులుగా ఉత్తరాలు లేవు. ప్రతిదినం ఆమె వుత్తరం కోసం చూచేది రాధ.

'పోస్ట్' - కేక వినగానే గుమ్మంలోకి పరుగులాంటి నడకతో వచ్చి అందుకుంది కవరు.

దస్తూరి సౌదదే. గబగబ చించి చదవసాగింది రాధ.

"అక్కయ్యా!

నా ఉత్తరం నిన్ను చాలా కలవర పెడుతుందని తెలుసు, కాని నీ తోబుట్టువుగా నా బాధను పంచిపెడు తున్నాను.

అమ్మకంటే నీదగ్గరే నాకు చనువుగదా! అందుకే నా మనసువిప్పి నీ కానాడు నా పరిస్థితి వివరించాను. అయినా నీవు నన్ను అత్తగారింట్లోనే ఉండమని ఆదేశించావు.

ఎంతో ఓర్పుతో కాపురం చేస్తున్నా ఆయన అను మానం పాత్రం తరగడం లేదు నా దురదృష్టమో, ఆయన బలహీనతో నా కర్థం కావడం లేదు. నా గుణం తెలీక అలా అనుమానించే వారేమో, క్రమేణా గ్రహించగలరని ఆశించాను. కాని, అది అడియాసే అయింది.

అసలే నాన్న, అన్నయ్యల మరణాలు మనసును బాధి స్తున్నా ఆయన అవసరాలు తీర్చాల్సి వచ్చేది... ఆయనకు నేనొక విలాస వస్తువును. నా తెలివితేటలు, నేర్పు నిష్ప్ర యోజనాలైనాయి. మొన్నటి సంఘటన వింటావా అక్కా!

వారు వూర్లో లేరు. మా ముసలి జవానుకు జ్వరం రాగా, అతడి మనవణ్ని పంపేవాడు. పాపను ఇంటి ముందు గ్రౌండులో చెక్కగుర్రం మీద వూగిస్తుంటే, నేను అన్నం పెట్టాలని అన్నం గిన్నెతో వచ్చాను. దానిమీదే తినిపించ మంది. ఆ అబ్బాయి కొయ్యగుర్రం వూపుతున్నాడు. నేను అన్నం పాప నోట్లో పెడుతున్నాను. పరాగ్గా వూపుతున్నా డేమో, ఆ ఊపుకు పాప పట్టుదప్పి క్రిందికి వొరగబోయింది. తటాల్న ఆ పిల్లవాడు ముందుకు వంగాడు. నేను పట్టుకో బోయి ముందుకు ఒరిగాను. పాప తల ప్రక్కకు జరిగింది. నా తల అతడి తలకు తగిలింది. పాప కిలకిలా నవ్వుతూ చప్పట్లు చరిచింది. ఆ హఠాత్పరిణామాన్నుంచి ఇద్దరం తేరు కుని పొరపాటును చెప్పుకునేలోగా పాపనవ్వు చూచి మేమూ శ్రుతి కలిపాము. అప్పటికి శ్రీవారు వీధి కిటికీలి

దగ్గరకు వచ్చిన వైనం మా ఇద్దరికీ తెలీదు. తెలిసినా కావాలని చేసింది కాదుకదా అని నేనేం భయపడలేదు.

తనతో క్యాంప్ కెళ్ళిన జవానును ఇంటికెళ్ళమని, తన బ్యాగ్‌ను తాత మనవడు రంగడ్ని తెమ్మన్నారు. వాడు అసలే హుషారైన వాడేమో!

"సార్! మన పాపేమో గుర్రం మీద కూర్చుని..." అని ఉత్సాహంగా చెప్పుకుంటూ పోసాగాడు.

ఆయనకు కోపం మితిమీరింది.

నేను హడలిపోయాను. రంగడికి వీర్ని గురించి తెలీదు. ఉల్లాసాన్ని చెరగనివ్వకుండా చెప్పుకుపోతున్న వాణ్ని జబ్బ పట్టుకుని... గుంజి "రాస్కెల్!...నీ తాహతెంత, నీవెంత? నా పెళ్ళాం సరసన ... పరాచికలాడ్డం గాక ... తలలు ఆనించుకుంటారా...!" అంటూ బెల్టు తీసుకుని కర్కశంగా కొట్టడం ప్రారంభించారు.

"నేనేం చేశాను సార్! నా తప్పేం లేదు సార్!" అంటూ హృదయవిదారకంగా ఏడవసాగాడు అతను.

నేను అడ్డుపోయాను. నాకూ రెండు అంటించారు. రంగడి శరీరం మీద 'బెల్టు' నాట్యం చేసింది కొంతసేపు. రంగడి ఒళ్ళు వాతలు లేచింది. ఇంక సహనం కోల్పోయాను. చేతిలోని 'బెల్టు' లాక్కుని వాణ్ని రెక్క పట్టుకుని వాకిట్లోకి లాక్కుపోయి తలుపు వేసేను.

"ఒరే ఫూల్! నీవు రేపు తెల్లవారిన తరువాత కంటికి కనిపించావా? అమ్మగారి పని ఖాళీ? పాప అమ్మ

శవమో - నీవు వూరెళ్ళి పోవడమో! నిర్ణయించుకో ... మేం ట్రాన్స్ఫరయి వెళ్ళేదాకా ఈ ప్రాంతాల్లో వుంటే జరిగేది అదే. జాగ్రత్త..." అంటూ విసురుగా బెల్టు ఝుళిపించారు.

"నే లేకుండా చూచి వాడితో హాయిగా గడుపుతున్నావన్న మాట... ఎక్కడికి పోతాయి బుద్ధులు... ఏదో ఒకటి చేసి చెడగొట్టుకుని అక్కడకు తోడు పుట్టిల్లు చేరుదామని... ఎత్తు వేస్తున్నావు! నాకే బుద్ధిలేక నీ సౌందర్యానికి ప్రలోభపడి కాపరం చేస్తున్నాను. అందమైన ఆడదానికి ఇంత చెడ్డబుద్ధి వుంటుందనుకోలేదు. అందుకే మొగుడెట్టుంటే ఏమని... నన్ను చేసుకుని... అడ్డం పెట్టుకుని ఆడాలంటున్నావ్! ఛీ... ఛీ... నీ లావణ్యం పిల్లలకు రావాలని చెడ్డ కోరిక కోరుకున్నాను. అది పెద్దదై నీ గుణాలే వచ్చి యింకో మొగవాణ్ని వేధిస్తుందని ఆలోచించలేక పోయాను. అందుకే 'భార్యా రూపవతీ శత్రుః' అని వూరికే చెప్పలేదు ...నిజం చెప్పు... నిజం చెప్పు..." అంటూ నన్ను అదే పనిగా బాదసాగారు.

"వాడు నాకు తమ్ముడితో సమానం" అని ఎంత మొత్తుకున్నా వినలేదు.

"తమ్ముడిలాంటి వాడని నమ్మించి, వాడితో వుడాయించాలని ప్లానేసుకుని..." ఆయన ఏదేదో చెప్పబోయారు.

"ఛీ... ఛీ... మీరు ఎంత భర్త అని ఓర్చుకున్నా,

నేనూ మనిషినే... నాకేం వ్యభిచారిగా బ్రతకాల్సిన అవసరం లేదు. మరెప్పుడైనా ఆ మాట... మీ నోటినుంచి వస్తే... నా ప్రాణం తీసుకోడం ఖాయం... అన్నాను బాధగా.

"ఇంకా 'ఛాయిస్' కావాలా? నేనింకా అందరి నోళ్ళలో నానేదాకా బ్రతికుండాల్నా?" మళ్ళీ కొట్టారు.

శరీరం ఆయన చేతికర్పించి, బాధ భరిస్తూ వుండి పోయాను. గేట్లో ఎవరో పిలవగా లేచి వెళ్ళారు. ఆ రాత్రి పాపను దగ్గర పడుకోబెట్టుకుని అలాగే పడుకున్నాను. ఎప్పుడు నిద్రపోయానో ఏమో? ఆయన ఒక్క లాలింపు మాట కూడా అనలేదు.

మరునాడు ఏమీ జరగనంత హాయిగా బజారుకు వెళ్ళి పోయారు జవాను వెంకయ్యతాత భార్య వచ్చి నానామాట లన్నది.

"పసివాడు వాడికి తెలీక తొందరపడితే, నువ్వన్నా చెప్పగూడదంటమ్మా? నీ జీవానికి వాడు దేశాలు బట్టుకుని పోయిండు. పుణ్యం గట్టుకున్న మహాతల్లివి..." అని ఇంకా ఏదేదో అనసాగింది.

నా తల తిరిగిపోగా, ఎలాగో నిగ్రహించుకుని "నా మాట వినవమ్మా! వాడేం తప్పు చెయ్యలేదు... ఆయన అనుమానం మనిషి గనక అలా చేసేరు. మావల్ల రంగడికంత అన్యాయం జరిగిందని నేనెంతో బాధ పడుతున్నాను. నీవు కూడా నన్ను అనుమానిస్తున్నావా? తాతను నన్ను గురించి

అడుగు..." అన్నాను- నా గురించి అంత నీచంగా మాట్లాడుతున్నందుకు కుమిలిపోతూ.

"తాతకేం దెలుసుద్ది? వాడు ఎర్రంగ బుర్రంగ కనపడి వుంటాడు. మీా ఆయన అద్దాన్నపోడయ్యో... వయసు అనుమంటిది... మా వోడే దొరికిండా? ఏపీ చూడండీ అయ్యగారెందుకోక్కప్పడతాడూ?" అని నిందను నామీాద మోపింది.

"నేను... నేను అంత నీచురా...ల్నా?"ఆ మాటలు వినలేక నాకు కళ్ళు తేలిపోయాయి. తలమీాద ఎవరో సుత్తితో కొట్టి నట్లయి, తల పట్టుకుని కూర్చుండిపోయాను.

నేను తేరుకుని చూచేసరికి, క్రోధంగా చూస్తూ వారు నా ఎదుట నిలబడి వున్నారు.

"నేనంతా విన్నాను... నీవెంత విచ్చలవిడిగా ప్రవర్తించకపోతే ఆమె అంత అసహ్యంగా మాట్లాడ్తుందీ? ఇంక నిన్ను క్షమించలేను... అందరికీ తెలిసి అల్లరిగాక ముందే వెళ్ళిపో. నేను క్యాంపు కెళ్తున్నాను. ఎవరికైనా చెప్పావో నీ పరువే పోతుంది. నీవెప్పుడు ప్రయాణం చెయ్యగలవనిపిస్తే అప్పుడే వెళ్ళు. నేను నాలుగు రోజుల వరకు రాను..." అంటూ క్యాంపుకు గుడ్డలు సర్దుకుని వెళ్ళిపోయారు

చెప్పక్కయ్యా! నా తప్పేమిటో! వాళ్ళకు అనుమానం వుండడం నా తప్పా? అన్నిటికీ అన్నీ అన్వయించుకుంటే నేనేం చెయ్యనూ? అక్కడ నాకు స్థానం లేదు. పుట్టింట్లో స్థానం వుండదని నీవే నిక్కర్షగా చెప్పావు.

అందర్నీ తనలో ఇముడ్చుకునే భూదేవి వుంది. పరువుతో మరణించడమే మేలుకదా ! నా కథ తెలిసిన ఏ కన్నెపిల్ల ఐశ్వర్యం గురించి భ్రమ పడరాదు. అందంతో అన్నీ జయించాలనే అభిప్రాయం కలిగించుకోరాదు. అందుకే నా పిల్ల వాళ్ళింట్లో పెరక్కూడదు. ఈ బంగారు పంజరం దానికొద్దు. దాన్ని ఓ ఆదర్శవంతురాలిగా పెంచు. పెళ్ళిచెయ్యకు. ఓ యువకుడి అనుమానానికి గురిచెయ్యకు. ఏ లోకహిత కార్యాలలో సహకరించే ఆదర్శవాదిగా తీర్చిదిద్దు నా చివరి కోరిక నెరవేరుస్తావుకదూ ! ఇంక నీవు నన్ను సజీవంగా చూడలేవు. ఇవే నా ఆఖరు మాటలు.

నీకీ విషయం చెప్పకుండా చనిపోతే, నేనే ఏదో తప్పు చేసి తప్పు బైట పడకుండా కాపాడుకోడానికి యిలా చేశానని నీ కనిపించకుండా తెలుపుతున్నాను. అభిమానంగల ఆడది- వ్యభిచారివని భర్త అని నప్పుడూ, నిజమై వుంటుందని ప్రజలకు తోచినప్పుడూ ఎలా బ్రతికుంటుందంటావ్ ! నేను చనిపోవడం తప్పా చేయడమా! చేయించడమా! చెప్పక్కా!

కనీసం నీ జీవితమైనా స్వర్గధామం కావాలని కాంక్షిస్తూ ముగిస్తున్నాను.

నీ సౌద.

రాధ దుఃఖభారంతో తను చదివి వినిపించలేక నివేద చేత సౌద ఉత్తరాన్ని తల్లికి వినిపించింది.

తన బాధ తగ్గగానే మనసులో వేడి తగ్గి మరణాన్ని

దూరం చేసుకోగలదు సాక. కాలం జరిగే కొద్దీ సాధలేని వెలితినీ, తన చెడ్డస్వభావాన్ని తెలుసుకుని పశ్చాత్తాప పడ గలడు నిరంజనరావు, అనుకుని సాధను ఇంటికి తీసుకురావాలని తీర్మానించుకున్నారు. సెలవుపెట్టి ప్రయాణానికి బ్యాగ్ సర్దు కోవడంలో నిమగ్నమైన రాధకు పోస్ట్‌మేన్ కేక వినిపించింది.

పోస్ట్‌మేన్‌ను చూడగానే రాధకు గుండె దడ పుట్టు కొచ్చింది. 'టెలిగ్రామ్' చదివి కుప్పలా కూలిపోయింది. నివేద, జానకమ్మ ఆత్రుతతో అడిగారు.

ఎలాగో గొంతు పెకలించుకుని "సాధ మనకింక లేదమ్మా!" పెద్దగా రోదించడం మొదలుపెట్టింది రాధ.

జానకమ్మ గుండెలవిసేలా ఏడవసాగింది. నివేద కనులు కాల్వలయ్యాయి.

ఎవరూ ఏమీ మాట్లాడలేకపోయారు. విషయం తెలుసుకున్న శేఖర్ జానకమ్మనూ, రాధను గుంటూరుకు ప్రయాణం చేశాడు- శవాన్ని అక్కడకు తీసుకొచ్చినట్లుగా టెలిగ్రాంలో వుంది.

శేఖర్ దుడుగ్గా మాట్లాడుతాడేమోనని అతణ్ని వద్ద న్నది రాధ. జానకమ్మనైనా- ఎంత వేదన కలిగినా, ఒక్క మాటైనా మాట్లాడకుండా వుండేట్లయితేనే రమ్మంది రాధ.

"కన్నకూతురి ఆఖరు చూపుకోసం,నా క్రోధాన్నణచు

కుని నోరెత్తకుండా వస్తానే!" అని బతిమాలింది జానకమ్మ.

*          *          *

ఒళ్ళు కాలి మరణించిన చెల్లెలి శవం భయానకంగా, వికృతంగా, హృదయవిదారకంగా కనిపించింది రాధకు.

"నీ అందం నీకు శత్రువని, చివరి రూపం గుర్తుకొస్తే అసహ్యించుకునేలా నీకు నీవే శిక్ష విధించుకున్నావా? చెల్లీ!" పైకి అనలేక లోపలే గొణుక్కుంది రాధ.

జానకమ్మ కుమిలి కుమిలి ఏడుస్తూ కూర్చుంది.

పాప "అమ్మా...అమ్మా" అంటూ గోలగా ఏడుస్తోంది.

*          *          *

జరగవలసిన తతంగమంతా ముగిసినతర్వాత, జానకమ్మ, రాధ ప్రయాణమై, నిరంజనరావుతో చెప్పడానికి అతని రూము దగ్గర కెళ్ళి నిలుచున్నారు.

సౌద ఫోటోకేసి చూస్తూ కన్నీళ్ళు కారుస్తున్నాడు అతను.

"రావుగారూ! మేము వెళుతున్నాం...పాపను తీసికెళ్ళమంటారా!" అంది రాధ మనసులో దావానలం దాచుకుంటూ—నెమ్మదిగా.

"రాధాదేవిగారూ! సౌద నన్నన్యాయం చేసిపోయిందండీ...నా...సౌద..."

"ఎవరు ఎవర్ని అన్యాయం చేశారో నాకు తెలుసు. సౌద నాకు జాబు వ్రాసింది. ఇప్పుడవన్నీ ఎందుకూ? నేనడిగిం దానికి సమాధానమివ్వండి." నిశితంగా చూస్తూ అన్నది రాధ.

"సౌద, చివరి కోర్కె కూడ అదే? తీసి... కెళ్ళండి..." పాప నొక్కసారి హృదయానికి హత్తుకుని రాధ చేతికందిచ్చాడు. అప్పుడే అక్కడి కొచ్చిన సౌద అత్తగారు "తీసుకెళ్ళండమ్మా! నేనే చెప్పాలనుకుంటున్నాను. రేపు వాడి కెవరైనా పిల్లనివ్వనొస్తే ... పాపను పెంచడానికి భయ పడొచ్చు. ప్రస్తుతం దాన్ని చూసేవాళ్ళు కూడా లేరు. నాకు ఓపిక లేదు. కావాలంటే పిల్లను పెంచుతున్నందుకు డబ్బు పంపమంటే..." అనబోయింది. ఆమె మాట పూర్తి గాకముందే "డబ్బు...డబ్బు ... డబ్బు ... మీకు డబ్బు, హోదా ముఖ్యమైతే మాకు మనసు, మనుష్యులు ముఖ్యం. చిన్న పాపను పెంచలేనంత దరిద్రులం కాదులెండి! ఆ డబ్బు వాసనతో మానవత్వాన్ని మరిచిపోతుందనే ఈ పాపను మేము పెంచాలనుకుంటున్నాము!" రాధ ప్రతి వాక్యంలో ఆక్రోశం, ఆవేదనా ధ్వనించాయి.

జానకమ్మ నిప్పులు రాలే కళ్ళతో చూస్తూ రాధ వెను కనే కదిలింది.

# 42

"ఏరా వాళ్ళు మీకు వేరే సంబంధం స్థిరపరుస్తున్నారు గనుక, నన్ను మా బావ మాధవరావు కివ్వాలని మా అమ్మ పట్టుపట్టి కూర్చుంది" అని ఝాన్సీ ఎన్నో ఉత్తరాలు వ్రాసింది మనోహర్ కు.

ఒక్క లేఖకైనా జవాబురాలేదు. మౌనమే అయిష్టతకు సూచనగా భావించి మనసు స్థిరపరచుకుని మాధవ్ ను చేసుకోడానికి తన సమ్మతిని తెలిపింది ఝాన్సీ.

అసంతృప్తిగా పెళ్ళికొప్పుకున్నా, ఓ ఆశాకిరణం మెదిలేది ఝాన్సీ మనసులో-మనోహర్ తనను పెళ్ళి చేసుకుంటానని జాబు వ్రాస్తాడేమోనని.

అందుకే తల్లికి కొన్ని షరతులు పెట్టింది— మనోహర్ తనకై తాను పెళ్ళిచేసుకోవడం లేదని రాస్తేనే, మాధవ్ తో పెళ్ళి ముహూర్తం పెట్టుకోవాలనీ; పరీక్షలు ముగిసేవరకూ వివాహ ప్రయత్నాలు చెయ్యవద్దనీ.

దానికి శారదమ్మ వ్యతిరేకించలేదు.

మనోహర్ తండ్రికి అతని దగ్గర నుంచి ఉత్తరాలొస్తున్నట్టూ తన తల్లి ఇష్టప్రకారం పెళ్ళి సంబంధం స్థిరపరచమన్నట్టూ రాస్తున్నాడనీ చెప్పేది కామాక్షమ్మ. త్వరగా ఝాన్సీకి పెళ్ళి చెయ్యమని ఒత్తిడి చేసేది.

"మనోహర్ మా సంబంధం చేసుకోనని నేరుగా రా_స్తేనేగాని ముహూర్తం పెట్టుకోము" అన్నది శారదమ్మ.

"నేను త్వరలో రాబోతున్నాను. వాళ్ళు తొందర పడుతుంటే, ముహూర్తాలు ఎప్పుడు పెట్టిస్తున్నారో వ్రాస్తే, నేనెప్పుడు రావడానికి వీలవుతుందో రాస్తాను" అని మనోహర్ వ్రాసిన జాబు తెచ్చి చూపించింది కామాక్షమ్మ.

"అది మా సంబంధమే కావచ్చుగా!" అంది శారదమ్మ కొ_స్త ఆశను పెంచుకుంటూ.

"శారదమ్మా! మేమీ మధ్య కామేశ్వరరావు గారింటికి వెళ్లి అన్నీ మాట్లాడుకొచ్చాము. ఆ అమ్మాయి ఫొటో గూడా పంపేము. వాళ్లు 'ప్లిమత్' కారు, ముప్పైవేలు ఇస్తామన్నారు. అదీ రాసేము. ఆ సంబంధం మీదనే చర్చలు జరుగుతున్నాయి. అమ్మాయి నచ్చిందని పెళ్ళి ఖాయపరచమని రాసేడు..."

ఆ లేఖ చూడగానే శారదమ్మ, ఝాన్సీల చివరి ఆశ గూడా అంతరించింది.

*　　　*　　　*

సోమశేఖరాన్ని పిలిపించి, మాధవ్‌కు విషయం తెలుపుతూ, వచ్చి నేరుగా మాట్లాడి పొమ్మని వ్రాసింది శారదమ్మ.

తన స్వార్థం గానీ, ఝాన్సీ ఆకర్షణగానీ, తల్లిదండ్రులు, అత్త ఆదేశం గానీ, రాధ ప్రాణ రక్షణార్థం

గానీ—ఏది ఏమైనా మాధవ్ ఎంతో ఆలోచించిన మీదట ఝాన్సీని చేసుకోడానికి ఒప్పుకున్నాడు.

ఝాన్సీకి తనంటే యిష్టమేనని అత్త చెప్పిన మాట మీద నమ్మకంతోనూ, ఝాన్సీ తన పట్ల నిరసన భావం చూపనందుకు ఝాన్సీని తను ముఖా ముఖి అడగదలచుకో లేదు.

# 43

కొందరి మరణాలు మంచి రోజుల్ని దూరం చేస్తే, కొన్ని కష్టాలు కొన్ని విధాల మేలుచేస్తాయి. అది రాధ విష యంలో యదార్థమైంది. శ్రీధర్, రాఘవయ్యల మరణం మాధవ్ తో సాన్నిహిత్యానికి అవకాశం కల్పించలేదు.

తన జబ్బు, సౌద చావు—ఆమెకు వ్యతిరేకమైనా శేఖర్ ను దూరంగా ఉంచింది.

సౌద గురించిన దుఃఖంతో ఎవ్వరూ, దేన్ని గురించీ ప్రస్తావించక యంత్రాల్లా పనులు చేసుకుపోతున్నారు. అంద రికీ పాప ముద్దు మాటలు, ఆటలు కాస్త ఆహ్లాదాన్ని కలిగిం చేవి.

శేఖర్ రాధను దేనికీ పలకరించడం లేదు. వేరే యింటి ప్రస్తావన తేవడం లేదు.

శేఖర్ అప్పుడప్పుడూ హాస్పిటల్ కెళ్ళి మందులూ, ఇంజక్షన్లూ తీసుకుంటున్నాడు. కారం వెయ్యని పదార్థాలు

చేయించుకుని తింటున్నాడు. అతడికేమైందో, ఎవరూ అంతగా పట్టించుకోవడం లేదు.

అలా దినాలు దొర్లిపోసాగాయి. ఒకరోజు పిడుగు లాంటి వార్త విన్నది రాధ. అది-ఝూన్సీతో మాధవ్ పెళ్ళి గురించిన వార్త. దాన్ని నమ్మలేకపోయింది రాధ. అతడి మీద నీలాపనిందలు కల్పించి చెప్తున్నారని భావించింది.

'ఆ ఆలోచన అతడికుంటే తను జబ్బుగా వున్నప్పుడు అతణ్ని మరొక అమ్మాయిని వివాహం చేసుకోమన్నప్పుడు వొప్పుకుని వుండేవాడు. అతణ్ని గురించి తనకు చాలా చాలా వినిపిస్తున్నారు. శేఖర్ ఒకసారి "నావి దుర్గుణాలని నీ కసహ్యం అంటావే? ఇప్పుడు మాధవ్ పూర్తిగా మారిపోయాడు. త్రాగుబోతు కూడా అయ్యాడు" అంటే తను నమ్మిందా? 'నాకు అతడిమీది మనసు విరచడానికి జరుగుతున్న పన్నాగాలు మాత్రమే! లేకపోతే మాధవ్ ఏమిటి? చెడిపోవడ మేమిటి?? ఎవరినన్నా పెళ్ళి చేసుకోవడమేమిటి??? తను నమ్ముతుందనేనా...హు...' మనసులో నవ్వుకుంది రాధ.

'సరే ఈ రోజే వచ్చాడన్నారుగా! సాయంకాలం వస్తే అతణ్నే అడిగితే పోలా?' అని మనసుకు సరిపెట్టుకుంది.

కాని లోలోపల ఎక్కడో ముల్లులా కసుక్కుమనక పోలేదు—తాను విన్నది నిజమేమోనని.

సాయంకాలం ఎంతో ఉత్సుకతతో నిరీక్షించింది రాధ, కాని మాధవ్ రాలేదు.

నివేద ఏదో పనిమీద వైదేహమ్మ గారింటికెళ్ళి వచ్చింది. ఆమె ముఖం కళావిహీనంగా వుంది. అక్కతో ఏమి చెప్పాలో అర్థంగాని నిర్లిప్తంగా వుండిపోయింది.

రాధ తరచి తరచి అడిగిన మీదట "మాధవ్‌కు యూనిస్సీ నివ్వాలనుకోవడం నిజమేనట...అందరూ సెలవులకు గుంటూరు వెళుతున్నారట...నేను వాళ్ళింటికెళ్ళేసరికి మాధవ్ ఎక్కడికో వెళ్ళాడని ఇంట్లోవాళ్ళు చెప్పారు" అని తెలియపరచింది నివేద.

ఎందుకో నమ్మబుద్ధి కాలేదు రాధకు. అందరూ ఏదో నాటకమాడి తనను శేఖర్‌తో కలపాలనుకున్నారను కుంది. ప్రొద్దుపోయేదాకా ఎదురు తెన్నులు చూచి నిస్పృహతో పడుకుంది రాధ.

కళ్ళముందు మాధవ్ స్మృతులు మెదిలి కలవర పెట్టాయి. తెల్లవారిన తరువాత వస్తాడని వేయికళ్ళతో చూడసాగింది. వైదేహమ్మ తామంతా గుంటూరు వెళ్ళు తున్నట్లు తమతో చెపుతూ, ఇంకో గంటలో ట్రైనుకు అందరూ వెళుతున్నట్లు చెప్పింది.

అప్పటికి రాధ నమ్మకం సడలింది. యదార్థం చెప్ప లేక, దాచలేక మాధవ్ ఎవటపడలేక పోతున్నాడని గ్రహించి, అందరిలో మాట్లాడే అవకాశం ఏమీ లేదని - తను తెలుసుకోవలసినవి, చెప్పవలసినవీ అన్నీ కాగితం మీద వ్రాసి, కవర్లో పెట్టి అంటించింది. తను రివాజు ప్రకారం 'స్వీట్లు' ప్యాకెట్లు 'బ్యాగ్'లో పెడుతుంది గనుక ఇంకో

కవర్‌లో ఉంచిన జాబును ఆ ప్యాకెట్‌లోనే వుంచి నేరుగా స్టేషన్ కెళ్ళింది.

రాధను చూచి మాధవ్ గతుక్కుమన్నాడు. నేరం చేసి, పోలీసుల్నించి తప్పించుకునే దొంగలా వుంది అతడి ముఖం తీరు.

'నా సర్వస్వం దోచుకుని నన్ను అనాధను చేసి పోతున్నావా?' అనే రోషం, ఆవేదనా, రాధ వదనంలో ప్రతిబింబిస్తున్నాయి.

బాధ, విచారం వంటి ఎన్నో భావాలు మేళవించి వున్నాయి మాధవ్ ముఖంలో.

'ట్రైన్' వస్తున్న గంట కొట్టారు. అందరూ సామాన్లు సర్దుకునే హడావుడిలో వున్నారు.

"రాధా? ... నన్ను అపరాధిగా భావిస్తున్నావా? నే నెందుకు ఈసారి ఇంటికి రాలేదో నీకు తర్వాత తెలుస్తుంది" అంటుంటే మాధవ్ గొంతు బొంగురుపోయింది.

"మాధవ్! నువ్వు కూడా నన్ను వంచించావా?"

వెయ్యి గొంతుకలు ఆర్తితో అలమటించినట్లనిపించింది మాధవ్‌కు.

"లేదు రాధా! నేను ఏది చేసినా నీ మేలుకోరే... నిన్ను...నిన్ను..."

రైలు వచ్చి స్టేషన్‌లో ఆగింది. అందరూ పెట్టెలు ఎత్తుకుంటూ మాధవ్‌ను కేక వేసేరు.

"మాధవ్! ఈ ప్యాకెట్టులో ముఖ్యమైన స్వీట్లున్నాయి. వాటి రుచిచూచి ఆలోచించుకుని ప్రత్యుత్తరం వ్రాస్తావుగా?" ప్రాధేయంగా పలికింది రాధ కంఠం.

ఆమె చేతి మునివ్రేళ్ళు ఆప్యాయంగా నిమిరి 'అలాగే' అంటూ ముందుకు సాగాడు మాధవ్.

ట్రైను కదులుతుంటే ద్వారం దగ్గర నిలబడిన మాధవ్ కళ్ళలో నీటి చక్రాలు కదలాడాయి.

అతడి ముఖం-ఎన్నో సందేశాలు, ప్రార్థనలు, వేదనల సమూహంగా గోచరించింది.

మాధవ్ వెళుతున్న రైలు తన గుండెల మీద నుంచి దాటి వెళుతున్నంత బాధ కలిగింది రాధకు.

విచారపూరితమైన మనసుతో నీరసంగా పడే అడుగులతో యాంత్రికంగా స్టేషన్ వదిలింది రాధ.

మాధవ్ నుంచి లెటర్ వస్తుందని రోజూ ఎదురు చూచేది రాధ. తన నిరీక్షణ వృథా కాగా నిస్పృహతో స్కూలు కెళ్ళేది. ఒకవేళ మనసు కరిగి...తనను......పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించి వ్రాయవచ్చు కదా అని ఆశ కలిగినా, మళ్ళీ మరింత చీకటి అలుముకునేది. 'మాధవ్‌కు యూన్సీతో పెళ్ళి' అనుకున్నప్పుడు తన నరాల నెవ్వరో జివ్వున లాగినట్లయ్యేది రాధకు. క్షణ క్షణం నెత్తిన పిడుగు పడుతుందని భయం. నిమిషానికీ ఓ ఆశాకిరణం తళుక్కుమన్న భ్రమ - వాటి మధ్య వేగిపోయేది రాధ మనసు.

రాధ పరాగ్గా... టేబుల్ మీద పుస్తకాలు సర్దు తుండగా, నాలుగుమూలలా పసుపు అంటించిన కవరు కనిపించింది. అనుకోకుండానే లోపలి కాగితం బయటికి తీసి చదివింది. అది 'శుభలేఖ!' చకచక చదువుకుంటూ పేర్ల దగ్గరికొచ్చేసరికి షాక్ తిన్నట్లయింది రాధకు. కంపించే చేతుల నుండి శుభలేఖ జారి క్రిందపడిపోయింది.

కాళ్ళు తేలిపోతుంటే, కళ్ళుతిరిగిపోతుంటే, టేబుల్‌కు చేతులాన్చి నిలుచుంది రాధ.

తన సర్వస్వం కోల్పోయినట్లుగా, తను శూన్యం లోకి విసిరి వెయ్యబడ్డట్టుగా, భ్రాంతి కలిగింది. కాళ్ళ క్రింద భూమి కదిలినట్లయింది. తను దూది పింజగా మారి గాలిలో తేలిపోతున్నట్టు తోచింది.

చిన్నగా వెళ్ళి మంచంమీద పడుకోవాలనుకుంది. కళ్ళు మూతలు పడగా, అడుగులు తడబడగా ముందుకు నడిచింది.

ఎవరిదో హస్తం ఆమెను తాకింది. 'అది మాధవ్ దయివుంటే? కాదు...కాదు. అది ఎంతో మధురమైన స్పర్శ...ఇంకెవరు ముట్టుకున్నా అలాంటి అనుభూతి కలగదు.' అనుకుంటూ రెప్పలెత్తి చిన్నగా చూచి...విషాదంగా నవ్వింది.

తనను రెక్కపట్టి నడిపించే శేఖర్ ముఖం చూడలేక పోయింది రాధ. ఆ ముఖంలో విజయగర్వం చూడలేదు

తను. తన వోటమిని అంగీకరించలేదు. అది విధికే వదలాలను కుంది. అందుకే నిర్లిప్తంగా వుండిపోయింది.

సహానం తెచ్చుకుని, శేఖర్ వైపు చూచింది. అతడి ముఖంలో ఏ భావనా లేదు. పరికించి చూస్తే పశ్చాత్తాపమేదో మెదిలినట్లయింది. అది తన భ్రమో లేక అతడి నటనో కావచ్చు.

"మామయ్యా! మొదటిసారిగా నిజం చెప్పు! ఇది నీవు నన్ను లొంగదీసుకోవాలని చేసిన ఘనకార్యం కాదు కదా! నిజంగా మాధవ్ బుద్ధిపూర్వకంగా వొప్పుకుని..." ఏదో చెప్పబోతూ, దుఃఖం కట్టలు త్రెంచుకోగా, నోటికి అరచెయ్యి అడ్డుపెట్టుకుంది ఆమె.

"అబద్ధం చెప్పేవాడు నిజం చెప్పినా నమ్మరు రాధా నేను చేసిన పనిమాత్రం కాదు. నీకు నమ్మకం లేకపోతే హైదరాబాద్ వెళ్ళి సత్యమో కాదో కనుక్కునిరా!" అన్నాడు శేఖర్.

నిర్మలంగా ఉందతడి ముఖం.

"అయితే నిజమేనన్నమాట! మాధవ్...! ఎంతపని చేశావ్...?" అంటూ బావురుమంది రాధ.

ఎవ్వరూ ఆమెను ఓదార్చలేక పోయారు.

మనసును కూడగట్టుకుని ఏదో నిర్ణయించుకుని బ్యాగ్‌లో రెండు చీరలు సర్దుకుంది. మాధవ్ వ్రాసిన లెటర్లు బ్యాగ్‌లో కుక్కుకుని తను హైదరాబాద్ వెళ్ళ

తున్నట్లు నివేదతో, జానకమ్మతో చెప్పి రిక్షా ఎక్కి స్టేషన్ కెళ్ళింది రాధ.

ఎవ్వరికీ ఆమెను ఆపే సాహసం లేక పోయింది.

# 44

అడ్రసు ప్రకారం మాధవ్ వుంటున్న సుధీర్ ఇంటి ముందు రిక్షా ఆగింది. రాధ దిగి తలుపు తట్టింది.

కిటికీలోంచి చూచిన సుధీర్ హంతకుణ్ని పట్టుకో డానికి వచ్చిన పోలీసాఫీసర్లా కనిపించింది రాధ. ఒక్క-క్షణం తను అపరాధినే ననిపించింది. వెంటనే క్రోధం ముంచు కొచ్చింది. ఇద్దరు మనుష్యుల్ని వెంటబెట్టుకుని దొడ్డి దారిన రోడ్డులో కొచ్చాడు; ఏదో చెప్పి ఒకర్ని లోపలికి పంపేడు.

ఎన్నోసార్లు తలుపు కొట్టిన మీదట తలుపులు తెరుచుకున్నాయి. "మాధవ్‌గారున్నారా ?" అంది రాధ హాల్లో నలువైపులా పరికించి చూస్తూ.

"సెలవు పెట్టి వస్తానని బ్యాంకీ కెళ్ళారు. వారికి సెలవు శాంక్షన్ అయితే ఈ రోజు నైట్‌కు గుంటూరు వెళ తానన్నారు...మీ రెవరూ ? మీకాయనేమవుతారూ?? మేనల్లుడో, అక్క కొడుకో అయివుంటాడు. అవునా ?" సూటిగా రాధ కేసి చూచాడు తలుపు తెరచిన అతను.

అతడి ప్రశ్నలు, తనను గురించి అతడు వేసుకున్న అంచనా - రాధలో భయాందోళనలు కలిగించాయి.

తన వయసును మాధవ్ వయసుతో పోల్చేటప్పుడు తనకు తట్టని ఓ నగ్నసత్యం బయట పడింది. అతడి మనసు మంచితనం తనను అభిమానించడం గురించే తప్ప వయసు గురించి ఎప్పుడూ అనుకోలేదు.

"మాధవ్ గార్ని పిలిచి రమ్మంటారా? మీరెవరో చెప్పండి! మరి" అంటూ అతను పలకరించే దాకా, ఆలోచనల్లో వుండి పోయింది రాధ.

"రాధ - నెల్లూరు నుంచివచ్చిందని చెప్పండి చాలు." అన్నది.

కాఫీ గ్లాసక్కడుంచి, బాత్ రూమ్ చూపించి గుమ్మం దాటాడతను.

రాధ ఆలోచిస్తూ ఉంది: 'ఆ శుభలేఖ తానే సృష్టించి నన్ను వంచించి తనతో వేరే కాపరం పెట్టించడానికి మామయ్యే ఆడిన నాటకం కావచ్చు. నిజంగా మాధవ్ పెళ్ళి నిశ్చయమై వుంటే, పెండ్లికి సెలవు పెట్టారు అనేవాడే అతడు. తన మాధవ్ తనను అన్యాయం చెయ్యడు. అతడి మీద నీలాపనిందలు వేస్తున్నారు. నానుంచి మాధవ్‌ను భగవంతుడు కూడా వేరు చెయ్యలేడు ఇక్కడికొచ్చి నిజం తెలుసుకోవడం ఎంతో మేలయింది. నేనివన్నీ చెబితే నొచ్చుకుంటాడు.

"పిచ్చి రాధా! నేనలా చెప్తానని ఎలా అనుకున్నావ్! సెలవు పెట్టింది నీకోసమే. ముందుగా చెపితే ఏదో ఆటంకం చెపుతావని ఒకేసారి నిన్ను రిజిస్టరు మేరేజికి వొప్పించి

వెంటనే హనీమూన్ వెళ్ళడానికి సెలవు పెట్టాను. హఠాత్తుగా చెప్పి నిన్ను ఉక్కిరి బిక్కిరి చేద్దామని అలా చేసేను” అంటూ తనని హృదయానికి హత్తుకుంటాడు. తను సర్వం మరచిపోతుంది.

అలా ఊహించుకుంటున్న రాధ మనసులో ఉత్సాహం పులకలు వెయ్యగా బాత్‌రూమ్ వైపు దారి తీసింది. ముఖం కడుక్కొని వచ్చి మాధవ్ గదికేసి చూచింది. మూసిన రూము తాళం సాక్షాత్కరించింది.

హాల్లో పచార్లు చేస్తూ, నిమిష నిమిషం వాకిలి కేసి చూస్తూ, టైమ్ చూచుకుంటూ క్షణమొక యుగంగా గడప సాగింది రాధ.

మాధవ్ సెలవు మంజూరైనట్టు తెలుసుకుని బ్యాంక్ నించి రూముకు వచ్చాడు.

రూమునుంచి రాధ రాక తెల్పడానికి వెళ్ళిన వ్యక్తి ఎదురయ్యాడు. “ఏం ? మిస్టర్ రమేష్ ! ఇలా వచ్చావ్ ?” అన్నాడు మాధవ్ అతడి భుజం తడుతూ.

“మీకోసం మీ పిన్నమ్మో, మేనత్తో వచ్చారండీ ! నెల్లూరు నుంచట” అన్నాడు అతను.

“పిన్నమ్మా, మేనత్తా ఎవరబ్బా !... పేరడిగావా ?” అన్నాడు మాధవ్.

“రాధని చెప్పమన్నారు.” అన్నాడు అతను.

రాధ అనే పదం వినగానే విద్యుద్ఘాతం తగిలినట్లు అదిరిపడ్డాడు మాధవ్. చిరు చెమటలు పోసేయి.

అతనికి కర్తవ్యం బోధ పడలేదు.

రాధ ఎదుట అబద్ధం చెప్పలేడు. నిజం చెప్పితే ఆమె నమ్మదు, సరికదా! పరోక్షంగా తనను వదిలించుకోడానికి వేసిన ప్లాను అనుకుంటుంది. ఏ విధంగా చూచినా రాధను స్వీకరించడం కీడునే కొని తెచ్చుకున్నట్లవుతుంది.

అటు ఝూన్సీ జీవితానికీ, ఇటు ఆత్మీయులకు ద్రోహం తలపెట్టిన వాడౌతాడు. వాటిని లక్ష్యపెట్టక సాహసంతో రాధను చేసుకుంటే... శేఖర్ దేన్నికైనా తెగించే అసాధ్యుడు గనక రాధ ప్రాణాలు తియ్యవచ్చు.

ఎందరికో వెలుగు ప్రసాదించే జ్యోతిలాంటి రాధను, తన ప్రేమ కోసం బలి కావించలేడు. తన చేతులారా ఆమెకు ద్రోహం చెయ్యలేడు. తనిప్పుడేం చేయాలి? రాధకు ఎలా నచ్చజెప్పాలి? తన కర్తవ్యం ఏమిటి? 'ఈ సమస్యకు పరిష్కార మార్గం ఎక్కడ దొరుకుతుంది?' అని మరిగి పోసాగింది మాధవ్ మది.

ఇంతలో మెరుపులాంటి ఆలోచన మెదడులో తళుక్కు మంది. త్రాగితే నిగ్రహం, ధైర్యం వస్తాయి. ఎన్ని పెగ్గులు వేసుకుంటే కంట్రోలు తప్పదో అనుభవం మీద తెలుసు కున్నాడు గనుక అలా చెయ్యాలని తీర్మానించుకున్నాడు.

బ్రాందీ షాపుకు వెళ్ళాడు. తగిన మోతాదులో త్రాగి రిక్షాలో కూర్చుని పోనీమన్నాడు.

ఖూనీ చెయ్యడానికి వెళ్ళే హంతకుడిలా, అపవిత్రంగా దేవాలయానికి వెళ్ళే భక్తుడిలా, అపచారం చేస్తున్నట్లు భావించసాగాడు మాధవ్. ఎగిరిపడే గుండెను చేత్తో రాచుకుని, ధైర్యం పుంజుకుంటూ రూము ముందు రిక్షా దిగాడు.

రాధ గది ముందు తిరుగాడుతోంది. ఒక లిప్తపాటు ఆమె ముఖం వంక చూచాడు. ఎన్ని పాపాలు చేసినా, తనను నమ్ముకుంటే క్షమించే దేవతలా గోచరించింది ఆమె.

'ఈ అమృతమూర్తికి అన్యాయం తలపెడుతున్నాను' అనిపించి అతని గుండెను పిండివేసింది వ్యధ.

క్రమేణా మామూలు మృదుత్వం అంతర్ధానమై ధైర్యం, నిషా చోటు చేసుకుంటున్నాయి అతనిలో.

"మాధవ్! వచ్చావా! చూడు మాధవ్, నీ మీద ఎన్ని అభాండాలు వేస్తున్నారో తెలుసా! నీవట... నీవు..." రాధ మాటలు ఆగిపోయాయి.

మాధవ్ కళ్ళు నిప్పు కణికల్లా వున్నాయి. ముఖం రోషంతో జేవురించి వుంది నిర్లక్ష్యం కొట్టవచ్చినట్టు కానవస్తోంది.

చొరవగా దగ్గరకు పోలేక సంశయంగా చూస్తూ వెనకంజ వేసింది రాధ.

"ఏయ్! ఎవరునువ్వు! నాకోసం వచ్చావా? అబ్బా! ఏవే వచ్చావా ... కోరి వచ్చిన రంభా . రా...రా

అక్కడే ... నిలుచున్నావేం ... ???" కాస్త తూలుతూ గొణుగుడు మాటల్తో ముందుకు సాగేడు మాధవ్.

ఏదో గుర్తుకు తెచ్చుకుని నిర్మలంగా అతడి వైపు చూస్తూ తమాషాగా నవ్వింది రాధ.

"ఏయ్! ఎగతాళిగా వుందపే నీకూ? ... నన్ను త్రాగినందుకు... గేలి ... చేస్తున్నావే?... ఆడదానివై... వ్యభిచారం చెయ్యడానికి మగవాడి గదికొచ్చి...ఛూ...ఛూ" అసహ్యంగా ముఖం పెట్టి వుమిసేడు మాధవ్.

"వండ్రఫుల్... మాధవ్! హియర్ ... హియర్" అంటూ చప్పట్లుచరిచి- "త్రాగుబోతు ఆక్షన్ బ్రహ్మాండంగా చేశావ్! ఇది ఏ డ్రామాలో దేమిటి...? నాటకాలు వ్రాయడం కాదుగాని ... 'ప్రాక్టికల్స్' చేస్తున్నావు కూడా ... ఏమైనా నన్ను గాబరా పెట్టి వేధిస్తున్నావ్ సుమా!" గారంగా అంటూ అలక అభినయిస్తూ మాధవ్ చెయ్యందుకుని కుర్చీదగ్గరకు నడిపించబోయింది బ్రాందీ వాసన గుప్పుమనగానే ప్రక్కలో బాంబు ప్రేలినట్లయి అదిరిపడింది రాధ.

"నిజంగా త్రాగేవేం మాధవ్! అందరూ చెపుతుంటే నమ్మలేకపోయాను. ఇప్పుడన్నీ నమ్ముతాను... చెప్పు ... చెప్పు.నీవు ఝాన్సీని వివాహం చేసుకోడానికి ఒప్పుకున్నావు కదూ?" కళ్ళు నిప్పులు చెరగ్గా, రోషావేశాలు మిళితం కాగా వూగిపోతూ బిగ్గరగా అరిచింది రాధ.

మొదట్లో నిషా కొద్దిగా ఎక్కి కొన్ని మాటలనగలి

గాడు మాధవ్. ఇప్పటికి నిషా పూర్తిగా ఎక్కి తెలివి తప్పేలా అనిపిస్తోంది అతనికి. నిబ్బరం కోల్పోతే తను అను కున్నట్టు చెయ్యలేకపోతాననుకుని ఒక్క గుక్కలో ఆమెకు తన మీద అసహ్యం పుట్టించాలనుకున్నాడు.

"ఇది నాటకం కాదు... పచ్చి... నిజం..." తూల పోతూ నిలద్రొక్కుకున్నాడు.

"ఏది అభినయమో, ఏది యదార్థమో నాకంతా అయోమయంగా వుంది మాధవ్! ఇదంతా అబద్ధమని చెప్పు మాధవ్! కలగన్నావేమో! నీ భ్రమ నిజం కాదని చెప్పు మాధవ్!" ఆక్రందన, దీనత్వం మేళవించిన స్వరంతో అతడి భుజాలుపట్టి కుదుపుతూ అడిగిందామె.

"కలా కాదు... అబద్ధం అంతకంటె కాదు... పచ్చి నిజం. నీతో ప్రేమకలాపాలు జరపడం మాత్రం నాటకం. సొదను చేసుకుని నిన్ను వల్లో వేసుకుందామనుకున్నాను. అది తప్పిన తరువాత నాకు పెళ్ళయ్యేంతవరకూ, నీతో అక్రమ సంబంధం పెట్టుకోవాలనుకుని నిన్ను ప్రేమిస్తున్నట్టు అభినయిం చాను. నీవు అందకుండా తప్పించుకుని తిరిగావు. నివేదను చేసుకుందామనుకుంటే నీ స్వలాభంతో ఆమెను దక్కనివ్వ లేదు. ఆ రోజే యదార్థం చెప్పివేద్దామనుకున్నాను. నివేద నీ మనసుకు బాధ కలిగితే ప్రమాదమని చీటీ వ్రాసిచ్చింది. నీ ఆరోగ్యం దృష్ట్యా అప్పటికి విరమించుకున్నాను. నేను నవ యువకుణ్ని... నీకు త్వరలోనే వయసు మళ్ళుతుంది. ఎల్ల కాలం ముసలి భార్యతో... ఛీ...ఛీ... నాకేం ఖర్మ...

సౌందర్యరాసి*ర్షూన్నిని వదులుకుని ఎముకల పోగువు, నీతో కాపరం చెయ్యడం నాకేం పట్టిందీ ? మధ్యన ఎన్ని అవాంత రాలు కల్గినా చివరకు ఆమె నా భార్య కాబోతుంది. నదవ కాశాన్ని, అదృష్టాన్ని కాలదన్నుకునే మూర్ఖుణ్ని కాను..... సమాజంచేత అవహేళన చేయించుకుంటూ బ్రతకలేను."

కంఠతా పెట్టిన పాఠాన్ని ఒప్పజెప్పిన విధంగా అంటూ, రాధ మీద తన మాటల ప్రభావం ఎంత వరకు ఉందో పరిశీలనగా ఆమెవైపు చూపులు సారించాడు మాధవ్.

ఒక్కొక్క మాట తన యెదలో ములుకులై దిగ బడగా "ఛీ... ఛీ... ఇంత నీచుడివనుకో లేదు. ఎంత మోసం ? మిణుగురు పురుగును చూచి నక్షత్రమని భ్రమించాను. అందరిలా నీవు నన్ను స్వార్థానికి వాడుకోవాలనుకున్నావు. నాలో కోర్కెలు లేపి మనిషిని చేశావని మురిశాను గాని, ఇంత ద్రోహానికి పూనుకుంటావని కల్లో కూడా అను కోలేదు. నన్ను 'ఫూల్'ని చేసి నీవు గెలిచాననుకుంటున్నా... వా... ?" అంటూ ఆక్రోశంతో కంపించి పోతూ చెయ్యి పైకెత్తి రెండడుగులు ముందుకు వేసింది రాధ.

ఆమె భీకర రూపం చూచి కాస్త భయం కలిగింది మాధవ్‌కు. వెంటనే సర్దుకుని, "నీకిదేం క్రొత్త గాదుగా ! కొట్టు... నేను చిన్నవాణ్ని, పెద్దదానివి దండించాల్సిందే ! నీవే కొట్టదలచుకుంటే నేను ఎన్నో దెబ్బలు తినాల్సివుంది...

త్రాగుతున్నాను... పేకాడుతున్నాను... వ్యభిచరిస్తున్నాను. నాలో లేనివి రెండే రెండు. దేశద్రిమ్మరినీ, హంతకుణ్ణీ మాత్రం కాదు. నీ మొగుణ్ణి ఏ దుర్గుణాలకైతే ద్వేషించే దానివో అవన్నీ నేనూ నేర్చుకున్నాను. నీ భర్తను ఎన్ని దెబ్బలుకొట్టి మార్చుకుంటావో... మార్చుకో! నేను ఖూనీ భర్తను..." ఛాతీమీద గర్వంగా చేత్తో చిన్నగా కొట్టుకున్నాడు మాధవ్— ఆమెను వ్యంగ్యంగా చూస్తూ.

పరాభవం తన అణువణువును దహించి వెయ్యగా... దాన్ని బలవంతంగా అణుచుకుంటూ,

"నువ్వు చెప్పింది కటిక నిజం మాధవ్...! ఈనాడు నీవు నాకేం కావు. నాకా హక్కు లేదు. ఆనాడు నా వాడి వనుకుని కొట్టాను. చెయ్యని తప్పుకే అవమానాలు భరిస్తున్న నేను, తెలిసి తప్పుచేసి సంఘం చేత నిందలు సహించలేక కొట్టాను, పాపిష్టిదాన్ని" అంటూ తన చేతిని గోడ కేసి కసిగా కొట్టుకుంది రాధ— ఆక్రోశం, ఆవేదనా కన్నీరై కారగా.

మాధవ్ మనసు బాధతో మూగగా మూల్గింది. అతను ద్రవించిపోయాడు.

'ఆ శోకమయ జీవితాన్ని ఆనందభరితం చెయ్యాలి. లోకంలో దుఃఖానికి ప్రతీకగా నిలిచిన రాధను సంతోషానికి ప్రతిరూపంగా చిత్రించాలి. జనసంచారంలేని నిర్జన ప్రదేశాలకు తీసుకుపోయి ఆకులు కాయలు తినైనా బ్రతకాలి. ఆమె కన్నీటి కడలిని ఆనందసాగరం చెయ్యాలి. నా

హృదిలో ఆమె... ఆమె మనోమందిరాన నేను — ఒకే దేహంగా...'అనుకుంటూ అన్నీ విస్మరించి ముందుకు అడుగు వేసేడు మాధవ్.

వెన్నుమీా దెవరో గట్టిగా చరిచినట్లయింది. ఉలిక్కి పడి చివుక్కున వెనక్కి నడిచాడు.

"రాధ ప్రాణాలతో వుండాలంటే ఆమె జోక్యం పెట్టుకోవద్దు. ఇదే ఆఖరు మాట."

శేఖర్ మాటలు, బెదిరింపులు తన చెవుల్లో మారు మ్రోగినట్లయింది మాధవుకు.

కేవలం బెదిరింపేనని నిర్లక్ష్యం చేస్తే ... శేఖర్ పగ బట్టిన నాగు. నమ్మడమెలా? అందుకే తను కఠిన శిలగా మారిపోవాలి. గత్యంతరం లేదు. రాధ మనసు విరిగేలా ప్రవర్తించి మరెన్నడూ తనను తలచని విధంగా నిందిం చాలి. దృఢ నిశ్చయం జేసుకున్నాడు.

అతడి జాలిని పసికట్టింది రాధ.

"మాధవ్! నీకేం అపచారం చేసేనని నాకీ శిక్ష? నా మనసుతో ఎందుకు చెలగాట మాడుతున్నావ్! ఆరిపోయిన నా బ్రతుక్కి ఎందుకు ఆశలు రేపేవ్! ఆనంద శిఖరాల అంచుల నుంచి పాతాళానికి త్రొయ్యడానికా! నీవు పెంచిన ఆశాలతను వ్రేళ్ళతో పెకిలించి వెయ్యడం న్యాయంగా వుందా? చెప్పు... మాధవ్! నీవు లేకుండా నేనెలా బ్రతకను మాధవ్. నే నెలా ..." ప్రేగులు తెగిపడేలా వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఆ నిః ఆక్రందనకు మాధవ్ మనసు గిలగిల్లాడి పోయింది. కన్నీళ్ళు చివ్వున లేచాయి.

చటుక్కున ముఖం ప్రక్కకు త్రిప్పుకుని కన్నీరు తుడుచుకున్నాడు. ఇంక లాభం లేదనుకుని జారిపోతున్న ధైర్యాన్ని పుంజుకుంటూ "రాధా! నీ తప్పుల్ని నా మీద రుద్దకు! సొదను ఎరగా జూపి నన్ను వల్లో వేసుకోవాలను కున్నది నువ్వు. నువ్వు చనువుగా వుండడం జూచి సొద నాకు కాకుండా పోయింది. మాయ మాటలతో నన్ను రెచ్చగొట్టి కవ్వించింది నువ్వు... పతివ్రతలా నటిస్తూ నన్ను తప్పించుకున్నట్టు వంచించింది నువ్వు... నాకు జబ్బు గనక పెండ్లి చేసుకోమని మంచి మాటల్తో బోల్తా కొట్టించింది నువ్వు. బ్రతికున్న మొగుడితో కాపరం చెయ్యలేక యువ కుణ్ణని నన్ను లోబరుచుకుని స్వార్థంతో నా సదవకాశాన్ని దుర్వినియోగపరిచింది నీవే... నా కంటె పెద్దదానివి... టి. బి. పేషంటువి, మొగుడున్న ఆడదానివి దురాశగా నన్ను ఆశించావు. సిగ్గులేక నా మీద అభాండా లేస్తున్నావు. అఘాయిత్యం జేసి నన్ను అల్లరిపెట్టి అందరిచేత చీవాట్లు పెట్టించి లొంగించుకుందామని ఎత్తు వేసేవేమో! ఆ పప్పు లేం వుడకవు... నీవే ఛీ కొట్టించుకుని పోవాల్సొస్తుంది, ఆలో చించుకో!" అన్నాడు మాధవ్ — నాటకంలో పోర్షన్ డైలాగు చెప్పినట్టుగా

మాధవ్ అంటున్న ఒక్కొక్క అక్షరం శూలాల్లా మెదడును తొలిచి వెయ్యగా... మాయ పొరలేవో ఛేదించ బడినట్లయింది.

మాధవ్ నిరసించిన దానికన్నా తన మీద మోపిన నేరాలు తను అనుకోని విధంగా... ఎదురు దెబ్బలు తీసాయి.

విద్యుద్ఘాతం తగిలినట్లయింది. కొంతసేపటికి స్పందన నిలిచిపోయింది.

ఆమె వదనంలోని విచార రేఖలు తొలిగిపోయాయి. వొట్టిపోయిన చెరువులాగయ్యాయి – నయనాలు. మనసంతా తడారిన బెండులా తయారైంది. కొంతసేపటికి కాస్త చలనం కలిగింది.

చకచక పని చెయ్యసాగింది మెదడు.

చెక్కిళ్ళ మీద కన్నీటి చారికలు తుడుచుకుంది.

స్థిర నిశ్చయంతో బ్యాగ్ చేతబట్టుకుని నిలుచుంది. విరాగిలా తయారైంది క్షణంలో. ఏదో మహత్తర శక్తి ఆమెలో ప్రవేశించినట్టు గోచరించింది మాధవ్‌కు.

'అత్యంత వ్యధలో మనిషి బాహ్యాన్ని మరుస్తా'డని అది ప్రమాదకరమని ఎక్కడో విన్నాడు. అదొక నిర్వికార స్థితి.

ఆమె కళ్ళలో గాలించినా ఏ భావమూ స్ఫురించడం లేదు. స్వచ్ఛమైన ఓ చిత్తరువులా నిలిచి వుంది.

ఆమె దగ్గరకెళ్ళి కాళ్ళమీద పడి, క్షమించమని వేడుకుందా మనుకున్నాడు. కాని ఆమెలోని మహత్తర ప్రవృత్తి దేన్నీ ఖాతరు చెయ్యదని విరమించుకున్నాడు.

కొన్ని క్షణాలు అక్కడ నిశ్శబ్దం రాజ్యం చేసింది. మౌనభంగం చేసుకుని మాట్లాడసాగింది రాధ.

నాగస్వరం వింటున్న నాగుపాములా, మంత్ర ముగ్ధుడై వినసాగాడు మాధవ్.

"మాధవరావు! నా మాటలు సావధానంగా విను. నీ కిప్పుడు నన్ను నిందించే అధికారం లేదు. మన సంబంధ మల్లా... యిప్పుడు ఒకే జాతికి చెందిన మానవులం మాత్రమే. ఓ మిత్రురాలిగా భావించి నా చివరి కోర్కె నెరవేర్చు. అదే నాకు మహోపకారం చేసినట్లు. మన జీవిత చరిత్ర కథగా రాయి. చదివే పాఠకుల్లో మనలాంటి వారుంటే కను విప్పు కలుగుతుంది. ఆదర్శం లేని పిరికివాడు - అభిమానం పేరుతో నా స్థితిలో వున్న ఏ ఆడపిల్లకూ ఆశలు కల్పించి, ఆమెను ఆశించకూడదు. నా స్థితిలో వున్న స్త్రీ అసమర్థుడైన మగవాడిని నమ్మరాదు.

ఆడపిల్ల తన పరిధిని దాటి ఒక అడుగు ముందుకు వేసినా సంఘం హర్షించలేదు. ఆడదాని ఆంక్షలు తొలిగి పోలేదు. మారింది కాలం, చట్టాలు. కాని మనుష్యులు, మనసులు కాదు. పాతుకపోయిన వుద్దేశాలు విడిపోలేదు. ముందంజ వేసేవారికే, సమాజం ప్రోత్సాహమివ్వకపోగా పాతాళానికి త్రొక్కుతుంది. దానికి భయపడి మనిషి తనను తను ఆత్మవంచన చేసుకుని ప్రేమను చంపుకుని బ్రతుకు తున్నాడు. నా జీవితం నాశనమైనా ఫరవాలేదు. ఆలోచన లేకుండా వేరెవ్వరూ నాలా గోతిలో పడరాదు. నా కథొక

నిదర్శనగా, గుణపాఠంగా వుంటే నాకదేచాలు. గుడ్ బై..."
జవాబుకైనా ఎదురు చూడకుండా గుమ్మం దాటింది రాధ.

మాధవ్ నోటివెంట ఒక్కమాట కూడా పెగల్లేదు. నిర్వికారంగా చూస్తూ వుండిపోయాడు. సర్వం త్యజించి సన్యాసాశ్రమంలో చేరబోతున్న ఓ యోగినిలా గోచరించింది రాధ—మాధవ్‌కు. అంతకంటె అతడి మేధ కేమీ అందలేదు. ఒక దీర్ఘ విశ్వాస వదలి రూములోకి నడిచాడు.

రోడ్డు టర్నింగ్ తిరిగిన రాధకు సుధీర్ ఎదురై పకపకమని వికటాట్టహాసం చేసాడు.

పగతీర్చుకుంటున్న కోడెత్రాచు బుసలా వినిపించిందా నవ్వు రాధకు. మామూలు స్థితిలో అయితే ఏ రివాల్వర్ తోనో 'షూట్' చేసి వెయ్యాలన్నంత ఆగ్రహం కలిగేది. కాని, తను దేనికీ బాధపడే స్థితిలో లేదు.

"ఏం రాధాదేవి! సన్మానం బాగా జరిగిందా? మరి పెళ్ళెప్పుడూ..."

"మిష్టర్ సుధీర్ ?" బిగ్గరగా అరిచింది.

"ఏం రోషం వచ్చిందా! పెండ్లట పెండ్లి...ఒకసారి పెళ్ళయిన ఆడదానికి మళ్ళీ పెళ్ళి ? ఆశించిన మగవాడల్లా పెళ్ళి చేసుకుంటాడుకదూ? నే నప్పుడే చెప్పాను. నిన్నీ జన్మలో ఎవ్వరూ వివాహం చేసుకోరని...అహహహహహ." విరగబడి నవ్వేడు వికృతంగా.

"చూడు సుధీర్ ! చచ్చిన పామును చంపబోవడం మాత్రమే నీవు చెయ్యడం. కాయకాచినచోట నొప్పి వుండదు.

నామీాది విజయం – విజయం కాదు నా ఓటమికి వగచటం లేదు. జీవితంలో చిత్తుగా ఓడిపోయిన నాకు చింతేముం టుంది ? మనం ఒకర్ని సుఖపెట్టాలంటే ఎంతో కష్టపడాలి. అలాంటిది కష్టం కలిగించడం సులభమని వేరే చెప్పక్కర్లే దనుకుంటాను. కాని నిన్ను నమ్ముకున్న మాధవ్ రావును ముంచబోకు ... అదే పదివేలు. నమస్తే ..." కదిలింది ముందుకు.

"ప్రియుడి మీాద ఈగవాలరాదంటావు. అంతేగా ? కాని వాడు ప్రగల్భాలు పలికి నాకే నీతులు బోధించ బోయాడు. తనే గోతిలో పడ్డాడు. నా పంజాలో చిక్కేడు. వీలైనంతవరకూ పతనానికి దించి, వాడి రక్తం పిండి మరీ వదులుతాను. నా రక్తం కళ్ళజూచేవే—నీ కంటినీళ్ళు. నీ బాధ నా కెక్కువా ? నన్ను కొట్టినవాడు 'టపా' కట్టేడు. బ్రతికి నువ్వు మళ్ళీ కుమిలి ఏడుస్తున్నావ్ ! నా మాట విన నందుకు అనుభవిస్తున్నావు. నీవా నాడు నా మాట ఆమోదిస్తే..."

"నెల్లూర్లో రాధనే మరో వుంపుడుగత్తె వుందని ఘనంగా చెప్పుకునే వాడివి. ఆడదాన్ని విలాస వస్తువుగా చేసి వాడుకునే మగవాళ్ళు వున్నంతకాలం స్త్రీ జాతికి సుఖం లేదు.; ప్రపంచం బాగుపడదు..."

మధ్యలో మాటందుకున్నాడు.

"హుఁ ! చాలించు నీ శ్రీరంగనీతులు ! పిల్లి శాపాలకు వుట్లు తెగవు ! నెల్లూరు దారిపట్టు. మళ్ళీ మరొకరి కోసం

వుచ్చులు పన్ను ... రివాజేగా..." నిరసనగా రాధవైపు చూచి చేతిలోని సిగిరెట్ విసురుగా నేలకేసి కొట్టి చరచరా అంగలేసుకుంటూ వెళ్ళేడు సుధీర్.

రిక్షాలో ఎక్కి కూచుని 'హుసేన్ సాగర్'కి పోనీ మంది రాధ. విస్తుపోయి చూచాడు రిక్షావాలా.

"ఏంటయ్యా! విచిత్రంగా చూస్తున్నావ్" అంది వాడి వైఖరి అర్థంకాక

"అమ్మా! ఓ బహుత్ దూర్ హై...టౌన్‌బస్ మే జావో...పైసా కమ్ హోతా హై..." అన్నాడు ఆమెవైపు సంశయంగా చూస్తూ.

"టౌన్ బస్సులో వెళ్ళే నిమితం లేదు నాకు. డబ్బు లెక్కువైనా ఫరవాలేదు. .పోనీ రిక్షా!" విసుగు వ్యక్తం చేసింది.

దీనికి ముందయితే మాధవ్ అంత పతనానికి దిగజారే డన్నందుకు ఆగ్రహావేదనలు జనించేవి. కాని సుధీర్ పాత జ్ఞాపకాలను వెలికిలాగేడు. గతావలోకనం చేసుకోసాగింది రాధ.

తను పి. యు. సి. కి కట్టి చదువుతున్నప్పుడు సుధీర్ — అన్నయ్య దగ్గరికి ప్రయివేటుకు వచ్చేవాడు.

ప్రథమంలో ప్రశంసలు మొదలుపెట్టి క్రమేణా

శ్రుతిమించి ప్రేమిస్తున్నానంటూ వేధించేవాడు. ఎన్నోసార్లు "నాకలాంటి అభిప్రాయం లేదు. నీ అభిలాషని వదులుకో" మని నచ్చజెప్పింది. మరీ మితిమీరబోతే మృదువుగా దండించింది. కాని అతడు పట్టు వీడలేదు. పదేపదే వత్తిడి చెయ్యడం ప్రారంభించాడు. విసిగిపోయి అన్నయ్యతో చెప్పింది తను.

"పెండ్లి చేసుకుంటాడేమో అడుగు. అసలు రంగు బయట పడుతుంది" సలహా యిచ్చాడు.

"నా కసలు ఎవర్నీ చేసుకోవాలని లేదు. అతడంటే నాకు సదభిప్రాయం లేదు. నే నిలాగే వుండిపోతాను. నన్ను రొంపిలోకి దింపకన్నయ్యా" అంది తను.

"అతడికి బుద్ధి చెప్పడానికి మాత్రమే నటించు" అన్నాడు.

"ప్రేమిస్తున్నానంటున్నావ్ గదా! శాస్త్రోక్తంగా వివాహం చేసుకుంటావా? లేక రిజిష్టర్డ్ మేరేజ్ చేసుకుందామా?" అని అడిగింది సుధీర్‌ను.

"నిన్ను పెళ్ళి చేసుకోవడమా? మనవి వేరు వేరు కులాలు. పైగా నీవు పెళ్ళయినదానివి...అదెలా సంభవం? కాదంటే నీ యౌవనం వృధాపోకుండా ఒకటిగా వుండిపోదాం... ప్రేమంటే నిర్వచనం తెలుసా? కామతృష్ణ తీర్చుకోవడం..." అంటూ వాంఛ నిండిన కళ్ళతో చూస్తూ బలంగా దగ్గరకు లాక్కొని కౌగిట్లోకి తీసుకోబోయాడు.

తను ఒక్క వుదుటన ప్రక్కకు జరిగి బలంగా నెట్టి వేసింది వెనక్కు. ఆ వూపుకు గోడకు తగిలాడు.

చాటునుండి అంతా గమనిస్తున్న అన్నయ్య తటాల్న వచ్చి సుధీర్ చెంపలు వాయించాడు. అతడి పెదిమలు చిట్లి అన్నయ్య చెయ్యి రక్తమైంది.

నెత్తురు చూచిన సుధీర్ ఆగ్రహం హద్దులు మీరింది. అన్నయ్య జబ్బ పట్టుకుని పిడికిలి బిగించి గుండెల మీద గుద్దుల వర్షం కురిపించ సాగాడు.

అన్నయ్య కేమవుతుందోనని భయమేసింది తనకు. అక్కడ పెన్సిల్ చివ్వుతూ వదలి వచ్చిన చాకు తెచ్చి గుప్పిటి బిగించి వున్న సుధీర్ చేతిమీద గీచింది.

"అబ్బా" అంటూ అన్నయ్యను వొదిలి పెట్టాడు.

ఆ కోపంలో ఎవరైనా దాంతో పొడుచుకుంటారని అక్కడే వున్న నూతిలోకి విసిరింది దాన్ని.

చేతి గాయం చూచుకున్న సుధీర్ తోకత్రొక్కిన త్రాచయ్యాడు. అగ్ని గోళాల్లాంటి ఎర్రటి కళ్ళల్లో నుంచి నిప్పులు రాల్చుతూ "గుర్తుంచుకో! ఇది దెబ్బతిన్న బెబ్బులి. పగపట్టిన నాగు. సమయం చూచి కాటెయ్యక మానదు. నీ వెక్కడున్నా నిన్ను సుఖపడనియ్యను. క్షణక్షణం క్రుళ్ళి కుమిలి పోయే పరిస్థితి ఏర్పరుస్తాను." మీసం మీద చెయ్యి వేసుకుని శపథం చేసేడానాడు.

గతం చెరిగి పోయింది.

పంతం నెరవేర్చుకున్నా డీనాడు.

"హ్మ..." విషాదంగా నవ్వుకుంది.

రిక్షా ముందుకు సాగుతోంది. రాధ ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి.

తన బాల్యం నుంచి మాధవ్‌తో గడిపిన మధుర స్మృతుల వరకు. తను ఎవరెవరికోసం తన స్వార్థాన్ని చంపు కుందో, రాగజలధిలో బంధాలనే కీటకాలనుంచి తప్పించుకుని ఒడ్డున పడలేక విలువైన జీవితాన్ని ఎలా దుర్వినియోగ పరచుకుందో, ఒక్కొక్కరి వాగ్దానాలకు కట్టుబడి తన బంగారు బ్రతుకును ఎలా మట్టిపాలు చేసుకున్నదో అలాగే – తను నిర్మించుకున్న అందాల సౌధం కూలిపోయింది. తను ఎడా రిలో తిరుగాడుతోంది. ఏ ఒయాసిస్ కోసం ప్రాకులాడ దలచుకోలేదు.

"ఉతర్ జావ్ మా" అన్న రిక్షావాని పిలుపుకు తుళ్ళిపడింది. ఆలోచనల పల్లకి దిగి యదార్థమనే భూమి మీదికి వచ్చింది రాధ. రిక్షావాడికి డబ్బు లిచ్చింది.

మహాప్రస్థానం చెయ్యబోయే యోగినిలా నీటి దగ్గరకు నడిచింది రాధ. ఒక్కొక్క అడుగే ముందుకు సాగుతోంది. ఆనాడు తను నూతిలో పడబోతుంటే అన్నయ్య చెప్పిన బోధలన్నీ జ్ఞప్తి కొచ్చాయి. మరణశయ్యమీద తండ్రి, తల్లిని తనకొప్పజెపుతూ అన్నమాటలు గుర్తు కొచ్చాయి. సౌద తనమీద మోపిన బాధ్యత మనసులో మెదిలింది. ఒక్కొక్క సంఘటన దృశ్యాలుగా, సినిమా రీలులా కనుల ముందు కదలాడసాగింది.

అన్ని ఆకారాలు ఓ వలగా తయారై ఆమెను నిర్బంధంగా వుచ్చులో బిగిస్తున్నాయి.

నీళ్ళు మోకాళ్ళవరకు వచ్చాయి. చీర కుచ్చెళ్ళు చల్లగా తగిలాయి. తను అక్కడికి దేనికి వచ్చిందో గుర్తు కొచ్చింది. ఇంకా ముందుకు సాగుతోంది గబగబా.

శ్రీధర్ మాటలు రాధ చెవుల్లో మారుమ్రోగ సాగాయి: "దేవుడు మనకిచ్చిన శరీరాన్ని త్యజించే హక్కు మనకు లేదు. ప్రజలకు మనం ఏ విధంగా సహకరించ గలమో, అలా ఉపయోగపడితే అదే జన్మకు సార్థకం, జీవితానికి పరమార్థం."

అది రాధకు తారకమంత్రం ఉపదేశించి నట్లయింది. ఇంతలో తనను బలమైన రెండు చేతులు వెనక్కు లాగు తున్నట్టు అనిపించింది.

తిరిగి చూచింది.

రిక్షావాలా తనను రక్షించడానికి వచ్చిన భగవంతునిలా గోచరించాడు.

అతడిలో తండ్రి, అన్న, సోదర, పాప, యావత్ ప్రపంచమూ కనిపించినట్లయింది.

# 45

హైదరాబాద్ నుంచి తిరిగివచ్చిన రాధ నిరాశతో, నిర్లిప్తంగా మెలగడం చూచి ఇంటిల్లిపాది ఆశ్చర్యపోయారు.

ఎంతో విచారంతో వస్తుందనుకున్నారు దానికి విరుద్ధంగా వుందా మె ప్రవర్తన.

అక్కడి విశేషాలు వారడగలేదు, తను చెప్పలేదు. 'రోటీన్'గా తన పనులు తను చేసుకుంటూ స్కూలుకు వెళ్ళివస్తోంది.

శేఖర్ మందు తాగుతుంటే——

"సుస్తీ ఏమిటి మావయ్యా?" అంది రాధ.

"నాలికమీద 'కేన్సర్'ట. అందుకే హైదరాబాద్ కెరెంట్ ట్రీట్‌మెంటు చేయించుకుని వచ్చాను. ప్రస్తుతం తగ్గితే అయిదు సంవత్సరాల వరకూ ఫరవా లేదన్నారు. తగ్గిపోకపోతే మాత్రం ప్రమాదం అన్నారు" ఎలాటి ఫీలింగు లేక అతి సహజంగా అన్నాడు.

నొచ్చుకుంది రాధ.

"నేనెవర్నని రాధా! నీకు జాలి?"

"తోడి మనిషిగా, మేనమామగా!" నిర్మలంగా వుందామె మోము; సరళంగా వుంది స్వరం.

"నీలో యింత వైరాగ్యం కలుగుతుందనుకో లేదు, రాధా! ధన్యురాలివి" మెచ్చుకోలుగా చూచాడు మంద్ర స్వరంతో అంటూ.

"అందరి చలవా నన్నిలా తయారుచేసింది మావయ్యా ! నా ఘనతేం కాదు."

ఆ మాట శేఖర్ గుండెలో సూటిగా గుచ్చు కున్నట్లయింది.

# 46

రాధ గడప దాటగానే మాధవ్ పశ్చాత్తాపంతో దహించిపోతూ ఎంతగానో ఏడ్చాడు.

ఆ రాత్రికి అతను గుంటూరు పోదామను కుంటుం డగా ఈ లోపలే గుంటూరు నుంచి— తమకు సూతకం వచ్చిందని, పెండ్లి నిలిచి పోయింది గనుక సెలవు 'కాన్సిల్' చేసుకోమనీ మళ్ళీ ఎప్పుడు ముహూర్తం పెట్టుకునేది మరొక సారి తెల్పుతామనీ "టెలిగ్రాం" యిచ్చాడు సోమశేఖరం.

అప్పటి కప్పుడు రెక్కలు కట్టుకుని వెళ్ళి రాధ ఎక్క డున్నా వెతుక్కొచ్చి క్షమాపణ వేడుకుని వెంటనే రిజిష్టర్డ్ మేరేజి చేసుకుందామనుకున్నాడు. పెళ్ళి తప్పిపోయింది గనక మళ్ళీ వెతుక్కుంటూ వచ్చాడని రాధ అపార్థం చేసు కుంటుందని విరమించుకున్నాడు. అది ఒక కారణమైనా ఎన్నో ప్రతిబంధకాలు అతణ్ని కట్టి పడేశాయి.

పరిస్థితులూ, బంధాలు, ఆత్మీయత, స్వార్థం, పిరికితనం కళ్ళాలై వెనక్కు లాగివేశాయి అతణ్ని.

సమాజానికీ, పరిస్థితులకూ శానిస్సై అసమర్థుడుగా వుండిపోయాడు మాధవ్.

# 47

ఎవరు కూడా మనోహర్ అంత త్వరగా అమెరికా నుంచి వస్తాడనుకోలేదు.

హఠాత్తుగా నచ్చినందుకు కామాక్షమ్మకు పచ్చి వెలక్కాయ గొంతున పడినంత సంకటంగా వుంది.

ఝాన్సీకి మనోహర్ వచ్చిన విషయం తెలిసి ఎప్పుడు కలుసుకుందామా అనే ఆత్రుతతో సమయం కోసం వేచి వుంది.

"అమ్మా! అత్తయ్యగారింట్లో పెండ్లి పనులు అయినట్టున్నాయ్! ఇల్లంతా రంగులూ అవీ వేయించినట్టున్నారు. అంత త్వరగా ముహూర్తం పెట్టించావేమమ్మా! నా ఫ్రెండ్సుకి శుభలేఖలు ఎప్పుడందుతాయ్?" ఆనందం, ఆగ్రహం మిళితమైనాయి మనోహర్ స్వరంలో.

"ఆ పిల్ల పెండ్లికి, నీవు స్నేహితులకు శుభలేఖలు వెయ్యడానికీ సంబంధం ఏమిట్రా?" అంది మాటను మభ్య పెడుతూ కామాక్షమ్మ.

"అదేమిటమ్మా! మా ఇద్దరి వివాహం జరగదా?" ఆందోళన ధ్వనించిందతడి కంఠాన.

"ఝాన్సీని వాళ్ళ మేనమామ కొడుకు మాధవుకిచ్చి చేస్తున్నారు!" ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది అతడివైపు సూటిగా చూడలేక.

"దీన్లో ఏదో గూడుపుఠాణీ వుందమ్మా! ఝాన్సీ వాళ్ళ బావను చేసుకోడానికి సమ్మతించుండదు. నిర్బంధంగా చేస్తున్నారేమో! కనుక్కొస్తానుండు" అంటూ గబగబా కోట్ స్టాండువద్ద కెళ్ళి ప్యాంటు చేతికి తీసుకున్నాడు.

"రమణరావు చచ్చిపోయిన తరువాత అప్పుల పాలైనారని వాళ్ళ స్థితిని గురించి నీకు రాసేంగదరా? నీకు పిల్లనిచ్చే వాళ్ళిచ్చే కట్నం, నీకు చదువుకు పంపిన డబ్బుకు అప్పు తీర్చమన్నాడు. సరేనని..." నాన్చింది మాట.

"సరేనన్న దెవరమ్మా!" సూటిగా ప్రశ్నించాడు నమ్మలేనట్లు.

"మేమే అన్నాంరా! మాకామాత్రం హక్కులేదూ? కనీ పెంచి..."

"లేదు. పెండ్లి నా వ్యక్తిగత విషయం. అది నా యిష్టప్రకారం జరగవలసిందే!" తీవ్రంగా చూస్తూ కరుకుగా జవాబిచ్చాడు.

మనోహర్ గుమ్మం దాటబోతుండగా ఝాన్సీ ఎదురైంది. లోపలికి నడిచాడు.

"ఏం అమ్మడూ! పెండ్లికూతుర్ని ఎప్పుడు చేస్తారటా?

మాకు కనపడిపోదామని వచ్చేవు కదూ! మేమంటే ఎంత అభిమానం?— రా? వంటింట్లోకి! కాఫీ అయినా తీసుకుందువుగాని" అంటూ రూన్సీ చెయ్యిపట్టి వంటింటివైపు నడిపించింది కృత్రిమ ప్రేమను ఒలకపోస్తూ.

"చూడు తల్లీ! 'నీవీ పెళ్ళికి వొప్పుకోవద్దు. నేనే చేసుకుంటా' నని మావాడంటే, నువ్వు 'అలాగే' అనవాక. నీ మేలుగోరి చెవుతున్నాను. వీణ్ని చేసుకుంటే మీాకు డబ్బు రాదు. అగచాట్లు పడతారు. నువ్వు మావయ్యతో మాట్లాడుతూ ఇక్కడ్నే వుండు. నేను మీా అమ్మతో రెండు ముక్కలు చెప్పొస్తా!" వీపు మీాద తట్టి, హడావుడిగా బయల్దేరింది కామాక్షమ్మ.

"ఏం? పెళ్ళికూతురా! దీవనలందుకుందామని వచ్చావా?" మనోహర్ స్వరంలో కసి, జాలి వినిపించాయి.

చలించే నయన ద్వయంతో భీతహరిణిలా అతణ్ని చూచి తల వంచుకుంది ఆమె.

రూన్సీ వివాహానికి ఆమోదించినట్టు అవగతమైంది మనోహర్‌కి. అతడి క్రోధం కట్టలు తెంచుకుంది.

"ఆనాడు నేనడిగినప్పుడు ఎందుకలా చెప్పావ్? ఏ మనిషి దగ్గర ఆ మనిషి మాటలు మాట్లాడే అవకాశవాదివని తెలుసుకోలేక, అమాయకురాలివనుకుని మోసపోయాను. ఆడబుద్ధి పోనిచ్చావ్ కాదు...ఛీ... ఛీ... నీ కోసం రాత్రింబవళ్ళు చచ్చీచెడి, శ్రమకోర్చి త్వరగా నీ దగ్గరి కొద్దామనుకున్నానే- ఇదా నువ్వు నాకు చేసిన శాస్తి? ఎందుకిలా

మారిపోయావ్ ?... చెప్పు... చెప్పు..." అంటూ ఆమె చేతులు పట్టుకుని ఊపేడు — గొంతులో బాధ సుళ్ళుతిరగ్గా. తల ఎత్తిన ఆమె సజల నేత్రాలు చూచి చకితుడయ్యాడు అతను.

"ఏడుస్తున్నావా ఝాన్సీ! మీ ఆడవాళ్ళకు తప్పును సమర్థించుకోడాని కిదో అస్త్రం. చెప్పు... నిజం చెప్పు ... నన్నెందుకు కాదన్నావో!" అనునయంగా అడిగాడు.

చిన్నగా గొంతు పెగలించుకుని జవాబు చెప్పడం మొదలు పెట్టింది ఝాన్సీ.

"మీ ధోరణి మీదిగాని, ఎందుకిలా జరిగిందో యోచించారా ? నేను నా పరిస్థితి వివరిస్తూ, చేసుకుంటానని ఒక్క ముక్క వ్రాయండి - నా మీద ఒత్తిడి తగ్గిపోతుందని ప్రార్థిస్తూ ఉత్తరాలు వ్రాసేనే! ఒక్కదానికైనా జవాబిచ్చారా ? చివరకి నేరం నా మీద మోపుతున్నారా ? ఆడపిల్లని, అందులో పిరికిదాన్ని, పెద్దలచాటున బతికే నన్ను ఏం చెయ్యమంటారు ? ఆఖరుకు మీరు కాదన్నట్టు రాస్తేగాని, నేను పెండ్లికంగీకరించనని షరతులు పెట్టాను... ఎలాగూ మీరా మాట అనరనే ధైర్యంతో... కాని ... కాని.... ఇదిగో మీరు ఇలా వ్రాసి... పైగా అపరాధం నాదంటు... న్నా... రు..." గొంతు గద్గదికంకాగా చిరిగిన జాబులోని కాగితం ముందుకు చూపింది.

ఆత్రుతగా అందుకుని చూస్తూ —

"అవును. ఇది నేవ్రాసిందే! మీరు తొందర పడు

తున్నారంటే లగ్నం పెట్టి నాకు తెలపండి, త్వరలోనే వస్తా నని వ్రాసేను. అప్పుడు నీకూ వ్రాసేను, అక్కడి నుంచి నీకేం తెమ్మంటావో తెల్పమని. ఒక్కదానికి జవాబిచ్చావా?" విస్మయంగా అన్నాడు.

"నేను ... సమాధానమివ్వ లేదంటారా? చిత్రంగా వుందే! మీరు నాకసలు యిటీవల లెటర్సు వ్రాస్తే గదా!"

"నేను అబద్ధమాడుతున్నానంటావా? అలా అనే వాణ్ణయితే ఇలా ఎందుకు నీ కోసం తపిస్తున్నాను ..." అంటూ ఆగిపోయాడు మనోహర్.

అటు కేసి చూచింది ఝాన్సీ. గోపాల్రావు మేడ మెట్లు దిగుతున్నాడు. ఝాన్సీ గౌరవ సూచకంగా వొదిగి నిలుచుంది.

"నీకేం భయం లేదు ధైర్యంగా వుండమ్మా!" అన్నాడు గోపాల్రావు ఆమెవైపు సాదరంగా చూస్తూ.

అదే అభయప్రధానంగా భావించింది ఆమె.

"మీ అత్తయ్యొస్తే గొడవ చేస్తుంది. గడియేసి రామ్మా!" అన్నాడు గోపాల్రావు.

అక్షరాలా పాటించిందతడి మాటను.

"అంతా స్థిమితంగా వినరా! ఇదంతా మీ అమ్మ కుట్రతో జరిగిన ఏర్పాటు. ఇటీవలే బయట పడిందీ విషయం. నీ దగ్గరనుంచి వుత్తరాలు లేవని ఝాన్సీ చెప్పి నప్పటినుంచీ, నాకేదో సందేహం తోచి నిఘావేసి చూస్తూ

వచ్చాను. ఝాన్సీకి నీవు రాసే వుత్తరాలను మీా అమ్మ దారిలోనే కాజేసే ఏర్పాటు చేసింది. అదీకాక, నీ అడ్రెసు మారిందని ఝాన్సీకి తప్పడు అడ్రస్ ఇచ్చిందట. ఉత్తరాలు మీాకు ఎలా చేరుతాయి?" అన్నాడు గోపాలరావు.

కోపావేశాలు, సంభ్రమాశ్చర్యాలు మనోహర్‌ని ముంచి వెయ్యగా పశ్చాత్తాపంతో క్రుంగిపోతూ, కరుణ దృక్కులు ప్రసరించాడు—ఝాన్సీ వైపు.

మనోహర్ చేతికి ఒక లేఖ ఇచ్చాడు గోపాలరావు.

చదవడం ప్రారంభించాడు మనోహర్.

"నా మాధవ్,

నీవు నా నుంచి దూరం అవుతున్నట్టు అందరూ కోడై కూస్తున్నారు! అది నిజం కాదు కదూ? నన్ను వంచించి శేఖర్‌తో కలపడానికి పన్నిన పథకం కదూ? నేను నమ్మ లేదనుకో? సూర్యుడు పడమట ఉదయిస్తాడేమో గాని నీవు మాత్రం నన్ను నిరసించవు ... నీవలా చేసేవాడివైతే నేను హాస్పిటల్ బెడ్ మీాద చెప్పినప్పుడే సమ్మతించి వుండేవాడివి.

నే నెంత స్తిమితంగా ఉండాలన్నా, వింటున్న విష యాలు ఎలా వున్నా నీవు మా యింటికి రాకపోవడం నిజమే ననే నిదర్శనంగా భావించాల్సొస్తోంది.

మాధవ్! నా శరీరం, ప్రాణం, నా మనసు అన్నీ నీవే... నేనంటూ వేరే లేను మాధవ్... లేను.

చిన్నప్పటి నుంచి తెలిసిన వాడివి. గుణవంతుడివి. నన్నభిమానిస్తూ, ప్రేమిస్తూ కోరుతుంటే ఆ అదృష్టాన్ని

వదులుకోలేకపోయాను నా జీవితమనే కొమ్మ - చెట్టునుంచి విడగొట్టబడింది. దాన్ని నాటి పోషించాలనే శ్రద్ధ ఎవరికీ వుండదు. అలాంటిది నీవు సాధించాలని సంకల్పించుకున్నావు. అలాంటి సదుద్దేశం అరుదు. అందుకే నేను దాన్ని సద్వినియోగ పరుచుకోవాలని ఆశించాను. నిన్ను భగవత్ ప్రసాదంగా భావించి స్వీకరించాను. నీవు పెంచిన ప్రేమలతను తెంపివేసి మరో తీవెకు ఆధారం కాబోవడం హాస్యాస్పదం...

జీవితంలో ఒకసారి ఓడిపోయాను. తగిలిన గాయం మీద మరో ఘాతం కల్పించకు మాధవ్! భరించలేను. కొండలా పేరుకున్న విచారం మంచులా కరిగిస్తావని ఆశిస్తున్నాను. నీ జవాబు కోసం వెయ్యి కళ్ళతో ఎదురు తెన్నులు చూస్తుంటాను. క్షణమొక యుగంలా గడుపుతూ—

సదా నీ సన్నిధికోరే

నీ రాధ.

ఆశ్చర్యంతో ప్రశ్నల వర్షం కురిపించాడు అది చదివిన మనోహర్. తేలికపడ్డ మనసుతో హాయిగా గాలి పీల్చుకుంటూ ఝాన్సీ చెప్పసాగింది:

"ఆ రోజు బావతో సహా అందరూ గుంటూరు వచ్చారు. మా తమ్ముడు అత్తయ్యను స్వీట్లేం తెచ్చావని వేధించడం మొదలు పెట్టాడు. ఇంతలో బావ తన బ్యాగ్ లోపల స్వీట్సున్నట్లు చెప్పాడు. అది తీస్తుండగా ఆ ప్యాకెట్

లోనుంచి ఓ కవరు కనిపించింది. కాగితం తీసి చదివి అమ్మను చాటుకు పిలిచి చదివి వినిపించాను.

రాధ స్థితిని అర్థం చేసుకుని నాతో బావ పెళ్ళి ఆపించేస్తుందని ఆశించాను. కాని, నా వుద్దేశానికి వ్యతిరేకమే జరిగింది.

"మగవాడు పెండ్లిగాక ముందు ఏదో తప్పుదార్లు తొక్కుతుంటాడు. అందర్నీ పెళ్ళి చేసుకుంటూ వుంటాడా? ఆ సంగతేం పైకి పొక్కనీయకు—అత్తయ్యా వాళ్ళకు తెలిస్తే బావుండదు. నీవు నోరు మూసుకుని ఉండు. ఇలాంటివి చూచీ చూడనట్లుండాలి..." అంటూ చీవాట్లు వేసింది.

రాధ విడాకులు తీసుకున్నది. చాలా మంచి మనిషి. అత్తయ్యగారికి ఫామిలీ ఫ్రెండ్సు వాళ్ళింటి వాళ్ళందరూ కూడా. కాని...అమ్మకు జాలి కలగలేదు. తోటి ఆడదానికి సహాయం చెయ్యలేక పోతున్నందుకు నాకు ఎంతో బాధేసింది అందుకే మావయ్యకు లెటర్ చూపి సహాయం అడిగాను. పరిష్కార మార్గం తన మీద వదిలేసి నిశ్చింతగా వుండమని హామీ యిచ్చారు" అంది ఝాన్సీ కృతజ్ఞతా పూర్వకంగా గోపాలావును చూస్తూ.

"నాన్నా! నీలాంటి అమృతహృదయులైన తండ్రులుంటే యువలోకం ఎంతో ప్రగతి సాధించగలదు. నాకు ఎంతో గర్వంగా వుంది నాన్నా" అంటూ తండ్రి కరద్వయాన్ని కళ్ళ కద్దుకున్నాడు మనోహర్.

పిల్లలు చేసేది తప్పు కానప్పుడు సహకరించడంలో

గొప్పేముందిరా? అనుకున్నది నెరవేర్చిన నాకు ప్రశంసా ర్హుణ్ణి" వాత్సల్యభరితంగా వీపు తట్టేడు.

"మావయ్యా!" అంటూ ప్రణమిల్లింది ఝాన్సీ.

ఆదరంగా ఆమె శిరస్సు నిమురుతూ—"నన్ను నమ్మి నే చెప్పినట్లు నడుచుకోండి. భారం నా మీద మోపండి. సరా!" చిద్విలాసంగా నవ్వేడు గోపాల్రావు ఆ యిరువురి వైపు ఆప్యాయంగా చూస్తూ.

తలుపు తట్టిన శబ్దం కాగానే గోపాల్రావు వెళ్ళి తలుపు తీసేడు. ఝాన్సీకోసం నలువైపులా పరికించి చూచింది కామాక్షమ్మ.

"స్టవ్ మీద పాలు పెట్టి పోయావుగా—పొంగి పోతుంటే దించుతానని వెళ్ళింది" అన్నాడు గోపాల్రావు తొణక్కుండా.

అప్పుడే వచ్చిన ఝాన్సీ ముఖంమీద ముంగురులు సవరిస్తూ, "అయ్యో! పిచ్చితల్లీ! మా యింటిమీద నీ కెంత శ్రద్ధే!" ప్రేమ వున్నట్లు అభినయించింది కామాక్షమ్మ.

"అత్తగారింటి మీద శ్రద్ధ వుండదా అత్తయ్యా!" అంది ఝాన్సీ ద్వంద్వార్థంగా.

"మాకంత అదృష్టమా తల్లీ! నీవు పరాయిదానివై పోతున్నావ్!" విచారం వొలకబోసింది కామాక్షమ్మ.

"ఏది ఎట్లా జరుగుతుందో!..." అర్ధాంతరంగా అంటూ పెరటివైపు దారి తీశాడు గోపాల్రావు.

# 48

కొడుకు, భర్త ముందురోజు ఎవరిదో పెండ్లని వెళ్ళిన వాళ్ళు మధ్యాహ్నానికి కూడా రాకపోతే, తోచక శారదమ్మ గారింటికి వెళ్ళి విషయం చెప్పింది కామాక్షమ్మ.

"ప్రొద్దున ఎవరో స్నేహితురాలి పెండ్లట. కారు పంపిస్తే వేకువ జామున అయిదు గంటలకే వెళ్ళింది ఝాన్సీ కూడా— ఆటంకం రాబట్టి గాని లేకపోతే ఈపాటికి మూడు ముళ్ళు పడుండేవి..." దిగులుగా మారింది శారదమ్మ వదనం.

"వేళ రావాలమ్మా, దేనికైనా..." దీర్ఘం తీసింది కామాక్షమ్మ.

ఇంతలో కారు వచ్చి వాకిట్లో ఆగింది.

"పాపం కార్లో పంపేరు. వాళ్లెవరో మంచివాళ్ళు." అంటూ ద్వారం వైపు చూచిన శారదమ్మ నిర్ఘాంతపోయింది.

సంగతేమిటోనని చరచరా వాకిట్లోకొచ్చి చూచిన కామాక్షమ్మ ప్రాన్పడిపోయింది.

సోమశేఖరం, వైదేహమ్మ విస్మయంతో చూడసాగారు.

విజయగర్వంతో కళ్ళు మెరుస్తుంటే ఠీవిగా ముందుకు నడుస్తున్నాడు గోపాల్రావు.

కళ్ళలో ఆనందజ్యోతులు వెలగ్గా వెనుకనే వస్తు

న్నారు పసుపుగుడ్డలతో పూలమాలలతో యూన్సీసునోహార్ లు. వధూవరులు తమ తల్లులకు పాదాభివందనం చేసారు గోపా ల్రావు ఇరువురి చేతుల్లో అక్షింతలుంచాడు.

అప్రయత్నంగా ఇరువురు వియ్యపురాళ్ళు ఆశీర్వ దించారు.

"క్షమించు శారదమ్మా! మీ కూతురు పెండ్లి మీరు చూడకుండా చెయ్యాల్సొచ్చింది. మిత్రద్రోహం చెయ్య లేక, పిల్లల ఇష్టం త్రోసిపుచ్చలేక భార్య మాట కాదవలేక సంఘర్షణతో నలిగిపోయిన మీదట, ఈ నిర్ణయానికొచ్చాను. నా సాహసానికి మన్నించు..." అన్నాడు గోపాల్రావు విన యంగా.

మౌన ముద్ర దాల్చింది శారదమ్మ.

భర్తవైపు నిరసనగా చూచి తల త్రిప్పుకుని కొడుకు వైపూ, కోడలివైపూ కోపపు చూపులు ప్రసరించింది కామాక్షమ్మ.

"నన్ను మన్నించండి అత్తగారూ! మీ అమ్మాయిని మీ పర్మిషన్ లేకుండా పెండ్లి చేసుకున్నాను!" అన్నాడు మనోహర్ ప్రాధేయ పడుతున్నట్లు.

"అనుకున్న దొకటైతే, జరిగింది మరొకటి. అంతా దైవ నిర్ణయం..." నిట్టూర్చింది శారదమ్మ.

"శారదా! నువ్వట్లా అనుకోగూడదమ్మా! స్వర్గంలో వున్న బావ ఆత్మ శాంతిస్తుంది. గోపాల్రావుగారి వంటి స్నేహాభిమాని, మనోహర్ లాంటి నిజాయితీపరులూ వుండబట్టి

ఇంకా యింతమాత్రం వానలు కురుస్తున్నాయి. గోపాలరావు గారూ! మీ ఆదర్శ హృదయాన్ని శ్లాఘించకుండా వుండ లేక పోతున్నానయ్యా!" అంటూ కరచాలనం చేసేడు సోమ శేఖరం—ఆదర పూర్వకంగా అతడి వైపు చూస్తూ.

"మావయ్యా! వార్ని ప్రశంసించడం కాదు. వారిని మార్గదర్శకులుగా తీసుకుని నీవూ అలాంటి త్యాగం చేసి నప్పుడే నీ పొగడ్తలకు విలువుంటుంది." సవాల్ చేసినట్లుగా వుంది ఝాన్సీ ధోరణి.

"సమయమొస్తే అట్లాగే చేస్తానమ్మా!" అన్నాడు సోమ శేఖరం. తృప్తిగా గాలి పీల్చుకుని మనోహర్ వైపు చూచింది ఝాన్సీ. హర్షాతిరేకంతో తల పంకించాడు మనో హర్.

"శారదా! ఇంకా కూర్చున్నావేమ్మా! ఏమే! లేచి విందు ఏర్పాట్లు, తక్కిన తతంగం జరిపించండి" అంటూ పుర మాయించాడు సోమశేఖరం.

గత్యంతరం లేక కదిలేరు వదినా మరదళ్ళు.

కామాక్షమ్మ ఇంటిదారి పట్టింది.

"నీ వెక్కడికీ? వియ్యపురాలివి, మర్యాదలు జరి పించుకోకుండా ఇంటికి దారితీసేవ్!" అన్నాడు గోపాలరావు భార్యను మేల మాడుతూ.

శారదమ్మ వెళ్ళి కామాక్షమ్మ చేతులు పట్టుకుని— "ఆగండి వదినగారూ! జరిగిందేదో జరిగింది! ఇంక తప్పదు గదా? వారుంటే ఎంత సంతోషించేవారో?" అని కళ్ళ

నీళ్ళు తుడుచుకుంది. వెనుతిరిగి లోపలి కొచ్చింది కామా క్షమ్మ.

"ఝాన్సీలక్ష్మి పేరు సార్థకం చేసుకున్నావు సుమా!" చిన్నగా చెవిలో గుస గుస లాడాడు మనోహర్.

ఝాన్సీ కమనీయంగా నవ్వింది. ఆ నవ దంపతులు రమణరావు ఫొటో దగ్గరకు నడిచారు.

# 49

శేఖర్ కి నాలిక 'కాన్సర్' జబ్బువల్ల లావెక్కి మాట స్పష్టంగా రావడంలేదు. రాధ ఎంతో శ్రద్ధగా మందులు ఇస్తోంది

స్కూలు మీటింగుకు వెళ్ళుతూ,మధ్యాహ్నం తీసుకో వలసిన మందులు టేబుల్ మీద వుంచి గుర్తుచెప్పి వెళ్ళింది. తను తిరిగి వచ్చిన తరువాత ఆ మందులు అక్కడే వుండడం చూచి, "మావయ్యా! మందు తీసుకోలేదేం?" చిరు కోపంతో అధికారపూర్వకంగా మందలించింది రాధ.

"చెట్టునుంచి రాలిన కాయను ఎంతసేపని తొడిను కతికిస్తాం..." విరక్తిగా నవ్వేడు.

"మానవ ప్రయత్నం మనది. దైవనిర్ణయం అవతల..." అంటూ మందు చేతి కందిచ్చింది.

"శేఖరా! అంత నిరుత్సాహంగా మాట్లాడవాకురా!

నీ జబ్బుకే కుమిలి చస్తూంటే, నీ మాటలతో మరీ గాయం చేస్తున్నావురా !" కన్నీళ్ళు వత్తుకుంది జానకమ్మ.

* * *

"ఏమండి శేఖర్ గారున్నారా !" అంటూ పేపర్ చేత బట్టుకుని హడావుడిగా లోపలికొచ్చాడో యువకుడు.

"ఆ... వున్నారు... ఎవర్నువ్వు ?... దేనికా వురుకులూ, పరుగులూ !" విసుక్కుంది జానకమ్మ.

"ఆయనగారికి 'లాటరీ'లో రెండు లక్షలు ప్రయిజొచ్చిందమ్మా ! నే నమ్మిన టిక్కెట్టులోదే. ఈ వూరిదే. ఈయన కిచ్చిందే... నాకు గుర్తే !" డబ్బాలో రాళ్ళు పోసినట్టు చెప్పసాగాడు.

శేఖర్ పెట్టెతీసి టికెట్ చేతబట్టుకుని తాపీగా పేపర్లోకి చూపు సారించాడు.

"నిజమే ! వచ్చింది" అన్నాడు అతి సహజంగా.

జానకమ్మ వుక్కిరి బిక్కిరై పోయింది.

రాధ నిర్లిప్తంగా వుండిపోయింది.

టిక్కెట్లమ్మిన కుర్రాడు అక్కడ జరిగే కార్యక్రమాలు, ఎప్పుడెప్పుడు ఎవరెవరికి లాటరీ ప్రయిజులొచ్చిందీ గుక్క తిప్పుకోకుండా ఏక బిగువున కామా, ఫుల్‌స్టాప్ లేకుండా చెప్పుకుపోతున్నాడు.

"నీ పారితోషికం నీ కిస్తాలేవయ్యా స్వామీ ! స్పీడు తగ్గించు" అన్నాడు శేఖర్ చిన్నగా నవ్వుతూ.

# 50

రష్మీనాన్నికి మనోహర్‌తో వివాహం జరిగిన తరువాత రాధ దగ్గరకెళ్ళి క్షమాపణ వేడుకుని "రిజిష్టర్డ్ మేరేజ్" అయినా చేసేసుకుందా మనుకున్నాడు మాధవ్.

రష్మీనాన్ని లావణ్యం తనది కానందుకు,యువక చాపల్యం వల్ల కొంత కొరవగా వున్నా, ఆత్మీయుల కోరిక తీర నందుకు వెలితిగావున్నా — అవన్నీ తాత్కాలికాలని, రాధ వియోగమే బాధాకరమని తేలింది. అంతరాత్మ తను చేసింది తప్పని ఘోషించ సాగింది. సమాజానికి, హేళనకు, మనసు జంకినా - న్యాయ నిర్ణేత ఆత్మ అని నమ్మకుండా వుండ లేక పోయాడు.

పెండ్లి నిలిచిపోగానే వెళితే అది తప్పిపోయింది గనుక వచ్చానని, తనను నీచుడి క్రింద అంచనా వేసుకుంటుందని - అప్పుడు కొంతకాలం ఆగాలని వాయిదా వేసుకున్నాడు.

మళ్ళీ ప్రయాణమవ్వాలనుకుంటే, రాధ శేఖర్‌కి అతి శ్రద్ధతో ఉపచారాలు చేస్తోందని విన్నాడు. తనమీద మనసు విరిగి అతణ్ణే ఆశ్రయించ దలచుకుందేమోననిపించి విరమించుకున్నాడు. అయినా అది అసంభవమనే తోచింది.

ఇంతలో శేఖర్‌కి రెండు లక్షలు ప్రయిజ్ వచ్చిందని తెలిసింది. ఇప్పుడు వెళ్ళితే ఏదో డబ్బు అక్కరుండి,

మోసంతో గుంజుకోడానికి వచ్చాడనుకుంటుందని ఆగాడు. కాని వీలైనంత త్వరలో వెళ్లి ... రాధను ప్రసన్నురాలిని చేసుకోవాలని పరితపించ సాగాడు మాధవ్. బాధాతప్త హృదయంతో రోజులు గడుపుతూ వచ్చాడు.

ఇలా వుండగా, సుధీర్ – గోపీ చదువుకిచ్చిన అప్పు త్వరగా తీర్చమని వత్తిడి చెయ్యసాగాడు.

"రెండెకరాలు ఆడుమానం పెట్టించుకున్నావుకదా ? తొందరపడితే ఎలా ?" అన్నందుకు — ఇద్దరి మధ్య మన స్పర్థలొచ్చాయి. పర్యవసానం - మాధవ్ వేరే రూములోకి మారేడు.

# 51

శేఖర్‌కు జబ్బు ముదిరింది. నాలిక మరీ వాచిపోయి మాట రావడంలేదు. ఏది చెప్పాలన్నా కాగితం మీద రాస్తున్నాడు.

డాక్టర్ ఇంక కొద్ది రోజులు మాత్రమే జీవిస్తాడని చెప్పడం విన్నాడు.

తన పెట్టెలో బ్యాంకి పుస్తకాలు వున్నాయి తెమ్మని కాగితం మీద వ్రాసి రాధ చేతికిచ్చాడు.

తెచ్చి అతడి చేతికిచ్చింది.

ఒక్కొక్క పుస్తకం తీసి పైకం ఎంతెంత ఏఏ బ్యాంకీల్లో వేసిందీ వ్రేలితో చూపాడు.

ఇరవై అయిదు వేలు జానకమ్మ పేర వేసి వుంది.

ఇరవై వేలు నివేద పేర సిండికేట్ బ్యాంకిలో వేసి వున్నాడు. రాధ పేర యాభై వేలు. లక్ష రూపాయలు శేఖర్ పేర వున్నాయి. అయిదు వేలు విడిగా వేసి వుంచాడు.

అవన్నీ దేనికి దేనికి వేసినదీ కాగితం మీద వ్రాసేడు. "అక్కయ్య నా కోసం కార్చిన కన్నీళ్ళకు వెలకట్టి ఈ డబ్బు యివ్వడం లేదు. ఆమె లేవలేని రోజుల్లో ఆమె పోషణార్థం మాత్రమే.

తండ్రి తరువాత మేనమామకు బాధ్యత వుందంటారు. అందుకని నివేద పెళ్ళికోసం.

రాధకు నేను కట్టిన గుదిబండలాంటి తాళి మోస్తున్నందుకు భార్యగా కాదు; తనకో సంసారం ఏర్పరచుకోలేక ఒక మోడుగా వుంచినందుకు గాదు. నా పాపపరిహారార్థం కాదు. తన జీవితంలో వెలుగు లేకుండా వున్న రాధ మాధవ్‌తో కలిసి కాపరం చేయడానికి, ఓ మేడ కట్టుకుని దీపం పెట్టుకోడానికే.

చివరి లక్షా అయిదు వేలలో, అయిదు వేలు ప్రస్తుత ఖర్చులకు, నా తదనంతరం లక్ష రూపాయలు అనాథాశ్రమం కొరకు—

రాధా! నీలాంటి దౌర్భాగ్యులు లోకంలో ఎందరో

వుంటారు. రెంటికిచెడ్డ రేవడిగా బ్రతకలేక, చావ లేక దగాపడిన యువకులుంటారు. నాలాంటి మూర్ఖుల జీవానికి జీవచ్ఛవాలైన స్త్రీలకు కొందరికైనా నా ఆశ్రమం సేవజేస్తే - నాకు ఆత్మశాంతి వుంటుంది. అందుకే యీ భారం నీపై మోపుతున్నాను. కాదనవనే ఆశతో అర్థిస్తున్నాను."

అది చదివిన రాధ హర్ష పులకితమైంది.

"మావయ్యా! ఇంత అమృత హృదయాన్ని ఎందుకు లోపల్నే బంధించావు? ... నాకిచ్చిన ఈ సదవకాశాన్ని శక్తివంచన లేకుండా వినియోగించడానికి ప్రయత్నిస్తాను... నా జీవితం ప్రజలకు ఏ విధంగా తోడ్పడుతుందా? అని అహర్నిశలు యోచించేదాన్ని. పరిష్కారమార్గం చూపించి, పుణ్యం కట్టుకున్నావ్!" అంటూ పాదాలకు నమస్కరించింది.

ఆప్యాయంగా రాధ శిరస్సు నిమిరాడు శేఖర్.

మళ్ళీ కాగితం మీద యిలా వ్రాశాడు.

"నీవు కేవలం జీవితాన్ని త్యాగం చెయ్యవద్దు. నేను జారవిడుచుకున్న ఆణిముత్యాన్ని మాధవ్‌కు సమర్పించు. మాధవ్ వల్ల దోషంలేదు. నిన్ను చేజిక్కించుకుందామనే దురాశతో మాధవ్ నిన్ను పెండ్లి చేసుకుంటే నిన్ను చంపేస్తానని బెదిరించాను. అందుకే అతడు నీ మనసు విరవడానికి అలా ప్రవర్తించాడు...మాధవ్‌ను మన్నించి స్వీకరించు...వజ్రమైనా, బంగారంలో పొదగనిదే రాణించదు...

పెట్టెలో దాస్తే వన్నె తగ్గుతుంది. అలాగే నీలో ఎంత మంచితనమున్నా తోడులేనిదే రక్తి కట్టదు. ... ఇది నా ఆఖరు కోరిక ... నెరవేరుస్తానని మాటివ్వు ..." చేయి చాచాడు.

"ప్రమాణం చెయ్యను మామయ్యా! ప్రమాణాలు చేసి, వాటికి విలువిచ్చి...నా బ్రతుకును పొడిగించుకుని పాట్లు పడుతున్నాను. మాధవ్‌తో నా కలయిక అసంభవం. అనాధాశ్రమం నడిపించడం ఖాయం." దృఢనిశ్చయం ప్రస్ఫుటమైంది ఆమె ముఖ భంగిమలో.

# 52

శేఖర్ చనిపోయిన తరువాత జానకమ్మ మరీ క్రుంగి పోయింది. మనస్సు పశ్చాత్తాపంతో, బాధతో దహించి వేస్తుంటే నోరులేని మూగదానిలా అయిపోయింది. కళ్ళు మాత్రం నిర్విరామంగా వర్షిస్తూనే వున్నాయి. ఓటమితో మరీ దిగజారిపోయింది.

రాధ మంగళసూత్రాలు తెచ్చి జానకమ్మ చేతిలో పెట్టింది. జానకమ్మ నిర్ఘాంతపోయి చూడసాగింది.

"నీ నమ్మకం ప్రకారం, నీకిచ్చిన వాగ్దానం నెరవేర్చుకోడానికి నేను నా గుండెల మీద వుంచుకున్నాను. కాని

మావయ్యా ప్రాణాలు అవి నిలపలేదని తెలిసి నీకే యిచ్చే స్తున్నాను. నన్ను తప్పు పట్టకమ్మా!" అంటూ వెను తిరిగింది.

"మంగళసూత్రాలు నీ మెడలో వుంచగలిగాను కాని వాడి ప్రాణాలు కాపాడ గలిగేనా తల్లీ! అటు వాడిని దక్కించుకోలేక ఇటు నీకా అభిమానం పొందలేక రెంటికీ చెడ్డ రేవణ్ణయినా నే... తల్లీ..." అంటూ కూతుర్ని పట్టు కుని భోరున ఏడ్చింది జానకమ్మ గుండెలు పగిలేలా.

కొన్ని నాళ్ళు రెండు భారాలు మోసింది. ఒకటి ఇతరులు వేయించింది, ఒకటి తనే బుద్ధిపూర్వకంగా వేసు కుంది. కొన్ని బంధాలను ఛేదించుకుని తెరిపిన పడ్డట్టు తేలిక పడింది రాధ హృదయం.

వ్యథలన్నీ తాము సృష్టించుకున్నవే అనుకుంటే దేనికీ ప్రాముఖ్యత లేదనిపిస్తోందామెకు.

నెల్లూరు నుంచి శంకారం వెళ్ళే రోడ్డు పక్కన ఎవరిదో మెట్టచేను 'బిల్డింగు' కోసం కొనింది రాధ. సోము శేఖరం, గోపీ, రవీ ఎవరికి తోచిన సహాయం వాళ్ళు చేస్తు న్నారు.

శేఖర్ పేరనున్న లక్ష... శరణాలయం నడిపించడానికి, పరిశ్రమలకు కావలసిన పరికరాలకూ వుంచి, యాభై వేల 'ఎస్టిమేట్' తో బిల్డింగు ప్లాన్ వేయించి, తనకోసం బ్యాంకిలో వుంచిన యాభై వేలు వినియోగించింది.

కట్టడం చకచక సాగిపోతోంది. కొద్దిరోజుల్లో పూర్తి కావస్తోంది.

కిరణ్ నుంచి ఒక జాబు వచ్చింది. తను పెళ్ళి మాను కుని, ప్రజాసేవ కోసం తన జీవితాన్ని అంకితం చెయ్యా నున్నట్లు, ఆమె ఆశ్రమంలో, తనతో అవసర ముంటే తప్పక వచ్చేస్తానని.

ఆమె త్యాగశీలతను మెచ్చుకుంటూ, తనకు అవ సరమేనని, ఎప్పుడు రావలసిందీ తెల్పుతాననీ ప్రత్యుత్తరం యిచ్చింది రాధ.

సోమశేఖరం కోసం కబురు పంపితే రాలే దానాడు. విషయం తెలుసుకోడానికి వాళ్ళింటి కెళ్ళింది రాధ. ఆ దినం సోమశేఖరంగారి రెండెకరాల అడుమానం మాగాణి వేలం వేస్తున్నట్టు, అది కొండా నాయుడిగార్కి తనఖా పెట్టి వున్నట్టు తెలుసుకుంది. వెంటనే తను గోపీ చదువుకోసం బ్యాంకిలో వేసి వుంచిన డబ్బు తీసుకుని అక్కడికి వెళ్ళింది. తనే వేలంలో పాట పాడి కాజెయ్యాలనుకున్న కొండా నాయుడు పథకం పారలేదు. ఆ డబ్బు రాధ కట్టేసి వేలం రద్దు చేయించి వచ్చింది.

తండ్రికి సహాయంగా వేలం వేయించడానికి వచ్చిన సుధీర్ ముఖం పొయ్యిమీద కాలిన పెనంలా మాడి పోయింది. మరొకమారు పరాభవించ బడ్డానని ఫీలయ్యాడు.

"అమ్మా రాధా! నీ డబ్బులో ఎందుకిచ్చావమ్మా! నీకెందుకు మా మీదింత అభిమానం? నిన్నెట్లా అభినందించాలో మాటలు రావడం లేదమ్మా!" అన్నాడు సోమ శేఖరం కృతజ్ఞతా పూర్వకంగా.

"అది నా డబ్బుకాదు మామయ్యా! గోపీ డబ్బే! నేను గోపీ కోసం... వేరే బ్యాంకిలో వేసి వుంచాను. నా మాట మీదనే మీ పెద్దబ్బాయి గోపీని 'మెడిసన్' లో చేర్పించాడు. అవతల సుధీర్ దగ్గర తీసుకుంటున్నా నంటూ వ్రాసేడు. నేను మొదటే అతడు మంచివాడు కాదు...వద్దని చెప్పేను... వినలేదు. ఎప్పటికైనా యిలా జరుగుతుందని తెలిసే వుంచాను..." అని వివరించింది రాధ.

"నీవు...నీవు...నాకేం మాటలు రావడం లేదమ్మా! నీవు అందరికీ వెలుగునిచ్చి కాలిపోయే కొవ్వొత్తివమ్మా!"

"మనం సుఖపడే దానికంటే మనవల్ల సుఖపడుతున్నా రంటే ఆ తృప్తి చెపితే అర్థం కానిది, అనుభవంలో తెలియ వలసింది" నిర్లిప్తంగా అంది.

# 54

చిరపరిచితమైన దస్తూరి చూచి చకితురాలైంది రాధ. అది మాధవ్ నుంచి వచ్చిందని గ్రహించింది.

"రాధాదేవీ!

మొదటి కోర్కె - చింపి వెయ్యకుండా చదువు. ఈ రోజు అసలు విషయం తెలుపుతున్నాను. నేను సమాజానికి జడిసే పిరికివాణ్నయినా, స్వార్థంతో ఆత్మీయుల ఆనందం కోసం పెండ్లికి ఒప్పుకున్న నీచుడిగా, భ్రమరంలా అందమైన కుసుమాన్ని ఆశించి నిన్ను నిరసించానని నీవు భ్రమ పడినావు. ఏది ఏమైనా, నిన్ను గాయపర్చిన, మనసు విరిచిన మాట వాస్తవమే. నేను శిక్షార్హుడనే. కాని దాని మరుగున కఠిక సత్యమొకటుంది. అది శేఖర్ - నిన్ను ఆశించి అతడికి కాకుండా చేస్తే, నీ ప్రాణం తీస్తానన్నాడు. అది నీకు చెపితే నిన్ను వదలించుకోడానికి వేసిన ప్లానని నన్ను విశ్వసించక పోవచ్చని, లేక నీ మరణానికి వెరవక పెండ్లికే సిద్ధపడవచ్చు. దాని పర్యవసానాన్ని నేను భూతద్దంతో చూచినట్లు వూహించుకుని భయపడ్డాను. నిన్ను పొందడానికంటే నీవు జీవించి వుండడానికే ప్రాముఖ్యత నిచ్చాను. ఇప్పుడు నన్ను నేరస్థుడిగానే చిత్రిస్తావా! నాకు దక్కని ఝాన్సీ కంటె, బంధువుల అసంతృప్తి కంటె, నీ వియోగమే నన్ను దహించి

వేస్తోంది. నీవు లేనిది నేను బ్రతకలేననిపిస్తోంది. నీవు నాకు కావాలి! రాధా కావాలి!

ఝాన్సీలో పెండ్లి తప్పిపోయినప్పటి నుంచి జరిగిన సంఘటనల్లో అన్నీ నీ దరికి రాకుండా చేసినవే. సాహసించి వస్తే నీవు అపార్థం చేసుకుని నా ముఖం చూడవని భయపడ్డాను.

మన ప్రేమ కథ వ్రాస్తున్నాను. ఇంకా ముగించలేదు. దాన్ని సుఖాంతమో - దుఃఖాంతమో - చెయ్యాల్సినది నీ చేతిలో వుంది - నీవు అనాథాశ్రమం నిర్మిస్తున్నావని విన్నాను. నీవు వంటరిగా నీ జీవితం అంకితం చెయ్యనక్కర్లేదు. ఆదర్శ దంపతులుగా మనం దానిని నిర్వహిద్దాము.

నన్ను అనుగ్రహించలేకపోతే ఆజ్ఞాపించు. నీ ఆదేశాన్ని శిరసావహిస్తాను.

మాధవ్"

పూర్తిగా చదివి విషాదంగా నవ్వుకున్నది రాధ. కాగితం తీసి ఏదో వ్రాసి పెట్టెలో పెట్టింది.

సోమశేఖరం రాధతో మాట్లాడాలని, ఇంట్లో వుండమని చెప్పిపంపాడు. దేనికైనదీ అర్థం కాలేదు రాధకు.

సోమశేఖరంతో పాటు గోపీ వచ్చాడు. గోపీ ఎంతో అవసరం అయితే గాని రాడు.

"రాధా! నా మాటలు సావధానంగా విని నీ అభీష్టం

తెల్పు. నీవెటూ రేపు బిల్డింగు పూర్తి కాగానే అక్కడికి మాకాం మారుస్తావు. అప్పుడు ఇంటి గొడవలకూ, నీకూ కుదరదు. ఆ భారం కొంత నేను భరిద్దామనుకుంటున్నాను. గోపీకి నివేదనిచ్చి పెళ్ళి చేద్దాం... మా అమ్మ మాదగ్గ రుంటుంది. మేము క్రొత్తవాళ్ళంకాదు...ఏమ్మా!" అన్నాడు సోమశేఖరం.

"పెండ్లి విషయాలు మనం నిర్ణయించేవి కావు మావయ్యా! వాళ్ళకై వాళ్ళు యిష్టపడి చేసుకుంటే బావుం టుంది..." అర్ధాంగీకారాన్ని సూచించింది రాధ.

"గోపీ ఎప్పటినుంచో చెవుతున్నాడు. నేనే సందే హించాను. డబ్బు రాగానే ధనానికి ప్రలోభపడి అడుగు తున్నాననే అభిప్రాయం కలుగుతుందని నేను తొందర పడ లేదు."

"నివేదను అడిగి వస్తాను ... అమ్మ వుద్దేశమేమిటో మీరు నేరుగానే అడగండి" అంది రాధ తను బలవంతం చేసి నట్టుండకూడదని.

అప్పటి వరకూ తూము తలుపు రెక్క చాటునుండి వింటున్న నివేద గబుక్కున గోడ చాటుకు వెళ్ళింది.

చెల్లెలి అభిప్రాయం కనుక్కొని గోపీని చేసుకోడానికి అంగీకరించినట్లు చెప్పింది రాధ.

"ఏవమ్మా! జానకమ్మా మీ వదిన నీకు క్రొత్త కాదు. మనం మొదట్నుంచి తెలిసిన వాళ్ళ నేను స్వార్థంతో మిమ్మల్ని చేరదీస్తున్నానని అపోహ పడవద్దు. మీ డబ్బు మీ స్వంత ఖర్చులకు పెట్టుకోవచ్చు. నీ మనసు

గాయపడివుంది. కొడుకూ కోడలూ దగ్గరవుండే అదృష్టాన్ని కోల్పోయినావు. తమ్ముడు అట్లా కాలం తీరిపోయినాడు. సౌదమ్మ కాపరం ఆ విధంగా అయిపోయింది... ఇంక మిగి లిన యీ పిల్లను పరాయి చోట యిస్తే ఏం కష్టపడుతుందో ననే సందేహం లేకుండా మీ వదిన కడుపులో పెట్టుకుని కాపాడు కుంటుంది..." అన్నాడు ఆత్మీయంగా.

"సరే... యింతదూరం ప్రాథేయపడుతుంటే నేనెం దుకు మొండిదాన్ననిపించు కోవాలి..." అంది చిప్పిల్లిన కన్నీరు ఆపుకుంటూ గత జ్ఞాపకాలు ఆమెను కలచి వెయ్యగా.

గున గున నడుచుకుంటూ అక్కడి కొచ్చిన పాపను చూస్తూ "ఈ బేబీని కూడా మనం తీసుకెళదాం నాన్నా!" అన్నాడు గోపీ పిల్లను దగ్గరకు తీసుకుంటూ.

"అక్కర్లేదు గోపీ... అది నా ప్రాణం. వున్నన్ని రోజులు నాతోనే వుంటుంది. సౌద చివరి కోరిక అది. ఎలాగూ చిన్న కాన్వెంటు కూడా ఓపన్ చేస్తాను. అది అక్కడే చదువు కుంటుంది..." చిక్కు విడదీసినట్టు విష యాన్ని వివరించింది రాధ, గోపీ చేతుల్లో నుంచి తీసుకుని పాపను హృదయానికి హత్తుకుంటూ.

"మావయ్యా! మీకు నేనెలా ధన్యవాదా లర్పించాలో అర్థం కావడం లేదు. నా బంధాలన్నీ మీరు చుట్టుకుని నాకు విముక్తి ప్రసాదించారు. ఎలాంటి లోకహిత కార్యాలకైనా ఎంతోమంది సహకారాలు అవసరం. ఏ

ఒక్కరూ... దాన్ని సాధించలేరని రుజువు చేసారు." అంటూ నమస్కరించింది.

"పిచ్చితల్లీ! నీవు చేసిన త్యాగాల్లో, సహాయాల్లో ఇదెంతమ్మా? నీవు జీవితాన్నే అంకితం చెయ్యబోతున్నపుడు మాదెంత! ఉడతాభక్తి... అదే నా తృప్తి..." అన్నాడు సజల నేత్రాలతో సోమశేఖరం.

నివేద కాఫీ టిఫిన్ తెచ్చి యిచ్చింది.

అక్కర్లేదన్నాడు గోపీ నివేద వైపు వోరగా చూస్తూ.

చిరుసిగ్గు దొంతరతో "తీసుకోరూ!" అనే అర్థంగా గోముగా చూసింది గోపీవైపు.

"గతికితే అతకదనా!" అన్నది జానకమ్మ చిరునవ్వుతో.

"ఎంగిలి కంచాల్లో తిన్నప్పుడో..." అన్నాడు రాధ వైపు చూస్తూ.

"అవును పాపం అల్లుడౌతాడని తెలీక... ఎంగిలి చేసినవి కూడా పెట్టేదాన్ని..." అంది రాధ కాస్తంత ఛలోక్తి జోడిస్తూ.

"శుభస్య శీఘ్రం... వీలైనంత త్వరలో ముహూర్తాలు పెట్టుకుందాం."

"మాధవ్‌ను ఎక్కడన్నా చూడమంటావట్రా మనువు అంటే... తమ్ముడికి చెయ్యండి, ప్రస్తుతం నేను చేసుకోను— అన్నాడు..." అది చెపుతున్నపుడు సోమశేఖరం గొంతులో జీర ఏర్పడింది.

# 56

"మాధవా! గోపీకి నివేదనిచ్చి చేయాలని నిర్ధారణ అయింది. మరి నువ్వు సరేనంటే సంబంధాలు చూస్తాం... ఇద్దరు కోడళ్ళూ ఒక్కసారే ఇంటి కొస్తారు." అన్నాడు సోమశేఖరం నిశితంగా కొడుకువైపు చూస్తూ.

"గోపీకి నివేదతో మనువు స్థిరపడినందుకు చాలా సంతోషం నాన్నా! కాని నా విషయం అంటారా! మనువు చూడక్కర్లేదు. ఆ అమ్మాయిని మీరు వొప్పుకోరని సందేహిస్తున్నాను... మీకు తెలీకుండా చేసుకోను. మీరు అంగీకరించక పోయినా చేసుకునేది మాత్రం ఖాయం..."

"ఎవర్రా! నిన్ను ఆకట్టుకున్న అదృష్టవంతురాలు! చెప్పు... ఎవరైనా సరే, నేను కాదనను. నీ సంతోషమే నా సంతోషం." మెరిసే కన్నులతో మాధవ్ వంక చూచాడు.

"వాడి కిష్టమైతే సరా! కులం, గోత్రం ఏమిటో, ఏ వితంతువో, ఏ మొగుడొదిలిందో ఏ వేశ్యో అయితే ఒప్పుకుంటారా?" నిలదీసి అడిగింది వైదేహమ్మ, అలాంటిదయితే నేను సమ్మతించనని పరోక్షంగా వ్యక్తం చేస్తూ.

"ఎవరైనా సరే వాడు మెచ్చి చేసుకున్న పిల్ల నా కోడలు." అన్నాడు దృఢంగా.

"చాలు నాన్నా! నాకా భరోసా చాలు. మరో

కోరిక నెరవేర్చాల్సి వుంది. ఆనాడు ఇంటర్వ్యూ నుంచి తీసు కొచ్చిన నాడు వాగ్దానం చేసేవే..."

"అవునవును జ్ఞప్తికొచ్చింది. అప్పటి పరిస్థితిలో కాదన్నాను. ఇప్పుడు సిరాక్షేపణగా సమ్మతిస్తాను...ఎటొచ్చీ ఆ వచ్చే పిల్ల ఒప్పుకోవాలిగా!" తమాషాగా నవ్వేడు.

"అది నా కొదిలెయ్యండి...మీ పర్మిషన్ అందుకున్నాగా!" కాస్తంత తేలికపడ్డట్టు అనిపించింది మాధవ్‌కు.

"నేను కాబోయే మరదల్ని చూచి, జానకమ్మ అత్తయ్యతో మాట్లాడివస్తా" అంటూ లేచేడు.

"మరిచాను....రాధ అనాధాశ్రమం నిర్వహించడానికి బిల్డింగ్ కట్టిస్తున్నది" అన్నాడు.

"చూచాను నాన్నా! అక్కడ రాధ లేదు. ఇంటికి వెళ్ళిందంటే...వచ్చేసాను..." అంటూ గుమ్మం దాటాడు.

# 57

మాధవ్‌కు నివేద ఎదురైంది గడపలో. రాధ కోసం అతడి కంళ్లు వెదుకుతుంటే నివేదను పలకరించాడు.

"నీవు మా యింటి కోడలు కాబోతున్నావట. కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు ఆనందం పుట్టిపడే గొంతుకతో.

"థాంక్స్" అంది తల వంచుకుని.

అతడు ఎవరికోసం వెతుకుతున్నాడో అర్థమైంది నివేదకు. "అక్కయ్య...కల్యాణం దగ్గరి కెళ్ళింది. మీరొస్తే లెటరివ్వమని చెప్పి వెళ్ళింది" అంటూ లోపలికెళ్ళి ఓ కవరు తెచ్చి చేతి కందించింది.

కుర్చీ ముందుకులాగి కూర్చోమని చెప్పింది.

రాధను చూడలేక పోయినందుకు బాధగా వుంటే, జాబేమిటో కీడునే శంకించింది మనసు కంపించే హస్తాల్ని అదుపులో పెట్టుకుంటూ నిబ్బరం తెచ్చుకుని చలించే చూపుల్ని స్థిరంగా నిలపడానికి ప్రయత్నించాడు. కాగితం విప్పి అక్షరాలు ఒక్కొక్కటే నిశితంగా చదవసాగాడు.

"మాధవరావుగారికి,

మీరు వ్రాసిన లెటర్ అందింది. మీ రెప్పుడో ఒకనాడు వస్తారని వూహించాను. అందుకే నా మనోదర్పణాన్ని మీ ముందు విశదీకరిస్తున్నాను. బాగా అర్థం చేసుకోండి. మీ మీద నాకేం కోపంలేదు. మీరంతా నా మంచినే ఆశించారు. అది మరో విధంగా పరిణమించింది. ఏది ఎలా జరగాలో ముందే నిర్ణయమై వుంటుంది. కాని దానికి మనమే కారకులమని అనుకోవడం మానవ సహజం.

ఒక్కొక్కరి జన్మ కొన్నిటికోసం నిర్దేశింపబడి వుంటుంది. దేముడంటూ వుంటే అతడి అజ్ఞాత హస్తమే కావచ్చు, లేక విధి అనేది మరొకటి వుంది, అది కావచ్చు. ఏది ఏమైనా మనం నిమిత్తమాత్రులం అనేది యదార్థం. అయితే మనం చేసేదల్లా ప్రయత్నం.

మీరు నిజంగా నా ప్రాణం రక్షించడానికే అభిన యించి ఉండవచ్చు. కాదనను. పొరపాటున చెయ్యిజారి పడిన రాయయినా, కావాలని విసిరినా అది గాయం అవుతుంది. ఆ మచ్చ ప్రతిక్షణం విషయాన్ని గుర్తుచేస్తూ వుంటుంది. విరిగిన పాలు ఎంత ప్రయత్నించినా మామూలు పెరుగు కాలేదు.

ఆఖరి క్షణాల్లో మావయ్య నాకు ద్రోహం చేసేనని ఎంతో పశ్చాత్తాప పడ్డాడు...మీరూ పశ్చాత్తాపపడుతూ వ్రాసేరు! మీ రిరువురు చేసింది ద్రోహం గాని, అన్యాయం గాని కాదు...మహోపకారం.

ఆనాడు మావయ్య నన్ను నిరసించక పోక పోతే మీరు ఆశించేవారు గాదు. మీరు నా మనసుకు గాయం కలిగించక పోతే నాకీ సదవకాశం లభించేదికాదు.

ఆనాడు నాకు అన్యాయం జరిగిందని ఆక్రోశించాను. కాని పునర్జన్మ ప్రసాదించిందని ఆనందిస్తున్నా నీ నాడు.

మీ మీది కోపంతో, నా జీవితం మీది విరక్తితో ప్రాణాలు తీసుకుందామని 'హుసేన్ సాగర్'కి వెళ్ళేను. అన్నయ్య మాటలు గుర్తుకొచ్చి జ్ఞానోదయమైంది.

ఎవరివల్ల ఎక్కువ ప్రేమించబడతారో, వాళ్ళవల్ల నిరసింపబడినప్పుడు,ఆ ఘాతానికి తట్టుకోలేరు. అందుకే అందరి

పట్ల సమభావం కలిగే పరిస్థితిని ఏర్పరచుకుంటున్నాను. అభి మానం గల వ్యక్తిని అగాధంలో వేసినా భరించగలదేమో కాని తను కలలో గూడా ఊహించని అభాండాలని సహించ లేదు. అదీ ఒక గుణపాఠమైంది.

మీరు నన్ను స్వీకరించి పెండ్లి చేసుకుని వుంటే, నా సంసారం అంటూ గిరి గీచుకుని, ఆ పరిధిలోనే స్వర్గం వుందని, కుడితిలో ఎలుకలా కొట్టుకలాడిపోయే దాన్నేమో! ఇతరులకు ఏ విధంగా గూడా వుపయోగ పడేదాన్ని కాదు. అందుకే, భగవంతుడు కొందరికి వాళ్ళదంటూ లేకుండా చేస్తాడు. ఆయన ఆడించే నాటకంలో మాలాంటి వాళ్ళదో ముఖ్యపాత్ర. మాలాంటి వారిని సృష్టించి కొందరికి ఉపకరింప జేస్తాడు.

రాగజలధిలో కొట్టుకులాడుతూ సతమతమయ్యేకన్నా, వొడ్డునపడి స్వేచ్ఛగా ప్రజాసేవ చెయ్యడం ఎంత అదృష్టం.

మీరు సేవ చెయ్యదలచుకుంటే నాతోనే కలిసి చెయ్యక్కర్లేదు. మీరు స్వయంగా చెయ్యగలిగిన వెన్నో వున్నాయి. ఒక వ్యక్తిగా మా ఆశ్రమానికి వచ్చి మీరు సలహాలివ్వవచ్చు ... మీరిచ్చిన కానుక మోసే శక్తి నాకు లేదు. అందుకే రెండు బంధాల నుంచి విముక్తిపొంది, మావయ్య నామీద వేసిన భారాన్ని నిర్వహించగలననే నమ్మకంతో ముందంజ వేశాను.

మీా వొక్కరి సంతోషం కోసం మరెందరి ఆనం దాన్నో దూరం చెయ్యలేను.

నాకు చదువు, సహకార గుణాలు వున్నాయి. కాని కొందరి చేత దూరదృష్టి లేక వంచించబడి, సమాజంచేత నీచంగా చూపబడుతూ, స్వయంకృతాపరాధానికి కాని, ఒకరు చేసినదానికిగాని ప్రాయశ్చిత్తంగా క్షణక్షణం చిత్రవధ గావింపబడే వారికి, నేను సహాయపడి— వారి కన్నీరు తుడువ గలిగితే, మనిషిగా నిలబెట్టి వారిదీ ఒక జీవితమేనని నిరూపించ గలిగితే, వారికీ ప్రపంచంలో ఒక స్థానం వుందని చూపగలి గితే, అదే నాకు తృప్తి. అదే నా ధ్యేయం. అదే నా జీవితానికి అర్థం, పరమార్థం.

-రాధ"

మాధవ్ కవర్లో జాబు వుంచబోతుంటే రాధా మాధ వుల దంతపు డాలర్ చేతికి తగిలింది. అది ఆనాడు రాగ బంధానికి నాంది అయింది. ఈనాడు దానిని ఛేదించుకుని తిరిగి తన చేతికొచ్చింది. అతడి కన్నీటి బిందువులు దాని నభిషేకిం చాయి. కంపించే చేతుల నుంచి జారి క్రిందపడింది. కన్నీళ్ళు తుడుచుకుని లేచి నిలబడ్డాడు.

నివేద దీనంగా చూస్తూ ఎదురుగా నిలిచి వుంది.

"నివేదా ! రాధాదేవి వుపదేశాలు శిరోధార్యంగా ఆచరిస్తానని చెప్పు. ఆమె కోరిన చివరి కోరికగా మా చరిత్ర

వ్రాసేను. ఆఖరు వాక్యాలకోసం ఆగాను. అవి పూర్తిచేసి అచ్చుకిస్తాను. నాకు మిలిటరీలో సెలక్షన్ వచ్చింది. ఆఖరు సారిగా కలిసి రాధ అభిప్రాయం కనుక్కొని వెళదామని వచ్చాను.

ఆమె అంగీకరిస్తే సంసార బంధీనయిపోవాలనుకున్నాను, కాని... కాని పరోక్షంగా నన్ను దేశసేవకు నిర్దేశించింది. ఆమె అనాధులకు అంకితమైతే నేను దేశమాతకు అంకితమౌతాను. తను ప్రజాసేవకు కంకణం కట్టుకుంటే నేను దేశసేవకు కంకణం కట్టుకుంటున్నానని చెప్పు..." తన వాక్యం పూర్తి కాకుండా అక్కడున్న రాధ ఫొటో వంక లిప్తపాటు తదేకంగా చూసి స్వర్గంలో తల పంకించి గాంభీర్యంగా ముందుకు కదిలాడు కొందరికి ప్రియపుత్రుడుగా మాధవ్ !

-: స మా ప్త ము :—